

1964 మే 4 వ తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరుగా ప్రమాణస్వీకారం చేస్తున్న కొత్త గవర్నరు శ్రీ పట్టం థానుపిళ్ళై.

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 8 జ్యేష్ఠ - ఆషాఢ 1886 శకం
సంచిక : 8 జూన్, 1964

## విషయ సూచిక



ముఖచిత్రం : కాగితాపు బుట్టబొమ్మలు

సంవత్సరం చందా — రు. 3—00
విడి ప్రతి రు. 0—25 నయాపైసలు.

* రచయితల భావాలతో ప్రభుత్వం యేకీభవించవలసిన పనిలేదు.

# ముఖ్యమంత్రిలేఖ

ప్రియమైన చదువరీ !

మనకు మన స్వంత సమస్యలు అనేకం వున్నాయి. వీటిలో కొన్ని అత్యవసరమైనవి కూడా. అయినప్పటికీ ఒక్కొక్కప్పుడు మనం తక్షణమే చేపట్టవలసిన ముఖ్యమైన జాతీయ అంశాలు ఉత్పన్నమవుతుంటాయి. పాకిస్తాన్‌లో అల్ప సంఖ్యాక వర్గాల వారిని అణచివేస్తున్న ఫలితంగా తూర్పు పాకిస్తాన్ నుంచి పురుషులు, స్త్రీలు, పిల్లలతో సహా అనేకమంది ప్రజలు తమ పూర్వ స్థానాలను విడిచి మన దేశంలోకి ప్రవాహంలా వస్తున్నటువంటి దుఃఖకరమైన పరిస్థితులను గురించి మీ కందరికీ తెలుసు. సంకుచితమైన మత దురభిమానానికి గురైన ఈ బాధితులకు మనం ఆశ్రయం ఇచ్చి, సవ్యజీవనాన్ని ప్రసాదించి వారి పునరావాసానికి తోడ్పడాలి. చారిత్రిక కారణాలవల్ల మరో జాతిగా పరిగణించబడుతున్నప్పటికీ వారు మనరక్తసంబంధీకులే. భారతప్రభుత్వం చేసిన అభ్యర్థనను పురస్కరించుకొని ఇలాంటి 2,000 మంది శరణార్థులకు పునరావాసం కల్పించడానికి మన ప్రభుత్వం అంగీకరించింది. పునరావాసం కల్పించడమంటే శరణార్థులకు తాత్కాలికంగా ఆశ్రయం, ఆహారం, వస్త్రాలు మాత్రమే సమకూర్చడం కాదు, ఇంకా అనేక విధాల తోడ్పడవలసిఉంటుంది. నిర్వాసులు తాము అలవాటు పడినటువంటి పద్ధతులలోనే జీవనోపాధి ఆర్జించుకోగలగడానికి వీలుండే విధంగా మనం వారికి శాశ్వతమైన ఆవాసంచూపాలి. ఈ నిర్వాసులలో చాలామంది అడవులు, కొండ ప్రాంతాలకు చెందినవారు. వీరు కార్యదక్షులు, ఓర్పు కలవారు. బాగా కష్టించి పనిచేయగలరు. అందుచేత ఆదిలాబాదు జిల్లా కడంబ, ఇసేగాం అటవీ బ్లాకులలోని సుమారు 12,000 ఎకరాల అటవీ భూములను వీరి పునరావాసం నిమిత్తం ప్రత్యేకించే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నది. ఈలోగా ప్రజానీకం ముఖ్యంగా ఆదిలాబాదు జిల్లావారు దురదృష్టవంతులైన ఈ సోదరులకు ఉదారస్ఫూర్తి భావంతో స్వాగతం చెప్పగలరనీ, వారు ఇచ్చట వినూత్నమైన, ప్రయోజనాత్మకమైన జీవితాన్ని ప్రారంభించగలిగేటట్లుగా వారికి సాధ్యమైన సహాయమంతా చేయగలరనీ నేను విశ్వసిస్తున్నాను. వారు మనకు ఉపయోగకారులుగా నిరూపించుకోగలరని కూడా నేను నమ్ముతున్నాను.

ధరల పెరుగుదల ఇప్పుడు అన్ని తరగతుల ప్రజలకూ ఒక జటిల సమస్యగా పరిణమించింది. దీనిని అరికట్టడానికి ప్రభుత్వం తీవ్రంగా కృషిచేస్తున్నది. గత కొన్ని నెలలుగా కేవలం వడ్లు, బియ్యం ధరలే కాకుండా ఇతర ఆహారధాన్యాలు, పప్పుధాన్యాలు, నూనెగింజలు, బెల్లం, సంబారం, సుగంధద్రవ్యాల ధరలుకూడా పెరుగుతున్నట్లు కనిపిస్తుంది.

ప్రజలకు అత్యవసరములైనటువంటి పదార్థాలన్నీ సరసమైన ధరలకు లభ్యమయ్యేటట్లు చేయడమే ప్రభుత్వం లక్ష్యం. బియ్యానికి సంబంధించినంతవరకు ప్రభుత్వం ఇటీవల తీసుకున్న గట్టి చర్యలను గురించి మీకు తెలిసిందే. హర్తాళ్ మొదలైన చర్యలకు దిగుతామని బెదిరించిన ధాన్యం వర్తకులు తరువాత ప్రభుత్వంతో సంపూర్ణంగా సహకరిస్తామంటూ అంగీకరించిన విషయం కూడా మీరు ఎరిగిందే. మన రాష్ట్రంలో బియ్యాన్ని ప్రధాన ఆహార ధాన్యంగా ఉపయోగిస్తారు. ప్రజలు ప్రత్యామ్నాయమైన ఆహారాలను అలవాటు చేసుకోవాలని పదేపదే విజ్ఞప్తి చేస్తున్నప్పటికీ, బీద ప్రజలు దీనికి అలవాటు పడడానికి కొంతకాలం పడుతుంది. ఈ లోగా వారు ఇప్పుడు అలవాటుపడిన ఆహారధాన్యాలను వారు చెల్లించదగ్గ ధరలకు పొందగలగాలి. కనుకనే ప్రభుత్వం, బియ్యం సరఫరా, పంపిణీ సక్రమంగా జరగడానికి వీలుగా తగు చర్యలు తీసుకోవాల్సి వచ్చింది. నిజానికి మన రాష్ట్రంలో బియ్యం కొరతలేదు. తలవని తలంపుగాఏర్పడే అవసరాల సందర్భంలో ఉపయోగించేందుకై అధిక పరిమాణంలో ధ్యానం నిలువచేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. చౌక దుకాణాల ద్వారా ధ్యానం పంపిణీ సక్రమంగా జరపడానికి చర్యలు తీసుకోబడుతున్నాయి. రాజధానీ నగరంలోనూ, జిల్లా పట్టణాలలోనూ అనేక చౌకదుకాణాలను తెరవడం జరిగింది. 1962-63వ సంవత్సరంలో ప్రారంభించిన వినియోగదార్ల సహకార సంఘాల పథకం క్రింద ప్రభుత్వోద్యోగుల నిమిత్తం వినియోగదారుల విక్రయ శాలలను కూడా తెరవడం జరిగింది. సాధారణ ప్రజలనిమిత్తం కూడా, 50 000 కంటే అధిక జనాభాగల పట్టణాలలో వినియోగదార్ల విక్రయశాలలను నెలకొల్పడాన్ని ఉద్దేశించే కేంద్ర ప్రభుత్వపు పథకం క్రింద 16 విక్రయశాలలను నెలకొల్పారు. వీటిలోబియ్యమేకాక చక్కెర తదితర అత్యవసర పదార్థాలను కూడా అమ్ముతారు. మే నెలలో దక్షిణ మండలం ఆహార మంత్రుల సమావేశం జరుగుతుంది. వారు ఈ పరిస్థితిని గురించి చర్చిస్తారు. అత్యవసర ఆహారధాన్యాల ధరలను నిలకడగా వుండడానికి దోహదం చేయగల ఏవైన ఖచ్చితమైన విధానాలు ఈ చర్చల ఫలితంగా వెలువడగలవని ఆశిస్తున్నాను.

ఆహార ధాన్యాల ధరలలో ఏర్పడిన పెరుగుదల సాధారణ ధరల పెరుగుదలలో ప్రతిఫలిస్తున్నది. ధరలలో సాధారణంగా ఏర్పడిన ఈ పెరుగుదల ప్రభావం అన్ని వర్గాలవారిపై ఒకే

విధంగా పడుతున్నదా లేక ఇది కొన్ని తరగతులవారిని బాధిస్తూ ఇతరులకు ప్రయోజనం కలిగిస్తున్నదా అనే అంశాన్ని పరిశీలించ వలసివుంది. జాతీయ లేక అంతర్జాతీయ ఆర్థికాంశాలు ధరలలో పెరుగుదలను కలిగించినప్పుడు, ఈ పెరుగుదలవల్ల ఉత్పత్తిదారు సహజంగా ప్రయోజనం పొందాలనే భావం ఒకటుంది. కాని వినియోగదారు అధికధరలు చెల్లించవలసి వస్తున్నప్పటికీ, ఉత్పత్తిదారు మాత్రం ఎంతమాత్రం ప్రయోజనం పొందలేకుండా పోవడం జరుగుతున్నది అంటే మధ్యదళారి ఈ లాభాలను కాస్తా స్వహా చేస్తున్నాడన్నమాట. కనుక మన గ్రామాలలో ఉత్పత్తిదార్లకు తగు ప్రతిఫలం ముట్టకపోవడానికి వ్యాపారంలో చిరకాలంగా జరుగుతున్న అనేక అక్రమవిధానాలే కారణ మనవచ్చు.

ఉత్పత్తిదార్లు తరచుగా తమ అవసరాల ఒత్తిడివల్ల ఉత్పత్తిని తగు విధంగా గ్రేడింగ్ జరపకుండానే అమ్మకానికిపెట్టి ఎంతోనష్టం పొందుతూవుంటారు. తక్కువ ధరలకే ధాన్యం విక్రయించడం, అధికంగా తూకంవేయడం, ధాన్యం నిలువచేసుకోవడానికీ, పరపతికీ తగు సదుపాయాలు లేకపోవడం, మార్కెట్టు రీతులను గురించిన పరిజ్ఞానం లేకపోవడం, ధాన్యం ఎగుమతికి తగు ప్రోత్సాహం లభించక పోవడంవంటి అనివాయితీగా వస్తున్న లోపాలుకూడా ఉత్పత్తిదారుకు నష్టం కలగడానికి కారణభూతమవుతున్నాయి. రైతుస్థాయిలోనే అగ్‌మార్క్ గ్రేడింగ్ జరపడమే దీనికి తరుణోపాయం. ఈపని ఇప్పుడు మార్కెటింగ్ శాఖద్వారా జరుగుతున్నది. మన రాష్ట్రంలోని మూడు క్రమబద్ధమైన మార్కెట్లలోనూ మూడు గ్రేడింగ్ యూనిట్లు ప్రారంభించబడినాయి. మద్దనూరులో ఒక నెయ్యిగ్రేడింగ్ ప్రయోగశాలను కూడా తెరవడం జరిగింది. రాష్ట్రంలో మొత్తం 247 వ్యాపారకేంద్రాలు వుండగా వాటిలో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో ఒక్కొక్కదానిలో 48 కేంద్రాల చొప్పున క్రమబద్ధం చేయబడ్డాయి. ప్రస్తుతం పరిశీలనలో వున్న సమీకృత మార్కెట్ల బిల్లు ఆమోదించబడిన తరువాత మిగిలిన కేంద్రాలుకూడా క్రమబద్ధం చేయబడతాయి.

ఈనాడు మనం చేస్తున్న యీ పనులన్నీ కేవలం వ్యవసాయదారుల్నీ ఉత్పత్తిదారుల్నీ మాత్రమే దృష్టిలోవుంచుకుని చేస్తున్నవి కావు. సమాజానికి ఉత్పత్తిదారులు ఎంత అవసరమో సేవలుకూడా అంతే అవసరం. సేవల్లో మునిగివున్న వారిలో చాలామంది అడుగుపౌర జీవితాలకు చెందినవారు. వీరికి సహాయపడేందుకు కొన్ని ప్రత్యేకమైన చర్యలు అవసరం. నిజమైన సామ్యవాద సమాజాన్ని ధ్యేయంగా పెట్టుకున్న మనం, సమాజ నిర్మాణంలో మనకృషి ఫలితాలను పంచడంలో ఎక్కడా ఏవిధమైన హెచ్చుతగ్గులు లేకుండా వుండడానికిగాను, వివిధ వర్గాల ప్రజల జీవన ప్రమాణాలను ఒకేస్థాయికి తీసుకొచ్చే విధానాన్ని అనుసరించవలసివుంది. వివిధ బలహీనవర్గాల స్థితిగతులను మెరుగుపరచడానికి తీసుకునే చర్యల్ని త్వరితగతిని కొనసాగించాలని భారతప్రభుత్వం కూడా చాలా ఆతృత పడుతున్నది. ఈ విషయంలో సహాయాన్నిస్తున్నది.

ఉదాహరణకు, రిక్షాత్రొక్కేవారి సమస్య చాలాకాలంగా మన ముందున్నది. ఈ వృత్తి మానవజన్మకే మాయని మచ్చ. ఈ వృత్తిని పూర్తిగా నిషేధించాలనే నిశ్చయానికి మనం వచ్చాం. కాని, ప్రజలకు కావలసిన రవాణా, ప్రయాణ సౌకర్యాల దృష్ట్యా దీనిని ఒక్కమారుగా రూపుమాపలేం. అయిదవ, ఆరవ పంచవర్ష ప్రణాళికల్లో సైకిలు రిక్షాలను ఆటోరిక్షాలుగా మార్చేందుకు సౌకర్యాలు కల్పిస్తూ, రిక్షా త్రొక్కడాన్ని నిషేధించే అంచలవారీ కార్యక్రమం ఒకటి రూపొందించ బడుతున్నది. ఈ మధ్యకాలంలో, రిక్షాలలాగే వేంకొలదీ జనానికి సాధ్యమైనంత అధికంగా పునరావాస సౌకర్యాలు కల్పించాలి. వీరిలో చాలామంది బీదవారు. వీరు రాజువారీ అద్దెపై విడివిడి రిక్షాయజమాన్ల వద్దనుండి రిక్షాలను అద్దెకు తెచ్చుకుంటారు. క్లిష్ట భాజనమైన దుర్భర జీవితాన్ని గడుపుతుంటారు. అందుచేత, వీరికి సరైన ధరకు రిక్షాలను అద్దెకివ్వడానికీ, వీరి రిక్షాలను మరమ్మతు చేయడానికీ, యితర సౌకర్యాలను కల్పించడానికీ వీరితో సహకార సంఘాలను ఏర్పాటు చేయాలని కొంతకాలం క్రిందట నిశ్చయించడం జరిగింది. గత ఏడాది అలాటి సంఘాలు ఎనిమిది నెలకొల్ప బడ్డాయి. వర్తమాన సంవత్సరంలో మారో ఆరు సంఘాలు వీరికి సహాయ పడతాయి.

పై విధంగా రజకులకు, బెస్తలకు, టాక్సీడ్రయివర్లకు, మాజీ గీత కార్మికులకు, యితరులకు కూడా సహాయం కల్పించబడింది. రజకుల యిబ్బందులు తొలగించి, వారి ఆర్థిక స్థితుగతులు చక్కబరచేందుకు ఒకకొత్త పథకం రూపొందించ బడింది. 1964-65 సాంవత్సరిక ప్రణాళికలో యీ పథకం చేర్చబడింది. ఈ కాలంలో వీరికొరకై మూడు సహకార సంఘాలు ఏర్పాటు చేయబడతాయి.

కోనసీమ బెస్తల కేంద్ర సహకార సంఘం రూపొందించిన మాస్టరు ప్లానుకు రూ 1.50 లక్షలను వాటాధనం విరాళం క్రింద రాష్ట్రప్రభుత్వం యివ్వడం మీ కందరకూ తెలిసిన విషయమే. మత్స్య సంపద సమృద్ధిగాగల ప్రాంతం కోనసీమ. 84 బెస్తపల్లెలకు లాభకారియై. మత్స్య పరిశ్రమను ప్రోత్సహించడమే యీ పథకం లక్ష్యం. ఈ పథకానికి కేంద్ర ప్రభుత్వం రూ 5 లక్షల ఋణసహాయాన్ని మంజూరు చేసింది. *

1964-65 సం. పు ప్రణాళికలో ఒక టాక్సీ డ్రయివర్ల సహకార సంఘం కొరకై రూ 1.97 లక్షలు కేటాయించబడ్డాయి. తాటి బెల్లం సంఘాలు, లేబర్ కాంట్రాక్ట్ సంఘాలు, పాలసరఫరా సంఘాలు, అటవీ సంఘాలు మొదలయిన యితర రంగాలలో కూడా సహకార సంఘాల ఏర్పాటుకు, అభివృద్ధికి ఆర్థిక సహాయాన్నీ, గారంటీలనూ, ఇతర రాయతీ సౌకర్యాలనూ కల్పించడానికి ప్రభుత్వం తగుచర్యల్ని తీసుకుంటున్నది. —జైహింద్

భవదీయుడు

* ఈ పథకానికి సంబంధించిన పూర్తి వివరాలకు 61వ. పేజీ చూడుడు.

# నే నెవరు?

కె. వి. యన్. అప్పారావు
"ఆత్మారామ్"

ఎవ్వరే నీ విందు బాలా! - నన్ను
పలచేరెదు విమలశీలా!

నీ వెవరో తెల్పు గోపాలా! - అపుడు
నేను చెప్పెద నాదులీలా!

పరమాత్మనే నేను బాలా! - అయిన
త్వన్మాయనే నేను కృష్ణా!

పరమపురుషుడ నేను బాలా! - అయిన
ప్రకృతి నౌదును నేను కృష్ణా!

సౌరమార్గము నేను బాలా! - అయిన
శబ్దశక్తిని నేను కృష్ణా!

వాయురూపుడ నేను బాలా! - అయిన
స్పర్శశక్తిని నేను కృష్ణా!

కృష్ణవర్త్ముడ నేను బాలా! - అయిన
రూపసంపద నేను కృష్ణా!

అంబురూపుడ నేను బాలా! - అయిన
అందవిరసం బేను కృష్ణా!

క్ష్మాతలాకారుడను బాలా! - అయిన
సౌగంధ్యమను నేను కృష్ణా!

లలివృక్షరూపుడను బాలా! - అయిన
ఫలసంపదను నేను కృష్ణా!

నే లతాకుంజమును బాలా! - అయిన
నే పుష్పమంజరిని కృష్ణా!

చంచరీకము నేను బాలా! - అయిన
ఝుంకారమును నేను కృష్ణా!

కోకిలంబను నేను బాలా! - అయిన
కుహుకారమును నేను కృష్ణా!

చంద్రబింబము నేను బాలా! - అయిన
చంద్రికాద్యుతి నేను కృష్ణా!

జలధరమ్మను నేను బాలా! - అయిన
సౌదామినిని నేను కృష్ణా!

జలధిరూపుడ నేను బాలా! - అయిన
సరిదాకృతిని నేను కృష్ణా!

ప్రణయరూపుడ నేను బాలా! - అయిన
భవ్యశ్రుతిని నేను కృష్ణా!

చతురాస్యుడను నేను బాలా! - అయిన
శారదా మూర్తి నేను కృష్ణా!

శ్రీవత్సధారినే బాలా! - అయిన
శ్రీకాంతనే నేను కృష్ణా!

పరమేశ్వరుడ నేను బాలా! - అయిన
పార్వతీసతి నేను కృష్ణా

శ్రీరామచంద్రుండ బాలా! - అయిన
సీతామతల్లినే కృష్ణా!

యజ్ఞరూపుడ నేను బాలా! - అయిన
అన్నపూర్ణను నేను కృష్ణా!

సద్దానరూపుడను బాలా! - అయిన
సామ్యయోగము నేను కృష్ణా!

సత్తపోరూపుడను బాలా! - అయిన
సంసిద్ధి నేనౌదు కృష్ణా!

వైదేహూఢను నేను బాలా! - అయిన
వరకర్మ యోగమును కృష్ణా!

ప్రహ్లాదుడను నేను భామా! - అయిన
భక్తియోగము నేను కృష్ణా!

కపిలమౌనిని నేను బాలా! - అయిన
జ్ఞానయోగము నేను కృష్ణా!

నే హరిశ్చంద్రుండ బాలా! - అయిన
నిత్యసత్యము నేను కృష్ణా!

ధర్మరాజను నేను బాలా! - అయిన
ధర నహింసను నేను కృష్ణా!

సూర్యదేవుడ నేను బాలా! - అయిన
జ్యోతిష్మతిని నేను కృష్ణా!

ఇంద్రుండ నేనౌదు బాలా! - అయిన
ఇంద్రియావళి నేను కృష్ణా!

దేవతాగురు నేను బాలా! - అయిన
ధిషణాబలం నేను కృష్ణా!

సుర చమూపతి నేను బాలా! - అయిన
శూరత్వమును నేను కృష్ణా!

స్వర్ణాద్రినౌ నేను బాలా! - అయిన
సర్వోచ్చతను నేను కష్ణా!

శీతాచలము నేను బాలా! - అయిన
స్థిరతాగౌణం బౌను కృష్ణా!

శ్రీకృష్ణుడను నేను బాలా! - అయిన
ఆ రాధనే నేను కృష్ణా!

సుకుచేల మిత్రుండ బాలా! - అయిన
సుహృత్త్వమను నేను కృష్ణా!

పార్థసారథి నేను బాలా! - అయిన
భవ్యగీతను నేను కృష్ణా!

అమలకృషిరూపుడను బాలా! - అయిన
ఆరాధనను నేను కృష్ణా!

ఇరువురము ఒక్కటే బాలా! - కాని
ఒకటియే రెండయ్యె కృష్ణా!

ఇరువురము కలసిననె బాలా! - జగతి
కెల్లపుడు సుఖమబ్బు బాలా!

అందుకేగద నాకు కృష్ణా! - నిన్ను
అనుసరింపగ నింత కృష్ణా!

# మన ప్రణాళికలు

—యం. ఆర్. అప్పారావు

***పంచాయతీరాజ్, సమాజ వికాసం :***

పునశ్చరణ శిక్షణ శిబిరంలో యిచ్చే శిక్షణ ముఖ్యంగా సహకారం, వ్యవసాయోత్పత్తి, పంచాయతీల, పంచాయతీ సమితుల పరిపాలనవంటి సమాజవికాసానికి సంబంధించి కార్యకలాపాలను ఆవర్తించి వుంటుంది. యీ శిబిరంలో పంచాయతీల అధ్యక్షులకు, పంచాయతీ సమితుల అధ్యక్షులకు, బ్లాకు డెవలప్‌మెంటు అధికారులవంటి వారికీ శిక్షణ బవ్వబడుతుంది. ఈ శిక్షణను రాష్ట్రశాసన సభ సభ్యులకు, పార్లమెంటు సభ్యులకు కూడా విస్తరింపజేస్తే వారికి ఎంతగానో వుపయోగిస్తుం దనవచ్చు. ప్రభుత్వం అధికారాన్ని వికేంద్రీకరించి, వాటిని జిల్లా పరిషత్తులకు, సమితులకు, పంచాయతీలకు యివ్వడంతో భారతదేశపు ప్రజల ఆర్థిక, సాంఘిక, వైదాంతిక జీవితంతో సమాజవికాసం ముడిపడిపోయి ఒక అంతర్భాగమైపోయింది. సమాజవికాస పథకాలు విజయవంత మయ్యాయి. మన దేశంలో అంతర్భాగమై పోయాయి. అందుచేత సమాజవికాస కార్యక్రమాలలో శిక్షణ పొందడం ప్రతి వ్యక్తికీ అవసరం.

***ఒక్క మాట :***

మన ప్రజలు, నిజం చెప్పాలంటే, స్వార్థపరులై పోయారు. మన నాగరికత రోజు రోజుకు అనాగరికతలోకి దిగజారి పోతున్నది. సంఘం ఆటవిక స్థితినుండి అభివృద్ధి చెందిం దనే విషయం మర్చిపోగూడదు. మళ్ళీ మనం వెనక్కు పరుగెత్తడం మంచిపని కాదు. స్వార్థాన్ని విదుల్చుకుని సమాజ శ్రేయస్సుకై మనం ప్రయత్నించాలి. తృతీయ ప్రపంచ సంగ్రామమేగాని సంభవిస్తే, ప్రపంచమంతా కొన్ని గంటల్లో సర్వనాశనమై పోతుంది. ఈ యుగం హైడ్రోజను బాంబు యుగం అనే ప్రాథమిక సత్యాన్ని అన్ని దేశాలూ గుర్తించాయి. అందుచేత యీనాడు ప్రపంచమంతటా శాంతిస్థాపన చాలాఅవసరం.అయితే ఆకలి, బాధలతో బాధపడుతున్న అభివృద్ధి చెందని బడుగు దేశాలు వున్నంతవరకు ప్రపంచంలో శాంతిస్థాపన సాధ్యం కాదు. అభివృద్ధి చెందిన దేశాలు యీ సత్యాన్ని గుర్తించాయి. అందువల్లనే రష్యా, అమెరికాల వంటి ఐశ్వర్యవంతమైన దేశాలు బడుగు దేశాలకు ఉదారంగా విదేశ సహాయాన్ని అందజేస్తున్నాయి. అందరకూ సమానావకాశాలు యిచ్చినప్పుడే అభివృద్ధి సాధించడం వీలవుతుంది. ఇందుకు ప్రణాళికలు వేసుకోవడం అవసరం.

***ప్రణాళికా నిర్వహణ :***

ప్రణాళికా నిర్వహణను రెండు రకాలుగా విభాగించవచ్చు. ఒకటి — నిరంకుశత్వం క్రింద ప్రణాళికలను నిర్వహించడం, రెండు — ప్రజాస్వామ్యం క్రింద ప్రణాళికలను కొనసాగించడం, ప్రజాస్వామ్య విధానంలో ప్రణాళికలను కొనసాగిస్తున్న మొట్టమొదటి దేశం బహుశా భారతదేశమే కావచ్చు. భారతదేశం ప్రపంచంలోకల్ల పెద్దదైన ప్రజాస్వామ్య దేశం. అందువల్లనే ప్రపంచంలో మన కింత గౌరవం వుంది. నిరక్షరాస్యుల జీవన విధానాన్ని, దృక్పథాన్ని మార్పు చేయడం అంటే చాలా కష్టమైన పని అని వేరేచెప్ప నక్కరలేదు. సమాజవికాసం యొక్క ధ్యేయం సమాజమంతా ఒక కుటుంబం లాగ పని చేయాలీ అని. సత్వరాభివృద్ధి సాధించాలంటే పంచవర్ష ప్రణాళికలను మనం ప్రారంభించవలసి వుంటుంది. దేశంలో వున్న కొద్దిపాటి వనరులతో, నిరక్షరాస్యత మధ్య యీ ప్రణాళికలను ఆచరణలో పెట్టాలంటే తాత్కాలికంగా అది కష్టమైన పనే. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో రాష్ట్రాల పునర్విభజన, శరణార్థుల పునరావాసం వంటి అనేక సమస్యలను మనం ఎదుర్కొన్నాం. ఇక ఆహార సమస్యను గురించి వేరే చెప్పనే అక్కరలేదు. తొలి పంచవర్ష ప్రణాళికాంతానికి ఆహార సమస్యను కొంత మెరుగు పరచుకొని, పారిశ్రామికీకరణ మార్గంవైపు కొంతదూరం కదలి వెళ్ళాం. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో పారిశ్రామికీకరణకు ఎక్కువ ప్రాధాన్యత యివ్వబడింది. జాతీయ వార్షికాదాయాన్ని 5 శాతం పెంచడం, ఆహారపదార్థాలలో స్వయం సమృద్ధి, వ్యవసాయోత్పత్తి పెంపుదల; పదేళ్ళలో పూర్తిగా యంత్రోత్పత్తి స్థాయికి చేరుకునేటట్టు ఉక్కు, రసాయనికాలు, బొగ్గు, విద్యుచ్ఛక్తి, యంత్రాల తయారీవంటి ప్రాథమిక పరిశ్రమలను నెలకొల్పడం, వాటిని విస్తృత పరచడం, మానవ శక్తిని

పూర్తిగా వినియోగించడం, ఉద్యోగావకాశాలు కల్పించడం, సోషలిస్టు తరహా సమాజ నిర్మాణానికిగాను సర్వులకు సమానావకాశాలను ఇవ్వడం — ఇవి తృతీయ ప్రణాళిక ధ్యేయాలు. ప్రణాళికలకు అవసరమయ్యే సాధన సంపత్తులను సమీకరించాలంటే పన్నులు తప్పవు. ప్రజలు బీదవారు గనుక, కొద్దిపాటి పన్నులైనా వారు భరించలేరు గనుక, యీ పన్నులన్నీ వారికి భారం కావచ్చు. అయినా యీ పన్నులు మన పొరుగు దేశాలయిన బర్మా, సింహళాలలో కన్న తక్కువే.

**మన విజయాలు :**

గడచిన పదిహేనేళ్లల్లో: వ్యవసాయోత్పత్తి 1951-61 లో 36 శాతం పెరిగింది. గత పదిహేనేళ్ళలో పారిశ్రామికోత్పత్తి 150 శాతం, బొగ్గు ఉత్పత్తి 103 శాతం, ఉక్కు 322 శాతం, సిమెంటు 431 శాతం, యంత్ర పరికరాలు 1829 శాతం, మోటారు కార్లు 758 శాతం, సైకిళ్ళు 1962 శాతం, తేయాకు 33 శాతం, నేతవస్త్రాలు 16 శాతం, రేయాన్, నైలాన్ మొదలయిన దారాల వుత్పత్తి 2700 శాతం పెరిగాయి. విద్యుచ్ఛక్తి 4575 6 మి. కి. వా. నుండి 21,723.6 మి. కి. వా. పెరిగింది. 1951 సం. లో వేగన్లు 64 లక్షల టన్నుల నుండి 1962-63 సం కి. 101 లక్షల టన్నులకు పెరిగింది.

స్థిరమైన ధరల్లో జాతీయాదాయం 54.3 శాతం పెరిగింది. కాని జనసంఖ్య 30.6 శాతం అభివృద్ధి చెందింది. అందుచేత తలసరి ఆదాయం 18.1 శాతం మాత్రమే పెరిగింది. జనసంఖ్య పెరుగుదలకు కారణం ఆరోగ్య రక్షణ చర్యల వల్లా, శిశు, ప్రసూతి రక్షణ చర్యల వల్లాను. జీవన ప్రమాణం 1931 లో 23 సం. లు వుండగా 1961 లో 42 సం.లు వుంది. గత దశాబ్దంలో భారతదేశపు జనసంఖ్య 7.70 లక్షలు పెరిగింది. అంటే రష్యాతప్ప మిగిలిన యూరపు దేశాల జనసంఖ్య కన్న ఎక్కువన్నమాట. ప్రపంచంలో భారతదేశం 2.4 శాతం స్థలాన్ని ఆక్రమిస్తున్నది. ప్రపంచ జన సంఖ్యలో భారత దేశపు జనసంఖ్య 15 శాతం. ఈ 2.4 శాతం స్థలంలో 15 శాతం జన సంఖ్యను భరించాలి. ఆంధ్రప్రదేశ్ లో నిర్బంధ విద్య 1961 లో ప్రారంభించబడింది. మన ప్రగతికి యిది చాలాఅవసరం అనే విషయం మీ కందరకూ తెలుసు. 1952 లో పంచాయతీ రాజ్యం, సమాజ వికాసం ప్రారంభమయ్యాయి. అధికార వికేంద్రీకరణ జరిగి, తమ సమాజం యొక్క అభివృద్ధి బాధ్యతలు ప్రజల చేతుల్లోనే పెట్టబడ్డాయి. 5,57,000 గ్రామాలను ఆవరిస్తూ 5200 బ్లాకుల ద్వారా మొత్తం దేశమంతటా ఎన్. ఇ. ఎస్.లు నెలకొల్పబడ్డాయి. పరపతి, మార్కెటింగ్, ప్రోసెసింగ్ విద్యలో శిక్షణ, పరిశ్రమలు మొదలయిన వాటి కొరకు మొత్తం 2,20,000 గ్రామీణ సహకార సంఘాలు పని చేస్తున్నాయి.

**అత్యాయిక స్థితి :**

రక్షణ శ్రామిక బ్యాంకు: అత్యాయిక స్థితి ప్రకటించబడినతరువాత రక్షణ శ్రామిక బ్యాంకులు నెలకొల్ప బడ్డాయి. మన దేశంలో శరీరదార్ఢ్యం కలిగి పనిచేయ సమర్థులయిన స్త్రీ, పురుషులు 20 కోట్ల మంది వున్నారు. ఈ పథకం ప్రకారం ఒక రిజిస్టరు నిర్వహించ బడుతుంది. అందులో శ్రమదానం చేయదలచుకున్న వారి పేర్లు నమోదు చేయబడతాయి. సంవత్సరానికి 12 రోజులు వీరు ఉదారంగా శ్రమదానం చేయాలి. శ్రమదానం మేరకు డబ్బు యివ్వదలచుకున్న వారు అలా కూడా యివ్వవచ్చు. ఇలా లభించే శ్రమదానం, డబ్బు తో చేపల్ని పెంచే గుంటలను త్రవ్వడం, పళ్ళను, కాయగూరలను పండించడం, వంట చెరకు అడవులు మొదలయిన వాటిని పెంచడం చేస్తారు.

గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం: ప్రతి గ్రామంలోనూ ఉత్పత్తి, గ్రామీణులకు విద్య, గ్రామ రక్షణలకుగాను ఒక నిర్వహణసేన వుండాలి అనే ప్రాతిపదిక మీద గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం ప్రారంభించబడింది. ఉత్పత్తికి సంబంధించిన విషయాలపై ఎక్కువ శ్రద్ధ చూపించడం; పంచాయతీ భూముల అభివృద్ధి, కంపోస్టు ఎరువుల తయారీ, చెరువుల నిర్మాణం, మరమ్మతు, భూసార పరిరక్షణ, చిన్ననీటి వనరుల నిర్మాణం మొదలయిన సమాజానికి ప్రయోజనకారులైన కార్యక్రమాలను యీ దళం చేపట్టుతుంది.

గ్రామీణులకు విద్య చెప్పడం, సరియైన సమాచారాల్ని అందజేయడం, పుకారుల్ని అరికట్టడం, ప్రజల నైతిక స్థాయిని దిగజారిపోకూండా చూడడం— ఇవి యీదళం చేసే యితర ముఖ్యమైన కార్యక్రమాలు.

గ్రామ రక్షణ కాదా ముఖ్యమైన విషయమే, యువక మండలులు, మహిళా మండలులు నిర్వహింపబడతాయి. ఇవి పొదుపు అభివృద్ధికి వస్త్రాలల్లికలోనూతోడ్పడతాయి. సహకార సంఘాలకు, చౌటకి సంబంధించిన దుకాణాలకు సహాయపడడం, జవాన్ల కుటుంబాల సంక్షేమానికి తోడ్పడం — చేస్తాయి.

వీటన్నిటిలో మనం తగినంతగా విజయాన్ని సాధించాం. ప్రణాళికలు విజయవంతంగా అమలు జరపడానికి అనేక విషయాలు కారణమవుతాయి. దేశంలో సాధన సంపత్తుల మాంద్యం, ప్రజలలో నిరక్షరాస్యత, జనసంఖ్య పెరుగుదలను దృష్టిలో వుంచుకుని చూస్తే మనం సాధించిన విజయం ఆశాజనకంగా వుంది.

ప్రణాళిక పథకాల్లో 85 శాతం ప్రత్యక్షంగాను 15 శాతం పరోక్షంగాను రక్షణ కృషికి సంబంధించి వుంది. అందుచేత జాతీయ ఆత్యయిక పరిస్థితి ప్రకటింపబడిన అనంతరంకూడా ప్రణాళిక వ్యయాన్ని తగ్గించడం సాధ్యం కాలేదు. కాగా ప్రణాళికలను శీఘ్రతరం చేయవలసి వుంది. జాతీయ ఆదాయాన్ని వృద్ధిచేయాలంటే ఎక్కువ మొత్తంలో పొదుపు చేయడం, పెట్టుబడి పెట్టడం అవసరం. ఇందుకు వెలుపలి, లోపలి సాధన సంపత్తులు కావాలి. అత్యయిక స్థితిలో రక్షణ కృషికి అవసరమైన సాధన సంపత్తులను సమకూర్చాలంటే నికరంగా చేసే పొదుపు రేటు జాతీయాదాయంలో 5 శాతం వరకు పెరగాలి. వర్తమాన కాలంలో పొదుపు జాతీయాదాయంలో 8-9 శాతంల మధ్య వుంది.

అందుచేత ఈ తరుణంలో విదేశీ సహాయం అవసరం. గృహసంపత్తులను రక్షణకై తరలించడం వల్లనే యీ భారం ఏర్పడింది.

ఉత్పత్తి :

వ్యవసాయోత్పత్తి గత పదేళ్ళనుండి 1961 వరకు 46 శాతం పెరిగింది. పారిశ్రామికోత్పత్తి రెట్టింపయ్యింది, మనం ప్రాథమిక లోహ పరిశ్రమలను, మెకానికల్ ఇంజనీరింగు, భారీ రసాయనిక పరిశ్రమలను నెలకొల్పుకున్నాం. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 300 శాతం పెరిగింది. పెరిగిన అవసరాల దృష్ట్యా యీ విద్యుచ్ఛక్తి యింకా చాలడం లేదు.

ఇంతకు పూర్వమే వ్యక్తం చేసినట్లు, రక్షణ బలానికి అత్యవసర ఆహారపదార్థాలను అందజేయడం వలన పౌరుల భోజనాన్ని పరిమితం చేయాల్సి వచ్చింది. ధరలు పెరగకుండా, వుత్పత్తికి అంతరాయం లేకుండా అత్యవసర పరిస్థితిలో రక్షణ అవసరాలను తీర్చుకోవలసివుంటుంది. బొగ్గు, ఉక్కు, సిమెంటువంటి కొన్ని రంగాలలో పూర్తి ఉత్పత్తి స్థాయిని చేరుకోవడంలో మనం విజయాన్ని సాధించాం.

సాధన సంపత్తులు :

ఈ పదాది ప్రజల రక్షణ విరాళాలు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పన్నుల విషయంలో చేస్తున్న కృషి అభినందించదగ్గవిగా వున్నాయి. మనం చేస్తున్న యీ కృషి యిలావుంచి, యింతకు పూర్వమే నేను తెలిపినట్లు 8 శాతం కన్న యింకా తక్కువే ఆదాయపు పన్ను గాగల భారత దేశంవంటి బీద దేశంలో సామాన్యుని భుజస్కంధాలపై యీ పన్నుల భారాన్ని వుంచక తప్పదు.

అత్యవసర పరిస్థితిలో విదేశీమారకాన్ని తరలించ వలసిన అవసరం ఎంతయినా వుంది. ఏటా దొంగబంగారం వ్యాపారంపై ఖర్చయ్యే 50 కోట్ల రూపాయల విదేశ మారకాన్ని పొదుపుచేయడమే బంగారం కంట్రోలు విధానం లక్ష్యం. మనకు ఉదారంగా సహాయపడుతున్న విదేశీయులు మనం చేస్తున్న కృషికి ముచ్చటపడుతున్నారు. అందువల్లనే వారు మనం మోపుతున్న బరువును అట్టే భారంగా అనుకోవడంలేదు. విదేశీయ మిత్రదేశాలు (భారతసహాయక క్లబ్బు) మన పరిశ్రమలకు అవసరపడే మిశ్రమాలు, లభ్యం కాని ముడిసరకు, ముఖ్యమైన పెట్టుబడి వస్తువుల దిగుమతికి ఆర్థిక సహాయాన్నిచ్చి ఎంతగానో తోడ్పడుతున్నారు.

ఎగుమతులు :

ద్వితీయ పంచవర్ష ప్రణాళికాంతానికి ఎగుమతుల ద్వారా వచ్చే డబ్బు రూ. 633 కోట్లు కాగా, అది 1962-63 నాటికి సుమారు రూ. 710 కోట్లు అయ్యింది. ఈ 6 శాతం వార్షికాభివృద్ధి తృప్తికరంగానే వుంది గాని పూర్తిగా సరిపోయినంతగా లేదు. చక్కెర, నూనె విత్తులు, పనస్పతి, తేయాకు, కాఫీ, కొన్ని ఇంజనీరింగు పరికరాలు ఎగుమతి చేసుకోవచ్చు. సాధ్యమైనంత ఎక్కువ విదేశమారక ద్రవ్యాన్ని సంపాదించడానికి వీలుగా దేశంలో యీ వస్తువుల వాడకాన్ని తగ్గించాలి.

వ్యవసాయం

వ్యవసాయ రంగంలో 10 కోట్ల టన్నుల ఆహారధాన్యాలను తృతీయ ప్రణాళికలో పండించాలని నిశ్చయించబడింది. ఈ ధ్యేయాన్ని సాధించడానికి తీవ్ర వ్యవసాయం చేపట్టబడింది. లోగడ వున్న వాటికితోడు యీ పదాది తీవ్ర వ్యవసాయానికై సాంద్ర వ్యవసాయ కార్యక్రమం 40 జిల్లాలలో అమలుపరచబడింది. 100 జిల్లాలు పప్పుదినుసులు, కాయధాన్యాలకు, 8 సాంద్రవ్యవసాయ యూనిట్లులు వేరుశెనగకు ఎంపిక చేయబడ్డాయి.

వ్యవసాయ కార్యక్రమాలకు సహాయపడడానికిగాను రాష్ట్రాలకు తక్కువ వ్యవధి ఋణాల క్రింద రూ. 23 కోట్లు యివ్వబడ్డాయి. ఈ డబ్బును ముఖ్యంగా ఎరువులు, మేలుజాతి విత్తనాల సేకరణ, పంపిణీలకు వినియోగించబడుతుంది.

వ్యావసాయిక విద్యను, పరిశోధనను అభివృద్ధి పరచేందుకై దేశంలో 5 వ్యవసాయ కళాశాలలు నెలకొల్పబడ్డాయి. అందులో ఒకటి త్వరలోనే ఆంధ్రప్రదేశ్‌లో ప్రారంభం కానున్నది. ఆధునిక పద్ధతులను వ్యాప్తి చేయడానికిగాను విస్తరణ విద్యాసంస్థలు కూడా ప్రారంభించబడ్డాయి.

ధరలు :

వ్యవసాయంలో వినియోగదారుని అవసరాలు ధరలో జరిగే మార్పులను పెరగని, తరగని పక్షంలో సరఫరాలో ఏ కొద్దిపాటి తగ్గుదల కలిగినా, ధరలు విపరీతంగా పెరగడానికి కారణమవుతాయి. వ్యవసాయదారునికి ధరల విషయంలో హామీ యివ్వడం అవసరం. అంటే, కనిష్ఠ ధర నిశ్చయింపబడాలి. అంతటితో సరిపోదు. దానితోపాటు, వినియోగ

[మిగతా 16 వ పేజీలో]

# దక్షిణాదికి తరలివెళ్లిన ఆంధ్రనాట్యవేత్తలు

— మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి —

## తంజావూరుకు వలస

విజయనగర సామ్రాజ్య వైభవం వెలుగొందినన్ని రోజులు మన భాగవతులు రాయలవారి ఆస్థానంలోనూ, విస్తరించిన సామ్రాజ్యంలోనూ ప్రదర్శనలిస్తూ ప్రజా ప్రబోధాన్ని గావించారు. కాని విజయనగర రాజ్య పతనానంతరం కవిగాయకులతోపాటు మన కళాకారులుకూడా వలస వెళ్ళిపోవలసి వచ్చింది.

ఆ రోజుల్లో 1561-1614 వరకూ రాజ్యాన్ని పాలించిన ఆంధ్రరాజులైన అచ్యుతప్ప నాయకులవారి ఆస్థానంలో వారి ఆదరాభిమానాన్ని పొంది, నాట్యకళా సంప్రదాయాలను అభివృద్ధి పర్చారు. తంజావూరు సరస్వతీ మహల్ కవులతోనూ, గాయకులతోనూ, కళాకారులతోనూ అద్వితీయంగా వెలుగొందింది. అచ్యుతప్పనాయకులవారు వారి పంచజేరిన కూచిపూడి బ్రాహ్మణకుటుంబాలవారందరికీ ఆయన అగ్రహారాలను దానంగా ఇచ్చాడు. ఆ అగ్రహారాలను దానం చేసినవాటిలో కూచిపూడి భాగవతులకు దానం చేసిందే అచ్యుతాపుర అగ్రహారం.

## మేలటూరు భాగవతులు

ఆంధ్రదేశంలో కూచిపూడి భాగవతులెలాగో దక్షిణాదిన తంజావూరు జిల్లాలో మేలటూరు — వూత్తుకూడి — శూలమంగళం గ్రామాలలో కూడ భాగవత మేళములవారున్నారు. మన కూచిపూడి భాగవతులకు, ఆ భాగవతులకు అత్యంత సన్నిహితసంబంధముంది. ఆంధ్రరాజులు తంజావూరును పరిపాలించే కాలంలో కూచిపూడి భాగవతులు నానా రాజసందర్శనం జేస్తూ తంజావూరు ఆంధ్ర రాజులను కూడా ఆశ్రయించారు. విజయనగర సామ్రాజ్యంలో కవులు, పండితులు కళాకారులు, అనేకమంది పోషింపబడ్డారు. కాని కళ్ళికోట యుద్ధానంతరం రాయల సామ్రాజ్యం అంతరించడంతో ఈ కళాకారులందరూ కుటుంబాలు కుటుంబాలుగా చెల్లాచెదరై అనేకమంది అనేక ప్రాంతాలకు వలసలుపోయారు. అలా వలసలు పోయిన వారిలో చాలామంది తంజావూరు చుట్టుప్రక్కల స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని అలనాటి తంజావూరు ఆంధ్ర నాయకరాజు అచ్యుతప్ప నాయకుని ఆశ్రయించారు. విజయనగరరాజు లెలా కళలను కవులను కళాకారులను పోషించారో — అలాగే తంజావూరు రాజులుకూడా వీరిని ఆదరించి మాన్యాలూ అగ్రహారాలు వ్రాసి యిచ్చారు. అలా సంపాదించిందే యీనాటి మేలటూరు. దీనిని క్రీస్తుశకం 1561-1614 మధ్యకాలంలో తంజావూరు రాజ్యమును పరిపాలించిన అచ్యుతప్ప నాయకుడు ఆంధ్రదేశం నుంచి వలస వచ్చిన అనేకమంది ప్రతిభావంతులైన సాహిత్య వేత్తలను, వాగ్గేయకారులను, కళావేత్తలను ఆహ్వానించారు.

ఆదరించి అగ్రహారాలను దానమిచ్చారు. అలాంటి అగ్రహారాల్లో ఒకటే యీ మేలటూరు. మేలటూరు అసలుపేరు అచ్యుతాపురం అగ్రహారం. అచ్యుతప్ప నాయకుని దానంగనక అచ్యుతాపురమనే పేరు వచ్చింది. తరువాత మేలటూరని — మెలట్టూరని — మెరట్టూరని వ్యవహరించ బడింది. కాని ఈనాటికి తంజావూరు చుట్టుప్రక్కలవారు మేలటూరనే పిలుస్తున్నారు.

## వెంకట్రామశాస్త్రి

మహామహుడు సిద్ధేంద్రయోగి ఎలాంటివాడో అలాగే మేలటూరు వీధి భాగవతులకు వెంకట్రామశాస్త్రి అలాంటివారు. ఈయన శుద్ధతెలుగు బ్రాహ్మణుడు. సంగీత సాహిత్యనాట్యాది విషయాల్లో ఆరితేరినదిట్ట.

17 వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో గోదావరీ ప్రాంతంనుంచి దక్షిణదేశాల కొచ్చాడని చారిత్రకాధారాలున్నాయి. ఆయన యొక్క కీర్తిప్రతిష్ఠలు దక్షిణదేశం దాటి మనదాకారాలేదు. అందువల్లనే వెంకట్రామశాస్త్రిని గురించి ఏవిధమైన భోగట్టా ఆంధ్రులకు తెలియదు.

శ్రీశాస్త్రిగారు రచించిన రచనలుచూస్తే ఆయన కృషి ప్రతిభ ఎలాంటిదో మనకు బోధపడుతుంది. ఆయన రచించిన వీధి నాటకాలు, ఉషాపరిణయం — హరిశ్చంద్ర-ప్రహ్లాద-రుక్మాంగద చరిత్ర-సీతాకళ్యాణం— నన్నంగరాజు — జగల్లీలా నాటకం - రుక్మిణీ కల్యాణం — కంసవధ — మొదలైనవి. వీటిలో ముఖ్యంగా ఎక్కువ ప్రచారంలోకి వచ్చినవి ఉషాకల్యాణం — మార్కండేయ చరిత్ర - ప్రహ్లాద - రుక్మాంగద - ఈ నాటకాలన్నీ తెలుగులోనే రచింపబడినా వాటి ప్రతులు మాత్రం మనకు లభ్యంకావు — కొన్ని మాత్రం ఆర్. కల్యాణరామయ్యరు వద్దా. వి. రాఘవన్‌గారివద్దా వున్నవి. మరి కొన్ని తంజావూరు పరిసర గ్రామాలైన శూలమంగళం — మేలటూరు — వూత్తుకూడి గ్రామాల్లో వ్రాతప్రతుల్లో వున్నాయని వినికిడి.

## శూల మంగళం

మేలటూరు భాగవతుల తరువాత నాటకాలను ప్రతిభావంతంగా ప్రదర్శించ గలిగినవారు ఈ శూలమంగళం కళాకారులే. పోగడ శూలమంగళ గ్రామం శాలిమంగళం అని పిలవబడుతూ వుండేది. వారు వెంకట్రామశాస్త్రిగారి నాటకాలనే గాక అనాది కళారూపమైన కొరవంజి కళా

రూపాన్నికూడా ప్రజారంజకంగా ప్రదర్శించారు. వీరు ప్రత్యేకంగా కొన్ని హాస్యపాత్రలను కూడా ప్రవేశపెడతారు. ఈ పాత్రలు కథాసంవిధానంతో ఏ విధమైన సంబంధమూ లేకుండానే ప్రవేశిస్తాయి. ప్రేక్షకుల్ని కడుపుబ్బనవ్విస్తాయి. హాస్యపాత్రల్లో ముఖ్యమైనవి, ఎరుకలిసింగి — సింగడు — ఘటనృత్యం చేసేవారు — తురకవేషములు ధరించు ఫకీరువేషగాండ్రు మొదలైనవారు — వీరి నాటకం తెలుగులో ప్రదర్శింపబడుతున్నా హాస్యచమత్కారాలు మాత్రం అన్నీ తమిళభాషలోనే సాగుతాయి.

## వూత్తుక్కాడు

దీనినే పైన వూర్తుకూడు అని సంబోధించాము దీనికి అనేక పర్యాయపదాలున్నా, గ్రామం మాత్రం ఒకటే — భాగవత నాటకములు ప్రదర్శించే వారుమాత్రం ఇక్కడి వారే. ఈ వూరివారు మేలటూరివారి నాటకాలనే అనుసరించి ప్రదర్శించినా వెంకట్రామశాస్త్రిగారి నాటకాలకు ముందు ప్రదర్శించిన నాటకాలు కూడా వున్నాయి — అవి భామకలాపం — గొల్లకలాపం — పార్వతీపరిణయం — రాధాకృష్ణవిలాసం — మొదలైనవి. అంతేగాక వారు యక్షగానాలైన ప్రహ్లాద — గొల్లకలాపం — పారిజాతాపహరణం — వుషాపరిణయం కూచిపూడి సాంప్రదాయాలనే ప్రదర్శించారు.

## తెలుగుతనం

మేలటూరు, శూలమంగళం, వూత్తుక్కాడు మొదలైన మూడు గ్రామాల్లో ప్రదర్శించే ప్రదర్శనాలన్నీ తెలుగులో వ్రాయబడినవే — ఈనాటికీ మేలటూరు వరదరాజ పెరుమాళ్ళు వసంతోత్సవాలలో ప్రదర్శించే యక్షగానాలన్నీ తెలుగే — రాను రాను చరిత్రగతి మారి ఆ గ్రామాల్లో అనాటి మన తెలుగు నాటకాలను తమిళ భాషలోనికి అనువదించుకుని నేటికి ప్రసిద్ధంగా వారు నాటకాలను ప్రదర్శిస్తున్నారు.

తమిళదేశంలో ఈనాటికీ దేవాలయాల్లో నృత్యంచేసే దేవదాసీలందరూ తెలుగుపదాలనే పాడుతూ నాట్యం చేస్తున్నారు. వారినృత్యం — అభినయ ముద్రలు — తాళగతులు — ముక్తాయింపులు, గమకాలు, మొదలైన రీతులన్నీ తెలుగుతనాన్ని మూర్తీభవించి వున్నాయి —

## క్షేత్రయ్య పదాలు

కూచిపూడి వారి భాగవత ప్రదర్శనాల్లో క్షేత్రయ్య మువ్వగోపాల పదాలను చేర్చడం వల్ల మరికొంత రాణింపు ఆ భాగవతాల కొచ్చింది. క్షేత్రయ్య మహాకవి కూచిపూడి గ్రామానికి రెండు మైళ్ళలో వున్న మొవ్వగ్రామనివాసస్తుడు, సంగీతంలోనూ సాహిత్యంలోనూ నృత్యంలోనూ ప్రజ్ఞావంతుడు — ఆయన అనేకపదాలు వ్రాశాడు. ఆ పాటల్లో శృంగారం తొణికిసలాడుతూ ఉంటుంది. నాయకా, నాయకీ భావాలతో పొందుపరచబడ్డాయి. ఈయన పాటద్వారా కూచిపూడి నృత్యం పరాకాష్టనందుకుంది.

## విజయరాఘవుడు

క్రీస్తుశకం 1633 నుండి 1673 వరకు తంజావూరును పాలించిన విజయరాఘవ నాయకుని కాలంలో క్షేత్రయ్య ఆస్థాన గౌరవాలన్నిటినీ పొందాడు. పదాభినయానికి సాత్వికాభినానికి క్షేత్రయ్య పదాలకు విశిష్టంగా ప్రాధాన్యంయిచ్చేవారు. అందువల్ల ప్రదర్శనాలు ఎంతగానో విజయవంత మయ్యేవి. క్షేత్రయ్యపదాలు తమిళ శంలోకూడా విస్తారంగా ప్రచారంలోకి వచ్చాయి. ఈ నాటికీ తమిళదేశంలో పాడుతున్నారు. పదాలలో మధ్య మధ్య తెలుగు నుడికారాలు అచ్చుగుద్దినట్లు అగుపిస్తూ వున్నాయి. ఈ విధంగా క్షేత్రయ్యపదాలు బహుళ ప్రచారంలోనికి తీసుకువచ్చినవారు మన కూచిపూడి భాగవతులే.

## బంధుత్వాలు

తంజావూరు ఆంధ్రరాజుల సమక్షాన ప్రదర్శనాలిచ్చిన నాటినుంచీ కృష్ణాజిల్లా కూచికూచిపూడికీ, అచ్యుతాపురానికీ, ఊత్తుక్కాడుకూ బంధుత్వాలు పెరిగాయి. అక్కడున్న తమిళులపై తెలుగుభాష ప్రభావం పడి వారు కూడా తెలుగువారుగా మారి, వారిపిల్లల్ని వీరికివ్వడం, వీరిపిల్లల్ని వారికివ్వడంద్వారా బంధుత్వాలు పెరిగిపోయి ఆంధ్రదేశంలో కూచిపూడికళాక్షేత్ర మెలాగో, దక్షిణదేశంలో అలా పుత్తుక్కాడు మేలటూరు గ్రామాలు కళాక్షేత్రాలుగా వెలుగొందుతున్నాయి.

## వేదాంతం సాంబయ్య

వేదాంతం సాంబయ్య గారనే కూచిపూడి





భరతనాట్యాచారుడు 18.వ. శతాబ్దంలో అనంతశయన మహారాజావారి ఆస్థానంలో ప్రవేశించి, ఆయనయొక్క పాండిత్య ప్రావీణ్యాన్ని నటనా కౌశల్యాన్ని ప్రదర్శించాడు. అనంతశయనం మహారాజు ఆబ్బుర పడ్డాడు. ఆయన తన సింహాసనంమీద ఒక గంటకాలం తృప్తిదీర కూర్చుండబెట్టిసువర్ణ హస్తాకంకణాలను ధరింపజేసి సాంబయ్య గారిని సన్మానించాడు.

## సాహెబా సల్లాముదా

కూచిపూడి భాగవతులు ఆంధ్రదేశమే కాక, హైదరాబాదు, విజయనగరం తంజావూరు మొదలైన సంస్థానాలన్నిటిని సందర్శించారు. అనేకమంది రాజుల్నీ, సామంతుల్నీ ఆశ్రయించారు. అలా సంచారంచేసే రోజుల్లో బనగానిపల్లె నవాబు వారిని ఆహ్వానించి వారి ప్రదర్శనలన్నిటినీ చూచి వారి కౌశల్యాన్ని వేనోళ్ళపొగిడి వారికితగిన పారితోషికా న్నిచ్చారు.

కూచిపూడివారు ఇలా మహమ్మదీయ నవాబుల సన్నిధికి వెళ్ళునప్పుడు వారిని స్తోత్రంచేస్తూ వుండేవారు. వారి పాటల్లో ఎక్కడో ఒకచోట వారిని స్తుతిస్తూ వుండేవారు.

వారిజతులు రామునిమీదో, విష్ణువుమీదో, కృష్ణునిమీదో రచించబడి కీర్తనాంతంలో తుదిపాదంలో సాహెబా సల్లాముదా అని స్తుతించేవారు. అంటే అటు హిందువులకు ఆగ్రహం లేకుండా హిందూమత సాంప్రదాయానుసారం, విష్ణునీ, కృష్ణునీ కీర్తించి, ఇటు సాహెబా సల్లాముదా అని నవాబుల మెప్పును పొందేవారు. ఇలా లౌకికవృత్తితో కళాప్రచారాన్ని అన్ని మార్గాల, అన్ని మతాల ప్రజల్లోకి చొప్పించారు. ఉదాహరణకు, వారు కీర్తించినజతిలో.

తాకు ఝెకుకు ఝెకు రేకిణ

సారెసారెకు పరశురాముని

సన్నుతించె నీరజాక్షవినయా...

రతిరతిందరి

తాకిణాంత ఝెకిణాంత

రవికులాంబుధి సోమదశరథ

రామచంద్ర నిందు పున్నమ

వెన్నెలాయెర, మన్నెధీర -

ఓశీరమేల్ సెబాసు సల్లాముర॥

అని దీవించేవారు. వారు ఈ విధంగా తురుష్క ప్రభువుల్ని మెప్పించి అనేక జాగీర్లను పొందారు. అలాంటివే పైన వివరించిన బనగానిపల్లె నవాబు ఒకగ్రామాన్ని వ్రాసి ఇచ్చాడు. అవే కోటకొండ-కపట్రాల.

## సంబెట గురవరాజు

కూచిపూడి భాగవతులను గురించీ, వారి పూర్వ చరిత్రనుగూర్చీ మచ్చుపల్లి కైఫీయత్‌లో 1502 నాటికి సవిస్తరంగావ్రాయబడివుంది. ఆ రోజుల్లో సిద్ధవట్టం సీమలో అంటే వినుకొండ బెల్లంకొండ ప్రాంతాన్ని సంబెట గురవరాజు పరిపాలిస్తూ వుండేవాడనీ ఆయన ప్రజలను నానా చిత్రహింసలకు గురిచేస్తూ దుర్భరంగా పరిపాలన సాగిస్తున్నాడనీ, ఆకైఫీయత్‌లో వుదహరించబడి వుంది. అంతేకాదు ఆయనరాజ్యంలో సకాలానికి ఎవరైతే శిస్తులు చెల్లించరో వారి స్త్రీలను బలవంతంగా కోటకుతీసుకువచ్చిస్త్రీలయొక్క స్థనాలకు చిరుతలు పట్టించి వారివద్దశిస్తుల్ని వసూలుచేసే వాడట. గురవరాజు పైశాచిక చర్యలన్నీ ఫీకైయత్‌లో వ్రాయబడ్డాయి.

## కూంచిపూండి

నేటి కూచిపూడికి ఆనాడు కూంచిపూండి అనే పేరు వాడుకలో వుండేది. అనాటి మన కూచిపూడి కళాకారులు, దేశాటనం చేస్తూ విజయనగరం పరిపాలిస్తున్న వీరనరసింహ రాయల ఆస్థానానికి పోతూ గురవరాజు రాజ్యంనుంచే ప్రయాణం చేస్తూ ఆయన యొక్క హింసాకాండను దారుణమైన ఆయన పరిపాలనా విధానాన్ని కళ్లారా చూచారు. చూచిన దృశ్యాన్నంతనీ కథ రూపంలోపెట్టి ప్రదర్శనాలిచ్చుకుంటూ వీర నరసింహరాయల ఆస్థానానికి చేరుకున్నారు.

## వీరనరసింహరాయలు

మన కూచిపూడి కళాకారులు రాయల వారిని కేళిక ఆడిగారు. ఆనాటికే కూచిపూడి కళాకారుల కౌశల్యాన్నిగూర్చి , వారి విద్వత్తునుగూర్చి ఆనోటా ఆనోటా విన్న రాయల వారు ప్రదర్శనానికి శలవిచ్చారు. నగరులో వున్న రాణివాసపు స్త్రీ లందరినీకూడా ఆ ప్రదర్శనం చూచి అనందించవలసిందిగా ఆజ్ఞ యిచ్చారు. ప్రదర్శనం ప్రారంభమైంది. ప్రదర్శనంలో మన కళాకారులు గురవరాజు ప్రభుత్వ పరిపాలనే ప్రదర్శించడం ప్రారంభించారు. ప్రథమంగా గురవరాజు వేష ధారణలో ఒక నటుడు ప్రవేశమై రాయల సమక్షంలో స్త్రీల స్థనాలకు చిరుతలు పట్టించి తహసీలుసొమ్ము ఇవ్వవలసిందని హింస పెట్టారు. రాయలవారు ఏమిటీ విశేషమని గురవరాజు పరిపాలనా విశేషాలను తెలుసుకున్నారు. ఆరాత్రి కీర్తన పూర్తయిన తర్వాత దర్బారు విడిది చేసి, సేనానులను ప్రధానులను సమావేశపరచి సైన్యాన్ని సిద్ధ పరచవలసిందిగా మొహింకు సెలవిచ్చారు. వెంటనే సైన్యాలు కదిలాయి. కోటల్ని ముట్టడించి, వాని పీచమణిగించి గురవరాజు రాక్షసపరిపాలన అంతమొందించి దేశంలో శాంతిని నెలకొల్పారు.

ఈ విధంగా కూచిపూడి భాగవతులు అనాడే వారి భుక్తికోసమే కళ కాదని దేశ హితాన్నికోరి దేశాభిమానంతో, ప్రజాభిమానంతో కళను ప్రజోపయోగంగా చేశారు.

ఈవృత్తాంతమంతా మచ్చుపల్లి కైఫీయత్‌లో వ్రాసినట్లు తంజావూరు సరస్వతీమహల్ శాస్త్రపరిశోధకులుగా వున్న శ్రీ నేలటూరు వెంకటరమణయ్యగారి పరిశోధనద్వారా తెలుస్తోంది.

## మంత్రశాస్త్రాలను గురించి

కూచిపూడివారు వుధృతంగా ప్రదర్శనా లిస్తున్న రోజుల్లో, చాతబడులు, మంత్ర శాస్త్రాలు మచ్చుజల్లడం మొదలైనవి ఎక్కువగా వుండేవి. కళాకారుల్లో విపరీత మైన పోటీభావం వుండడంవల్ల ఒకరికంటె ఒకరు ఎత్తుకు పైఎత్తులు వేస్తుండేవారు. శాస్త్రపరీక్షతోపాటు ఈ మంత్రపరీక్షలు కూడా వుండేవి. ముఖ్యంగా ఒకర్ని మరొకరు జయించలే మనుకొన్నప్పుడు ఈర్ష్యాభావం తోనూ, రాజాధిరాజుల, మహారాజుల మెప్పు పొందడానికి పడే పోటీలవల్ల కుళ్ళుబుద్ధితో ఒకరిమీద ఒకరు మంత్ర ప్రయోగాలు చేసుకునేవారు. అలా ప్రయోగించిన ప్రయోగాలలో మచ్చుకు ఒక ఉదాహరణ :

మళయాళ దేశానికి మన భాగవతులు సంచారం వెళ్ళగా ఒక గ్రామంలో వీరి ప్రదర్శనానికి అనుమతి యివ్వలేదు కారణం ఆ గ్రామంలో ఒక మంత్రవేత్త వున్నాడట. అతని అనుమతిలేక ఎవరూ ప్రదర్శన యివ్వ కూడదట. అయినా మన కూచిపూడివారు ఆ మంత్రవేత్తని లెక్కచెయ్యకుండా ప్రదర్శనాన్ని యివ్వడానికి నిర్ణయించుకున్నారు.

ఆనాటి వుదయం మన భాగవత శిఖామణి భాగవతుల దశరథ రామయ్యగారు మళయాళ మాంత్రికుని యింటికి వెళ్ళాడు. మాంత్రికుడు యింటివద్ద లేడు. మాంత్రికుని భార్యను చుట్ట కాల్చుకోడానికి నిప్పును అర్థించగా ఆమె నిప్పు నివ్వడం ఈయన చుట్టకాల్చుకోడం తదనంతరం ఆ అగ్నిని ఆయన మూటగట్టుకుని వెళ్ళిపోవడం జరిగిందట. ఎక్కడికో వెళ్ళవచ్చిన మళయాళ మాంత్రికునికి వృత్తాంతం భార్య చెప్పగా మండిపోయి అనాటిరాత్రి ప్రదర్శనంలో ప్రతిక్రియగా భామవేషకారునికి కడుపుబ్బునట్లు జలోదరప్రయోగం చేశారట. యింకేముంది దశరథరామయ్యగారు చూచి ప్రతీకారంగా ఒక గంటాన్ని తీసుకుని ఒక స్థంభానికి పొడవగా ఆ రంధ్రంనుంచి నీరు కారడం ప్రారంభించి భామ వేషధారికి కడుపునొప్పి తగ్గిందట.

దశరథరామయ్యగారు మళయాళ మాంత్రికునికి ప్రతీకారంగా ప్రాయశ్చిత్తం చేయాలనుకున్నాడు. వెంటనే ప్రదర్శన ప్రేక్షకుల మధ్యలో కూర్చున్న మళయాళ మాంత్రికుడు కదలలేకుండా బంధించివేశాడు. ప్రదర్శనం తెల్లవారులూ జరిగింది. కాని మాంత్రికుడు కదలలేదు. ప్రదర్శనం ఆసాంతమై అందరూ వెళ్ళిపోయారు. కాని మాంత్రికుడు శిలలాగా బంధనంలో తగులుకొని అక్కడే కూలబడి వున్నాడు. యీ స్థితిని చూచిన మాంత్రికునిభార్య దశరథ రామయ్యగారిని వేడుకొనగా ఆయన మంత్ర బంధనాన్ని సడలించాడు తరువాత మాంత్రికుడు యిల్లు చేరాడట. ఈ విధంగా వాళ్ళు యెప్పటికప్పుడు వచ్చే యిటువంటి ప్రమాదాల నన్నిటినీ తప్పించుకుంటూ వుండేవారని అనేక కథలున్నాయి.

## ప్రతిభావంతుడు దశరథరామయ్యగారు

భాగవతుల దశరథరామయ్యగారు గొల్లకలాపపు ప్రదర్శనా నిర్వహణలో అఖండ ప్రఖ్యాతిపొందినవారు బాల్యంలో గొల్లవేషం, యవ్వనదశనుండి కౌమారదశవరకూ భామ వేషంలోనూ ఆ తరువాత భామ కలాపమున సూత్రధారిగా నుండి గొప్ప ప్రతిష్ఠపొందారు.

దశరథరామయ్యగారు యీ విధంగా



కొంతకాలం భామకలాప ప్రదర్శనలోవుండి తరువాత భూతవైద్య విద్యకూడా అభ్యసించారు. ఒక సమాజానికి దర్శకత్వం వహించి ఆ బృందాన్ని నడుపుతూ దేశ పర్యటనచేస్తూ వుండేవారట. ఈయన సకలశాస్త్ర పారంగతుడైన భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారికి (వీరు కూడా భామపాత్ర ధారణలో బహు ప్రసిద్ధులు) భాగవతుల రామనాథ శాస్త్రిగారికి సమకాలికులు. వీరు తమ జట్టులతో దేశసంచారం చేయుచూ దేశమునందు వారికీర్తి ప్రజలకు ప్రసరింపజేస్తూ వుండేవారు. గొప్ప గొప్ప సంస్థానముల కేగి గొప్ప గొప్ప పండితో సభలయందు ప్రదర్శనయిచ్చి అఖండఖ్యాతి నొందారు. యీ విధంగా వీరు విజయయాత్ర చేస్తూ వుండేవారు. వీరియొక్క విద్యా ప్రభావములకు ఆబాల గోపాలం ఆనంద పడుతూ వుండేవారు.

# దుష్టశిక్షణము

—ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

### ఒక మాట

రామాయణ సుందరకాండములోని ఈ క్రింది శ్లోకము ప్రస్తుతము నా యీ రచనమునకు ప్రేరకమును, ఉద్బోధకమును అయినది.

"కి మేష భగవా న్నందీ భవే త్సాక్షా దిహా గతః
యేన శప్తోస్మి కైలాసే పురా సంచాలితే మయా"
సోయం వానరమూర్తిః స్యాత్ —"

"నేను పూర్వము కైలాస పర్వతమును కదలించినపుడు నన్ను శపించిన నందికేశ్వరుడే ఈ వానరరూపమెత్తి వచ్చెనా ?" అని రావణుడు హనుమంతుని చూచి శంకించెను.

నాడు రాక్షసరాజు తమ కైలాసముపై దురాక్రమణము గావించినప్పుడు శివునకు నమ్మినబంటగు నందీశ్వరుడు పర ఆక్రమణమును సహింపక చేసిన పౌరుష ప్రబోధమును సర్వేశ్వరు డొనరించిన దుష్టశిక్షణమును ఇందు వర్ణితములు.

హిమాచల ప్రాంతమున దురాక్రమణము చేసిన మన శత్రువుల వృత్తాంతమును, భారతవీర కర్తవ్యమును, ఇందలి వ్యంగ్యము.

కూర్మనాథుని వీపు కుదురుచట్ట చలింప
నసియాడు మంద రాహార్య మట్లు
పొంగు వర్షానదీ భంగంబు లెసరేగి
పెల్లగించిన నూగువృక్ష మట్లు
వీరశైవుల మహావేశమ్ముతో సాగి
పరశుళ్ళు దోగాడు ప్రభయునట్లు
అనుకోని భూకంపమున పునాదులు వ్రీలి
అల్లలనాడు హర్మ్యమ్మునట్లు

విశ్వనాథుండు కొలువుండు వెండికొండ
నంబికాదేవి చకితయై యరసిమాడ
కేలఁగీలించి యూచునుయ్యాల వోలె
ఎవడురా వీడు, కదలించు శివవిరోధి !

ఉబ్బులింగండు హరుఁడు తా నొకరు దేవఁడొ
తీయగా జేరి నే భవదీయుడ నన
సత్తె మని ప్రేమమును తల కెత్తఁదలచు
వాడు తరివేచి కొంప త్రవ్వంగజూచు.

వేదములు వింగడించిన వేత్త యనుచు
పదితలలు త్రుంచి పూజించు భక్తు డనుచు
వెర పెరుంగని త్రైలోక్యవీరు డనుచు
ఆదరింపగ పకు మేకయ్యె వీడు.

ప్రభుని కైలాససౌధమ్ము ప్రాంత భువిని
ద్వారదేశమ్ముచెంతల తలగి తలగి
ప్రమథగణములు లేపిన రజతధూళి
నణగిపడియుండువా డెంతఘనుడు నేడు !

పదితలల ప్రు వ్వేదో హిమపర్వతాంచ
లమున ప్రాకెడు నను వింత ప్రమథు డొకడు
వినుపగా లెక్కలేక నవ్వితిమి నాడు
దనుజకీటక మెసరు పెట్టినదె మనకు ?

అదిరా ఎంతటి సాహసంబు రజతాహార్యంబు సర్వేశ్వర
ప్రథమానామల దివ్యసౌధవిలసత్ప్రస్థంబు సర్వాప్సరో
వదనశ్రీసువిలాసరత్నముకురప్రాయంబు - తన్మూలమున్
మదవన్మూషికముష్కరుండు కదలింపంజొచ్చె నే నేటికిన్.

అని నందీశుడు నాశికాగ్రతల విన్యస్తాంగుళి ప్రక్రియా
జనితాశ్చర్యమహోగ్రహుండగుచు నోష్ఠంబుల్చలింపన్వెనుం

గినుక న్నిప్పులు రాల కన్నులను పల్కెన్ శైవవీరాగ్రణుల్
వినుడీ ద్రోహిని దుష్టసాహసుని గాలింపుండు బంధింపుడీ !

వామాచారుడు బౌద్ధికాగమకళాపారీణు డన్యప్రజా
క్షేమాలోకనజాతమత్సరుడు నక్షీణాత్మగర్వుండు నీ
హైమక్ష్మాధర పుణ్యభూములను స్నేహాంకమ్ముగా జొచ్చితత్
స్వామిద్రోహము చేసె వీని నిట విశ్వాసింపగా జెల్లునే

విశ్వదక్షుడ నంచు విఱ్ఱవీగిన వాని
శశ్వ దీశ్వర నింద సలుపు నా యజ్ఞాని
చుట్టుముట్టిన ప్రమథశూరులారా లెండు
పట్టిచంపిన వీరభద్రేశ్వరా లెమ్ము.

దావానలమువోలె దేవభూముల క్రమ్మి
కావర మ్మెక్కి యమరావతిం దోచుకొని
దర్పశిఖరము నెక్కు తారకాసురు జీల్చి
స్వర్పతిం గాంచిన విశాఖప్రభూ రమ్ము.

మీన మ్మేష మటంచు లెక్కలిడగా మించు న్ముహూర్తంబు మీ
నానాశస్త్రమహాయుధమ్ములను శాణప్రక్రియోద్దీప్తముల్
గా నూనుం డిక చేవనుం బడసి రక్షాదక్షు డస్మన్మహా
సేనాని క్రమశిక్షణంబు జయలక్ష్మిం దెచ్చు సాగుం డికన్-
అందాకన్ వలెనే శివప్రభు కటాక్షాంచ త్కృపాలబ్ధి నీ
మందున్ నేనయి చక్కబెట్టెదను లెమ్మా బాహువీర్యాతి గ
ర్వాంధుండై తను నాదరించు విభు గేహద్రోహముం
బూనువా
నిం దప్పించుక పోవనిచ్చెదనె బందీజేతు నిచ్చోటనే -
బుగబుగమండు విశ్వవిభు మూడవకంటి మెరుంగునిప్పుకల్
సెగల విదల్చి మంట లెగజిమ్ముటకేని త్రిశూలపున్మొనల్
ధగధగలాడి కాంతుల విదల్చుటకేన్ శలభంబు వీడు - ఈ
పొగ రణగింప నాకనుల మూగిన ఎఱ్ఱదనంబు చాలదే -

మొనగాడై తపియించి దా కనకగర్భున్ దృప్తుగావించి ఏ
చినదర్పంబున రాక్షస ప్రకరముల్ సేవింప నూరేగుచున్
రణకండూభర బాహుయుగ్మమున పోరాడున్ముదన్ దేవదే
వుని యిల్లే మఱి కొల్లగొట్టగను దుర్బుద్ధిన్ విజృంభించెనే.

అరిది తపోవిభూతి గని యాడిన నాడగవచ్చు-జాల్మడై
సురులను చిన్నపుర్వులటు చూచిన చూడగవచ్చు-ఎప్పుడో
నరు డొక డంప వానికిని నమ్మిన బంటయి ఏగుదెంచు వా
నరు డగు శృంగభంగము నొనర్చు బలాఢ్యుడు వీని
కెమ్మెయిన్.

అని తమ ప్రియదేశమ్మును
బనివడి యాక్రాంతినెరపు పాపుని శాప
మ్మున శిక్షించిన నందీ
శుని గనుగొని షణ్ముఖాదిశూరులు పెలుచన్.

శాపము కాదు వీని కిట శైవపరశ్వధధార వాచవిన్
జూపగనౌను-ద్రోహులకు జొప్పడునే యుపదేశవాసనల్
పాప మనస్కులందు గుణపాఠము దండమె-వీరభద్ర బా
హాపటుశూలఘాతుకవిహారగురుత్వమె యర్హ మంచనన్

అమరిక చంద్రశుభ్ర రజతాచల రత్నమహాసనమ్మునన్
స్తిమితముగా వసించు నగధీరు డుమాపతి నవ్వి యిట్టనున్
అమరవిరోధి చెయ్వులని యంతియ అల్గగనేల నాదు పా
దముకొన నొత్త జక్కబడు — దర్పము వీగును శాంతి
గెల్చెడిన్



## వెలుగు బాటలు

### పారిశ్రామికవాడలు

పరిశ్రమల పురోభివృద్ధికి అవసరమైన వాతావరణాన్నీ, సౌకర్యాలనూ కల్పించడమే పారిశ్రామికవాడల కార్యక్రమం ప్రధాన లక్ష్యం. నీరు, విద్యుచ్ఛక్తి, ఆవిరి, రవాణా, బ్యాంకింగు, తపాలా కార్యాలయాలు, క్యాంటీన్లు, ప్రథమచికిత్స, కావలా సౌకర్యాలుగల స్థలాలను సమకూర్చి పెడతారు. దీనికితోడు అనేక పరిశ్రమలు ఒకచోట నెలకొనడం, ఉమ్మడిగా మరమ్మతు మొదలైన ఏర్పాట్లను చేసుకోడం, ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టడం, పరస్పర సహాయ సహకారాలను పొందడం మొదలైన అనేక ప్రయోజనాలుంటాయి.

క్రిక్కిరిసిన ప్రాంతాలనుంచి పరిశ్రమలను విశాలమైన చోట్లకు తరలించడానికి కూడా ఈ పారిశ్రామిక వాడలు తోడ్పడతాయి. వెనకబడ్డ ప్రాంతాలలో పారిశ్రామిక వాడలు పారిశ్రామిక కార్యకలాపాలకు కేంద్రాలుగా ప్రాంతీయ అభివృద్ధి కృషికి సహాయకారిగా వుంటాయి. గ్రామప్రాంతాలలో ఫ్యాక్టరీలు ఏర్పాటు చేయడంవల్ల అక్కడ పరిశ్రమలు విశేషంగా ఏర్పడడానికికూడా అవకాశం వుంది.

చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధికిగాను పారిశ్రామిక వాడలను నెలకొల్పడం భారతదేశంలో తొలిసారిగా 1955 జనవరిలో చిన్నతరహా పరిశ్రమల సంస్థ సమావేశంలో నిర్ణయించబడింది.

ద్వితీయ ప్రణాళికా కాలంలో(1956-61) పారిశ్రామిక వాడల పథకానికి నిర్దిష్టమైన రూపం యివ్వబడింది. చిన్నతరహా పరిశ్రమలకు ప్రణాళికలో హెచ్చుమొత్తం కేటాయించారు. తొలి ప్రణాళికలో రు. 5 కోట్లు కేటాయించగా ద్వితీయ ప్రణాళికలో రు. 55.57 కోట్లు కేటాయించారు. అందులో రు. 11.38కోట్లు (అంటేనూటికి 20వంతులు) పారిశ్రామిక వాడలకు కేటాయించారు. తృతీయ ప్రణాళికలో రు. 114.38 కోట్లు కేటాయించారు. పారిశ్రామిక వాడలకు కేటాయించిన మొత్తం మూడురెట్లు పెరిగింది. ద్వితీయప్రణాళికలో రు.11.38కోట్లు, తృతీయ ప్రణాళికలో రు. 30.21 కోట్లు కేటాయించారు.

### సాధించిన అభ్యుదయం

తృతీయ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో 137 పారిశ్రామిక వాడలకు సాంకేతిక ఆమోదం లభించింది. 1963 మార్చి ఆఖరునాటికి ఆమోదంపొందిన వాడల సంఖ్య 256. అందులో 27 పారిశ్రామికవాడలు అన్ని హంగులూ సమకూర్చుకుని పనిచేస్తున్నాయి. మిగిలినవి నిర్మాణ దశలో వున్నాయి. మరో 124 వాడలలో ప్రాథమిక ఏర్పాట్లు జరుగుతున్నాయి. పై కాలంలో వీటి నిమిత్తం రు. 3.64 కోట్లు మంజూరు చేశారు. 1963 మార్చి ఆఖరు నాటికి పారిశ్రామిక వాడలకై వెచ్చించిన మొత్తం రు. 13.53 కోట్లు. ఫ్యాక్టరీ షెడ్ల నిర్మాణం, నిర్వహణల తాలూకూ వివరాలు: పూర్తి అయిన ఫ్యాక్టరీ షెడ్లసంఖ్య - 3442 కేటాయించబడిన ఫ్యాక్టరీ షెడ్లసంఖ్య - 2990. పని చేస్తున్నవాటి సంఖ్య 1331.

పని చేస్తున్న 80 పారిశ్రామిక వాడలలో 1931 షెడ్లు వున్నాయి. ఆ షెడ్లల్లో 1507 యూనిట్లు వున్నాయి. ఉత్పత్తిదార్ల సరుకులు, విడిభాగాలు తయారవుతున్నాయి. కొన్ని యూనిట్లు ఎగుమతి నిమిత్తం సరుకులను తయారు చేస్తున్నాయి. 962 యూనిట్ల నుంచి అందిన సమాచారంబట్టి 24,000 మంది కార్మికులు పనిచేస్తున్నారనీ, సాలుకు 20 కోట్ల రూపాయల విలువగల సరుకులు తయారు చేస్తున్నారనీ తెలుస్తున్నది. వర్తమాన ప్రణాళికలో మరో 300 కొత్త పారిశ్రామిక వాడలు నెలకొల్పనున్నారు

### సౌకర్యాలు

నీరు, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు గలిగి, ఫ్యాక్టరీ చట్టం నిబంధనలకు అనుగుణంగా గల ప్రణాళికా బద్ధమైన ఫ్యాక్టరీ వసతులు కల్పించడమే పారిశ్రామికవాడలు కల్పించే ప్రధాన సౌకర్యం. రైల్వే సైడింగులు, క్యాంటీనులు, ప్రథమ చికిత్సాకేంద్రాలు, బ్యాంకులు, తంతితపాలా ఆఫీసులు, టెలిఫోనులు మొదలైన సౌకర్యాలు అనేక పారిశ్రామిక వాడలలో కల్పించారు.

రాష్ట్ర ప్రభుత్వాలు, ఋణ సహాయకసంస్థలనుంచి ఋణాలులభించడం, అద్దె కొనుగోలు పద్ధతిమీద యంత్ర పరికరాల సప్లయి అన్ని చిన్నతరహా పరిశ్రమలకు లభిస్తుంది. అయితే పారిశ్రామిక వాడలకు ప్రత్యేక ప్రాధాన్యం వుంది.

పారిశ్రామిక వాడలంటే రకరకాల కార్ఖానాల సముదాయంకాదు. ఆ పారిశ్రామిక వాడలు పరిశ్రమలు నెలకొల్పినవారి మధ్య అవి సహకారభావాన్ని పెంపొందిస్తాయి. క్రమేణా వారంతాకలిసి ఉమ్మడిగా రవాణా సర్వీసునూ, సంరక్షణ, మరమ్మత్తు కేంద్రాలనూ, ముడిపదార్థాల తయారీ వస్తువుల డిపోలనూ ఏర్పరుచుకోగలరని ఆశ.

పారిశ్రామిక వాడల ఆర్థిక సహాయ పథకంక్రింద ఆ వాడల స్థాపనకయ్యే ఖర్చు నంతనూ కేంద్ర ప్రభుత్వమే రాష్ట్ర

ప్రభుత్వాలకు అప్పుగా యిస్తుంది. స్థలం సేకరణ, భవనాలనిర్మాణం - వీటికయ్యే మొత్తం 20 ఏళ్ళలో తీర్చే అప్పుగా యివ్వబడుతుంది. విద్యుత్సౌకర్య కల్పన, నీటి సరఫరా - యిందు కవసరమయ్యే పెట్టుబడి 30 ఏళ్ళలో తీర్చే అప్పుగా యివ్వబడుతుంది. వీటికితోడు, ప్లానులూ, అంచనాల తయారీకి అవసరమయ్యే సొమ్ము రాష్ట్ర ప్రభుత్వాలకు గ్రాంటుగా యివ్వబడుతుంది.

పారిశ్రామిక వాడలలో ఫ్యాక్టరీలు ఏర్పరుచుకున్న లఘు పారిశ్రామిక దార్లకు, ఫ్యాక్టరీలఅద్దె తగ్గించేందుకు వీలుగా ప్రభుత్వం అయిదేళ్ళవరకూ సబ్సిడీ యిస్తుందికూడా. లఘు పారిశ్రామిక దార్లకు యిది ప్రోత్సాహదాయకమైన విషయం.

### ప్రైవేటు పారిశ్రామిక వాడలు

లఘు పారిశ్రామికదార్ల సహకార సంఘాలూ, లేదా ప్రైవేటు పారిశ్రామిక సంస్థలూ స్వయంగా ప్రైవేటు పారిశ్రామిక వాడలు ఏర్పరుచుకునేందుకు ఒక పథకం రూపొందించబడింది. ఈ పథకం క్రింద, పారిశ్రామిక సహకార సంఘాలయితే, అవి వసూలుచేసిన వాటాధనానికి అయిదారు రెట్ల పెట్టుబడీ, ప్రైవేటు పారిశ్రామిక వ్యాపార సంస్థలయితే, వారి వాటాధనానికి మూడు నాల్గురెట్ల పెట్టుబడీ బ్యాంకులవంటి పరపతి సంస్థలు అందజేస్తాయి. ఈ అప్పును ఏడు నుంచి పదేళ్ళలోగా తీర్చవలసివుంది. ఈ అప్పుకు వడ్డీరేటు స్వల్పంగానే వుంటుంది. ఇట్టి పారిశ్రామిక సహకార సంఘాలనూ, పారిశ్రామిక వ్యాపార సంస్థలనూ నెలకొల్పేందుకు కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు యిదివరకే చర్యలు తీసుకున్నాయి.

పారిశ్రామిక వాడల స్థాపననిమిత్తం ఏర్పడిన సహకార సంఘాలకూ, ప్రైవేటు వ్యాపార సంస్థలకూ అప్పులివ్వడానికి భారత జీవితభీమా సంస్థకూడా అంగీకరించింది.

భారీ పరిశ్రమలకు అనుబంధంగా పనిచేస్తూ, వాటికి కొన్నిరకాల విడి పనిముట్లను ఉత్పత్తి చేసేందుకు ప్రత్యేక పారిశ్రామిక వాడలను ఏర్పాటు చేయాలని కూడా తలపెట్టబడింది.

తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో యిట్టి ప్రత్యేక పారిశ్రామిక వాడలను నెలకొల్పేందుకు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు అప్పుడే చర్యలు తీసుకున్నాయి.

మోటారుకార్ల భాగాల తయారీకిగాను మహారాష్ట్ర ప్రభుత్వం బొంబాయికి సమీపాన యిట్టి ప్రత్యేక పారిశ్రామిక వాడను నెలకొల్ప తలపెట్టింది. ఇందుకై, కళ్యాణ్‌కు సమీపాన 150 ఎకరాల విస్తీర్ణం గల స్థలాన్ని ఎంచుకున్నారు కూడా. లఘు ఇంజినీరింగు పరిశ్రమకు విడిభాగా లుత్పత్తి చేసేందుకు నాగపూర్‌కు సమీపాన మరో పారిశ్రామిక వాడను నెలకొల్పుతున్నారు.

మోటారుకార్ల పరిశ్రమకు విడిభాలు తయారుచేసి సరఫరా చేసేందుకు బరోడాకు సమీపాన ఒక పారిశ్రామిక వాడను నెలకొల్పాలని గుజరాత్ ప్రభుత్వం తలపెట్టింది.

తోలువస్తువుల తయారీకి ఒక ప్రత్యేక పారిశ్రామిక వాడను నెలకొల్పాలని మద్రాసు ప్రభుత్వం సంకల్పించింది.

విశ్వవిద్యాలయ విద్యార్థులకు అనుభవపూర్వక శిక్షణ గరిపేందుకు వీలుగా విశ్వవిద్యాలయాలవంటి ఉన్నత విద్యాసంస్థల సమీపంలో కూడా పారిశ్రామిక వాడలను నెలకొల్పాలని నిర్ణయించబడింది. అప్పుడే రూర్కీ విశ్వవిదాలయం ఆవరణలో ఆట్టి పారిశ్రామిక వాడ ఒకటి నెలకొల్పబడింది.

## భిలాయ్ ఉక్కుఫ్యాక్టరీ

భిలాయ్ ఉక్కు ఫ్యాక్టరీ చరిత్రలో 1963-64వ సంవత్సరం అతిముఖ్యమైనది ఈ ఫ్యాక్టరీ విస్తరణ పథకం క్రింద ఉక్కు దిమ్మల సాలుసరి ఉత్పత్తి 10 లక్షల టన్నులనుంచి 25లక్షల టన్నులకు పెరిగింది. ఈ ఫ్యాక్టరీ తాలూకు భారీ యూనిట్లన్నీ ఉత్పత్తి లక్ష్యాన్ని నిర్ణీతగడువుకు 1½ నెలలు ముందే సాధించాయి. ఈ సంవత్సరంలో ఉక్కు మొత్తం ఉత్పత్తి ఈ ఫ్యాక్టరీ ఉత్పత్తి రేటును నూటికి 115 వంతులు మించింది.

భిలాయ్ ఉక్కు ఫ్యాక్టరీ విస్తరణ పథకం క్రింద ఈ నాల్గవ భారీ బ్యాటరీ నిర్మాణం అత్యంత ముఖ్యమైనది. దీని నిర్మాణ వ్యయం రు. 3 కోట్లు. ఇందులో 65 బట్టీలున్నాయి. ఇది సాలుకు 4లక్షల టన్నుల కోక్ ఉత్పత్తి చేస్తుంది. దీనికి తోడు మరొక బొగ్గుబట్టీ ఫ్యాక్టరీ, బ్లాస్ట్ ఫర్నేసు, మరో రెండు కొలిమిలు, ఒక టర్బో - జనరేటరు 1964 ఆఖరులోగా పని ప్రారంభించగలవు. ఈ సంవత్సరం ఆఖరుకు భిలాయ్ ఫ్యాక్టరీలో ఉక్కుదిమ్మల ఉత్పత్తి 18లక్షల టన్నులకు పెరుగగలదు. 1965 ఆఖరు నాటికి యిది 25లక్షల టన్నులకు పెరుగగలదు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో సోవియటురష్యా సహకార సాంకేతిక ఆర్థిక సహాయాలతో ఈ ఫ్యాక్టరీ నెలకొల్పబడింది. ఈ ఫ్యాక్టరీ స్థాపనకు 1955 ఫిబ్రవరిలో ఇండియా, రష్యా ప్రభుత్వాలు ఒక ఒప్పందాన్ని చేసుకున్నాయి.

ఈ యంత్రాగారం స్థాపనకు సంబంధించిన నివేదిక త్వరలోనే తయారు చేయబడింది. యంత్రసామగ్రుల సరఫరాకు ఒప్పందం కుదుర్చుకోవడం జరిగింది.

1956 మే నెలలో యీ కర్మాగారం నిర్మాణానికి మట్టిపని ప్రారంభ మయింది. 1961-62వ సంవత్సరం ఆఖరుకు యీ కర్మాగారం నిర్మాణం పూర్తయింది.

మొదటి బొగ్గుబట్టీ బ్యాటరీ, మొదటి బ్లాస్ట్ ఫర్నేసు పని ప్రారంభించి యీ సంవత్సరారంభానికి అయిదేళ్ళయింది. ఈ అయిదేళ్ళలోనూ ఒక్కసారి కూడా యీ కర్మాగారంలో యంత్రాల లోపంవల్లగాని, నిర్మాణ లోపంవల్లగానీ పని అడ్డలేదంటే, ఆ ఘనత సోవియెట్ రష్యాకే చాలావరకూ చెందుతుంది.

భిలాయ్ కర్మాగారానికి అవసరమైన ముడి ఇనుమును, దారీ-రాజారగని సప్లయి చేస్తోంది. పూర్తిగా యంత్రాల సహాయంతోనే యీ గనిలో ఇనుపఖనిజం త్రవ్వకం కార్యక్రమం సాగుతోంది. ఈ కర్మాగారానికి అవసరమైన మూడు రకాల ముడి ఇనుము యీ రాజారగనే సరఫరా చేస్తోంది. ఈ కర్మాగారానికి 25 కిలోమీటర్ల దూరంలో వున్న నందినీ సున్నపు రాయి గనులనుంచి సున్నపురాయి సరఫరా చేయబడుతోంది. హిర్రీ గని డోలమైట్‌ను సప్లయి చేస్తోంది. భిలాయ్ కర్మాగారం అధ్వర్యం క్రిందే యీ గని త్రవ్వకం కార్యక్రమం నిర్వహించబడుతోంది. బీహారులోని బొగ్గుగనుల నుంచి యీ కర్మాగారానికి బొగ్గు సప్లయి చేయబడుతోంది.

## లక్ష్యాన్ని మించి ఉత్పత్తి

భిలాయ్ కర్మాగారంలోని బ్లాస్ట్ ఫర్నేసులు తక్కువ బొగ్గు వాడకంతో హెచ్చు ఫలితాలనిస్తున్నాయి. 1963-64 లో దుక్కయినుము ఉత్పత్తి యీ కర్మాగారానికి నిర్దేశించిన ఉత్పత్తి శక్తిని మించింది. అంటే, 1963-64లో ఉత్పత్తి అయిన దుక్కఇనుము ఉత్పత్తి శక్తికంటే నూటికి 16.7 వంతులు హెచ్చు.

భిలాయ్‌లోని ఉక్కు కరిగించే యంత్రాగారంలో అనేక కొత్త రకాల ఉక్కు తయారవుతోంది. ఉక్కుదిమ్మలో, కడ్డీల ఉత్పత్తి కూడా లక్ష్యాన్ని మించి ఉంటోంది.

ఇక్కడ ఏర్పాటు చేయబడిన రైలు పట్టాల తయారీ విభాగంలో ఆశించిన దాని కన్న హెచ్చుగా ఉత్పత్తి సాగుతోంది. ఇక్కడ తయారైన 1,25,000 మెట్రిక్ టన్నుల రైలు పట్టాలు సూడాన్ దేశానికి ఎగుమతయ్యాయి కూడా. ★

---

(7 వ పేజీ తరువాయి)

దారుణ్నికూడా ధరల పెరుగుదల నుండి రక్షించాలి. అంటే కొంత స్థాయిని మించి ధరలు పెరగకుండా చూడాలి.

ఆహారధాన్యాల విషయంలో ధరల స్థిరీకరణకు పెద్ద ఎత్తున నిలువలు చేయాలి. ఈ విధంగాచేస్తే కనిష్ఠ, గరిష్ఠ ధరలను నిశ్చయించడానికి వీలుంటుంది. ఇందుకు దేశంలోని ఆహార ధాన్యాలను సేకరిస్తే చాలదు. కొంతవరకు విదేశాల నుండి ఖరీదు చేయవలసిన అవసరంకూడా వుంటుంది. ఆహారధాన్యాల ధరలను అదుపులో పెట్టడానికై దేశంలో మొత్తం 51,000 చౌక ధరల దుకాణాలు తెరవబడ్డాయి.

**ఆహారధాన్యాలు :**

సాగవుతున్న భూమిలో ⅕వ వంతు భూమికి నీటి పారుదల సౌకర్యం వుంది. మిలిగినది వర్షంమీద ఆధారపడివుంది. గత రెండేళ్ళలోనూ వరిపంట దెబ్బతిన్నది. అయినా మొత్తం దిగుమతులలో బియ్యం 10 శాతం మాత్రమే. మిగతా 90 శాతం గోధుమలు. ఇటీవలి లెక్కల ప్రకారం గోధుమ వుత్పత్తి 1953-62 లలో 20 శాతం పెరిగింది. వరిపంట వుత్పత్తి మాత్రం 6 శాతం పెరిగింది. అందుచేత నిలువచేసుకోవడానికి విదేశాల నుండి కొంతవరకు బియ్యాన్ని దిగుమతి చేసుకోవలసివుంటుంది.

జపానులో 90 లక్షల టన్నులు బియ్యం ఉత్పత్తికాగా దిగుమతి 10 లక్షల టన్నులు. అంటే 20 శాతం అన్నమాట. భారతదేశంలో మాత్రం దిగుమతి చేసుకునే బియ్యం 40 లక్షల టన్నులు మాత్రమే. అంటే మొత్తం వుత్పత్తిలో 1 శాతం కూడా లేదు. దీన్నిబట్టి ఎంత తక్కువగా మనం దిగుమతి చేసుకుంటున్నామో తెలుస్తుంది. దిగుమతులు నిలుపుదల చేయాలంటే, ముందుగా మనం స్వయం సమృద్ధిని సాధించుకోవడం అవసరం. నాగార్జునసాగర్ ఆనకట్ట పూర్తయితే స్వయం సమృద్ధిని సాధించడానికి వీలుంటుంది. దేశానికి దీనివల్ల లభించనున్న ప్రయోజనాల దృష్ట్యా దీనిని జాతీయ ప్రాజెక్టుగా పరిగణించవలసి వుంది.

ప్రజల దృక్పథం మారితేగాని ప్రణాళికలు విజయవంతం కావు. ప్రజల హృదయాలలో మహాత్మాజీ, పండిట్‌జీలు గాఢంగా నాటుకు పోవడం నిజంగా దేశంయొక్క అదృష్టం. మహాత్మాగాంధి సత్యాగ్రహ ఆయుధంతో భారతదేశం ఒక్కదానికే స్వాతంత్ర్యం సంపాదించి పెట్టలేదు. తరువాత భారతదేశం వలె రక్తపాతం లేకుండా పోరాటం లేకుండా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న యితర దేశాలకు కూడా మార్గదర్శి అయ్యాడు. ప్రపంచ సౌభాగ్యానికై ప్రపంచమంతా ఒకే కుటుంబంలా శాంతిగా బ్రతకాలి. ★

# హాంపన్న ★ కుంటిమద్ది శేషశర్మ

గేటుకీపరగు హాంపన్నంటే ! –
పొద్దు పడమటనె పొటమరించినా,
పారావారము నీర మింకినా
నింగి తారకలు నేలగూలినా
ధర్మము తప్పని కర్మశీలుడూ.
నెనరు గుండెగల నియతవ్రతుడూ.

హాంపన్నను గని యపరిచితంబగు
కలుకు చెడందయు కలిగి యొకించుక
ఇరవు నొసంగును చిరునగవులతో
సత్కరించునూ సంభాషించును.

కాలికి చెప్పులు కాకీయంగీ
అదేరంగుదే అర్ధోరుకమూ
అలంకారమూ ఆధికారికము :
వదులుగనున్నా వదలని బెల్టూ
పట్టకుండినా పెట్టిన టోపీ
అతనికి నమరిన యమూల్యవేషం.

అచల తనువుతో హస్తముద్రనో
పచ్చదీపమునో పట్టి నిల్చుకొని
వచ్చేబండికి స్వాగత మిచ్చుటొ
పొయ్యేబండిని సాగనంపుటో
అనవరతమ్మది యాతని కొలువూ.

మంచుకెండకూ చిమ్మచీకటికి
సుడియక జడియక సొక్కక సోలక,
వంకలు దాటీ వాగులు దాటీ
కొండల నెక్కి కోనలు ద్రొక్కి
మలుపులు దిరిగీ మెలికలు మెలగీ
అంతే తెలియని యయోమార్గమున,
కోడెనాగువలె బుసలు గొట్టుచూ
ఫాలలోచనము రేల విచ్చుకొని

సెగలఁగ్రక్కుచూ పొగలఁజిమ్ముచూ
చెకచెకచెకచెకచెకచెకచెకచెక
దూరదూరమున దూకుచువచ్చే
పొగబండించుక పొడ గనినంతన
బాట కడ్డముగ బారతలుపులను
మూసి బిగించీ వేసముదాల్చి
నిలబడియుండును నిచ్చ లేమరక.

ఎండ కెండినా వాన నానినా,
దూకులువారే ధూమశకట మది
ఎవ్వడ వనదూ ఏమని యడుగదు,
సంభాషింపదు చక్కఁజూడదూ,
చిరునవ్వించుక చిందిపోవదూ,
మదమత్తద్విప మస్తిష్కమ్ముల
కళనాయిత మగు హర్యక్షేంద్రము
క్రేవల నుండిన క్రించుమెకమ్ములఁ
గ్రేగంటను పరికించని విధమునఁ,
దన్ను గణింపక తరలిపోయినను
కలత వహింపని కర్మఠు డాతడు.

గూళ్ళపాళ్ళమున కుపకంఠమ్మున
గుట్టలమెట్టుచు గుంటల జారుచు
కూతలు వేయుచు గుంతకంటి పొగ
బండి హుటాహుటి వచ్చెను పోయెను
ధూమ శకట మది తామసించినను
తన ధర్మంబును దప్పని హాంపన
స్వాగత మిచ్చెను సాగనంపెనూ.

ఆ నిశాముఖమందు నంగనామణు లిద్ద
ర రుగుచుండిరి గేటు కల్లంత దూరాన.
చెదరిపోయిన కురులు చిందులాడ ముఖాన,
తమ్మలపురాగమున దంతధవళిమ దోప,
పరువంపు నిగనిగల ఫాలమ్ముపై ఘర్మ

బిందువులు గ్రమ్మ యొక వింతయందము దోప,
తారుణ్యాగాధతాదర్శకస్తనపీవ -
రత యువకులకు తత్తరము జనింపఁగఁజేయ,
చిత్త మురవడి పరువు లెత్తుచున్నను గూడ
పీన కుచభారమ్ము పిరుదుభారము గూడ
అంజసాగఁగనీక యాటంక మగుచుండ,
మొలదోపుకొన్న కొడవలుల పిడు లేచేనొ
కోయఁబోయిన తల్లెగుబ్బెతలు నాఁదెల్ప
ముచ్చటలు సల్పుచును ముదిత లరుగుచునుండి.

అంతలో గాంచినా రల్లంత దూరాన
లేడిపిల్లల వేటలాడ నడవుల దిరుగు,
దాపులో దిగియున్న దండులో కొలువున్న
ప్రాయంపుకావరము కాయమ్ముఁగ్రమ్ముకొన
రమణి యనగానే రిరంసాకులంబైన
మానసంబునఁ బొంగుమాన్మథోద్రేకమ్ము
నణచజాలనివారి నా కామినీ మణులు.

దండువారన్ననే దడబుట్టు గుండెలకు,
ఒడలు గడగడలాడు నడుగు తడబడుచుండు
రణరంగములయందు తృణమువలె ప్రాణాలు
లెక్కసేయని యుక్కుముక్కలు సిపాయీలు
అందులో తెల్లవా రన్న-వారికి నింక
ఆటంకమే లేదు అడుగువాడే లేడు
అనరాదు పల్లెత్తి, కనరాదు కన్నెత్తి,
మనకు వారలచేఁత మదికెంత రోతైన.

వారలఁ గనుఁగొని వనిత లంతటను
పలువిధమ్ములగు వలవని తలపులు
క్రందుకొనఁగఁ దమ డెందములందున
బావురుగానికి భయపడి తొలగెడి
రాచిలుకలవలె రమణులు విసవిస
చనుచుండగనే చయ్యన వారల
దరిసి యొక్కరుడు దురుసుతనమ్మున
కాంత నొక్కతెను కరము వట్టికొనె
అబలామణియును నాగ్రహమ్ముతో
అంటిన కరమును నట్టె దులిపి తన

మొలదోపిన కొడవలి కదువడితో
దూసి నిల్చెఁ గెందొవకనుఁగవతో.

అంతలోన నా పుంత నెవ్వడో
అరుగుదెంచినటు లలజడి వొడమగ,
వెనుక దగ్గరా వీరపూరుషులు
అదియదనుగ నా యంగన లురవడి
పరువు లిడుచు హంపన్నను డాసిరి.
"రక్షింపుము సంరక్షింపుము మము
హంపన్నా ! మా యన్నా ! అన్నుల
మానరక్షణము పూనుము కడువడి"
అని, ప్రార్థించిన యతివల కన్నుల
లోఁ దొలకెడి యెదలో నుమ్మలికము,
నడకలోన తొందరపాటును, మా
టలలోఁ దోచెడి డగ్గుత్తికయును,
చెంతల జూపెడి చేతి సన్నయును
కలయర్థమ్మును దెలియ జేసినవి.

తలయూచి యొకసారి, తలిరుబోణులఁజూచి
అల్లంత చనుదెంచు తెల్లదొరలను జూచి
వారింపరానట్టి వారి తెగువను జూచి
మానినీ మానసమ్మాననీయతకునై
అంతకంటెను వేరె యనువుగామి యెరింగి
అందు రాబోవు నత్యాహితము గమనించి,
అదరుడెందము కొంత కుదురుపాటుకుఁదెచ్చి
చెంతగల గదిలోని కింతులను బంపి, తా
బీగమ్ము వేసి, చెవి వేగ నెచటో వేసె.

అటు చిక్కినటు చిక్కి మటుమాయ మైనట్టి
కుటిలాలకలకొఱకు నటు లిటుల పరికించి
చెయిజారి పోవుటకు చింతించి మదిలోన
తెగువఁ బూనిన గుండె దిటవుతో రయముతో
బూటు టకటకలతో నాటోపములతోడ
ఓట సుంతయు లేక గేటుకడ కేతెంచి,
గేటుకీపరు గాంచి కేడించి యడిగినా
రిటు వచ్చి యాకాంత లెటుబోయి నారంచు,
పాశ్చాత్య భటులు హంపన్న నొప్పరికించి.

[మిగతా 21 వ పేజీలో]

మన రాష్ట్రంలో గిరిజన జనాభా 13,24,368. అంటే మొత్తం జనాభాలో 3% అన్నమాట. గిరిజన సంక్షేమానికి మొదటి రెండు ప్రణాళికలు, మూడో ప్రణాళిక మొదటి రెండుసంవత్సరాలలో 563 లక్షల రూపాయలు ఖర్చయింది. ఇదిగాక బహుళార్థక అభివృద్ధి బ్లాకులకు గత ఐదేండ్లలో 25 లక్షల రూపాయలు ఖర్చయింది.

ఈ ఖర్చు మామూలుగా అందరితోబాటు గిరిజనులకు బడ్జెట్‌లో పెట్టే ఖర్చుకు అదనంగా జరిగినది. ఈ ఖర్చంతా సద్వినియోగం అవుతున్నదా? అనుకొన్న ఫలితాలు కలుగుతున్నవా? ఈ కృషి మరింత సఫలం కావడానికి ఏమి చేయాలి? యీ ప్రశ్నల్ని గిరిజన దృక్పథంనుండి యీ వ్యాసంలో చర్చిస్తాను. గిరిజనుల జీవిత పరిస్థితుల్ని కూడ సంక్షిప్తంగా వివరిస్తాను.

### మార్పుకు ఒప్పుకొంటారా?

గిరిజనుల్ని యితరప్రజల స్థాయికి తేవడమే వారి సంక్షేమ కృషి లక్ష్యం. అయితే, అసలు గిరిజనులు తమ జీవిత పద్ధతుల మార్పుకు అంగీకరిస్తారా? అనే ప్రశ్న చాలకాలంగా చర్చించబడుతున్నది. మార్పు అని తెలిస్తే వారంతా తిరగబడతారనికూడ మంత్రులు యితర ప్రముఖులు ఉపన్యాసాలిస్తూ వచ్చారు.

కాని, వారి వేషభాషలలో ఎంతో మార్పు జరగవలసి ఉంది. ఆ మార్పు వారి మంచికేనని,వారికినచ్చజెబితే సంతోషంతో మార్పుకు అంగీకరిస్తారు. ఎలాంటి తిరుగుబాటూరాదు. వారిలో ఉన్న మూఢనమ్మకాలు, దురభ్యాసాలు పోనిదే, యీ విషయమై వారి దృక్పథంలో మార్పు రానిదే యిక గిరిజన సంక్షేమానికి యింతడబ్బూ ఖర్చుపెట్టి ఏమి ప్రయోజనం?

### పథకాలపట్ల ఆసక్తిలేదు

సంక్షేమానికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన కాలనైజేషన్ పథకంలాంటి వాటికిరిస్పాన్సు రావడంలేదు. ఎందుకంటే, లక్షలుఖర్చుచేసే యిండ్లు నిర్మించియిచ్చినా, భూములు, ఎడ్లు యిచ్చినా ఆ పథకాలు అమలు జరిపిన ప్రదేశాలలో అసలుత్రాగనీటికి నీరేలేదు. ఇక గిరిజనులు ఆ కాలనీలలో స్థిరపడి వ్యవసాయం చేయమంచే ఎలా సాధ్యమౌతుంది? ఇందుకే సంఘ సంక్షేమ శాఖలో గిరిజన సంక్షేమ విభాగంలో ఎన్నోసార్లు ఫండ్సులాప్స్ అవుతుంటాయి. ఈ కృషిలో డబ్బు ఖర్చు కాకుండా మురిగిపోతుందంటే దురదృష్టకరమనాలి. ఈ విధంగా నిధులు మురిగిపోవడానికి మరోకారణం అధికారులు అంతగా బాధ్యత వహించకపోవడం. వారిలో గిరిజనులు లేకపోవడంవలన గిరిజన సంక్షేమంపట్ల వారికి ఉద్యోగధర్మంగా మనకు ఎలాంటి ఆసక్తి ఉండటంలేదు.




పి. వాణీరమణారావు

ఇప్పుడిప్పుడు గిరిజనులలో పట్టభద్రులు సహితం వస్తున్నారు. మెట్రిక్యులేషన్ చదివినవారు చాలమంది ఉన్నారు. వారిలో నిరుద్యోగం ఉండటం విచారకరం. ఇలాంటి గిరిజన యువకుల్ని గిరిజన సంక్షేమానికి సంబంధించిన ఉద్యోగాలకు నియమిస్తుంటే గిరిజనాభ్యుదయంపట్ల మరింతశ్రద్ధ వహించబడుతుందనడంలో సందేహంలేదు.

గిరిజనులు చాల పేదవారు. వర్తకులు యీ అవకాశాన్ని తీసుకొని ముందే పెట్టుబడి పెట్టి తరువాత గిరిజనులు ఉత్పత్తిచేసిన వస్తువుల్ని చౌకగా కొంటారు. ప్రభుత్వం దీనిని అరికట్టే ఆశయంతో గిరిజన ఆర్థికాభివృద్ధి కార్పొరేషన్‌ను నెలకొల్పింది. అందులో నేనూ సభ్యురాలినే. కార్పొరేషన్ చాలవరకు గిరిజనులకు సహాయపడుతున్నది. వారి వస్తువులను టోకుధరలకు కొని, వారికి కావలసిన వస్తువుల్ని సరసధరలకు అమ్ముతున్నది. వారికి కావసింది కేవలం వస్తువుల్ని కొనడం, అమ్మడం కాదు. సకాలానికి అప్పు కావాలి. అది కార్పొరేషన్ యివ్వదు. అందువలన వారు వర్తకులపై ఆధారపడక తప్పడంలేదు. దొంగతనంగా తమ ఉత్పత్తుల్ని వర్తకులకు అమ్ముతున్నారు. కార్పొరేషన్ వారు ఎక్కువగా సంతలలో గిరిజనుల సరకులు కొంటున్నారు. అక్కడ పెద్దపెద్ద క్యూలు ఉంటున్నాయి. మూడునాల్గు గంటలు నిలబడితే చీకటి పడిపోతోంది. దానితో గిరిజనులు సంతలో కొనాలనుకొన్న సరుకులు దొరకవు

కార్పొరేషన్‌వారు గిరిజనులకు అమ్మే సరకులు సంతలోని ధరకంటె కొంచెం తక్కువధరకే దొరుకుతున్నాయి. అంతవరకూ అది బాగానే ఉపయోగపడుతున్నది.

గిరిజనులకు అప్పు కావాలని చెప్పాను కదా? ఈ విషయంలో వీరిని గిరిజనేతరులు మోసగిస్తున్నారు. వీరికి చదువులేక ఏ చదువుకొన్న రైతులదగ్గరకో యితరుల దగ్గరకో వెడుతున్నారు. 'అప్పు కావాలికదా యీ కాగితంపైసంతకంపెట్టు' అని వారు పెట్టించు

కొని సహకార సంఘంల గంజనుని పెర అప్పుతీసుకొని ఏదో కొంతభాగమే అతనికి యిస్తున్నారు. అదీగాక ఎక్కువ వడ్డీ తీసుకొంటున్నారు. అందువలన కార్పొరేషన్ ద్వారా గిరిజనులకు అప్పిచ్చే ఏర్పాటు చేసే యీ పరిస్థితి చాలవరకూ బాగుపడుతుంది.

## ముఠాదారీ, జమీందారీ

ఇప్పటికీ ముఠాదారీ, జమీందారీ విధానాలు గిరిజనులు ఎక్కువగా ఉండే ఏజన్సీ ప్రాంతాలలో కొనసాగుతున్నవంటే మొత్తం ప్రజలందరికీ అవమానకరమని చెప్పాలి. ఎల్లవరం, రంపచోడవరం తాలూకాలలో ముఠాదారీ విధానం, నూగూరు తాలూకాలో జమీందారీ విధానం ఉన్నాయి వారి దౌర్జన్యాలకు అంతులేదు. ప్రభుత్వం యీ విధానాల్ని రద్దుచేయడానికి వాగ్దానం చేసింది.

## విద్యాభివృద్ధి

గిరిజనులలో చదువుకొనేవారి సంఖ్య లోగడకంటె తగ్గిందంటే అతిశయోక్తిగానే కనబడుతుంది. కాని అది నిజం. లోగడ స్కాలర్‌షిప్పులు యిచ్చేవారు. ఆ డబ్బు తలిదండ్రులు తీసుకొని ఏ పాకలలోనో తమ పిల్లల్నిపెట్టి భోజనం పంపించి చదివించేవారు. ఇప్పుడు బోర్డింగ్ పాఠశాలలు వచ్చినాయి. అక్కడ ఉచితంగా గిరిజన పిల్లలకు భోజనం పెడుతున్నా యిది స్కాలర్ షిప్పులకంటె మెరుగనే విషయం అమాయకులయిన వారికి తెలియక, పిల్లల్ని స్కూలుకు పంపడం తగ్గించివేశారు. ఏ గొడ్లకాపరిగానో పెడితే నెలకు 4 రూపాయలు వస్తాయని చూస్తున్నారు. ఆ నాలుగు రూపాయలే చూస్తారుగాని మరేమీ చూడరు. గిరిజనాభ్యుదయానికి యిన్ని లక్షలు ఖర్చుపెట్టే ప్రభుత్వం ఏ స్కాలర్‌షిప్పు పేరుతోనో గిరిజన పిల్లల తలిదండ్రులకు ఆ కొద్ది మొత్తం యిచ్చేటట్లయితే వారు తప్పక తమ పిల్లల్ని బడికి పంపుతారు.

అలా చేయకపోతే, గొడ్ల కాపరిగా పంపడం కంటె స్కూలుకు పంపడం ఎంత లాభమో వారికి నచ్చచెప్పడానికి తగు ప్రచారమైనా ఏర్పాటు చేయాలి.

## మూఢనమ్మకాలు

గిరిజనులలో చాతబడులు, దేవతలు, దెయ్యాలు అంటే ఎంతో నమ్మకం ఉంది. జంతుబలులు విరివిగా జరుగుతుంటాయి. త్రాగుడు దురాచారం విపరీతంగా ఉంది. చుట్టత్రాగుడుకూడ ఎక్కువే. ఈ రెండూ స్త్రీలలోకూడ ఉన్నాయి. త్రాగుడు లేనిదే ఏ శుభకార్యం జరగదు.

ఇవన్నీ హానికరమని వారికి నచ్చజెప్పే ప్రయత్నం జరగాలి. ఎందుకంటే వీటివలన మగవారు ఏమీ పని చేయరు. ఆడవాళ్ళే ఎక్కువ కష్టపడతారు. వారే వ్యవసాయం కూడ చేస్తారు.

లంబాడీలలోని దుస్తులు మురికికారుతూ ఉంటాయి. ఈ అలవాటులన్నీ గిరిజనులలో అనారోగ్యాన్ని, అంటువ్యాధుల్నీ వ్యాపింపజేస్తున్నాయి. అందువలన ప్రచారకులద్వారా ఎంతో కృషి జరగవలసి ఉంది. నిజానికి గిరిజనులు యీ మూఢనమ్మకాలు, దురలవాట్లు వదిలించుకొంటే సగం బాగుపడినట్లే.

## ఆరోగ్యం

వారి అనారోగ్యానికి మరోకారణం మంచినీళ్ళు లేక వాగుల్లో నీరు త్రాగవలసి రావడమే. ఒకోచోట వారు 8 మైళ్ళదూరం పోయి నీరు తెచ్చుకోవలసి ఉంటుంది. అందుకే వారు చాల అరుదుగా స్నానం చేస్తారు. బ్లాకులలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు బహుకొద్దిమందికి మాత్రమే వినియోగపడుతున్నాయి. అందువలన బావులు ఎక్కువగా త్రవ్వించాలి.

వారుతినే ఆహార పదార్థాలుకూడ పోషకమైనవిగా ఉండవు. ఎక్కువగా దుంపలు, చింతగింజల అంబలి, బొద్దికూర తింటారు. కొందరు జొన్నలు తింటారు.

## వివాహాలు

ఇప్పటికీ పెండ్లిండ్లకు అనవసర ఖర్చులు పెడుతున్నది గిరిజనులే అంటే అతిశయోక్తి కాదు. త్రాగుడుకు ఎంతో డబ్బు వృథా అవుతుంది.

ఒక యువకునికి ఒక పిల్లను చేసుకోవాలని వుంటే — ఆ పిల్లగాని తలిదండ్రులు గాని ఒప్పుకొనకపోతే బలవంతంగా ఎత్తుకొనిపోయి ఒప్పించే ప్రయత్నం చేస్తారు. ఒకోసారి యీ సందర్భంలో రెండు పక్షాలవారి మధ్య కర్రల "యుద్ధం" జరుగుతుంది. సాధారణంగా "యుద్ధం" అయ్యాక పెండ్లికి ఒప్పుకొని రాజీపడి త్రాగి తందనాలతో గడుపుతారు.

ఆడపిల్ల ఏ యువకుడినైనా చేసుకోవాలనుకొంటే ఆ యువకుని యింటిలో ప్రవేశిస్తుంది. దీనినే "యిల్లు చొరబడింది" అంటారు. విడాకులు తేలిగ్గా లభిస్తాయి. మరొకరిని చేసుకోవచ్చు.

రంపచోడవరం ప్రాంతంలో యిప్పటికీ పెద్దమనిషి అయిన పిల్లను ఊరి చివర పాక వేసి కూర్చుండబెడతారు. పెద్దవాళ్ళెవరూ అటు వెళ్ళరు. చిన్నపిల్లతో భోజనం పంపుతుంటారు.

ఇలాంటి అలవాట్లలోకూడ వారికి నచ్చచెప్పడంద్వారా ఎంతో మార్పును తేవచ్చును.

## తగాదాలు

పెండ్లి, భూమిలాటి అన్ని విషయాలలో వచ్చే తగవుల్ని కుల పంచాయతీ పరిష్కరిస్తుంది. ఒక సందర్భంలో కొన్ని గ్రామాలకు ఒకే కుల పంచాయతీ ఉంటుంది. లోగడ నిజాయితీపరులైన గిరిజనులలో

దొంగతనాలూ, మోసాలు ఉండేవికావు. ఇప్పుడిప్పుడు అవీ కనబడుతున్నాయి.

### నృత్యసంగీతాలు

ఎలాంటి శిక్షణలేకుండా సహజంగా వచ్చిన నృత్యం, సంగీతాలు గిరిజనులలోని ప్రత్యేకత. అవి ఒకచోట ఆధునికనృత్య సంగీతాల్ని తలదన్నేటట్లుంటాయి. వీటిని నవీనపద్ధతులలో అభివృద్ధిపరచి, మెరుగులు దిద్దడానికి ఒకకళాశాలను నెలకొల్పవచ్చును.

### చేతివృత్తులు

అలాగే చేతివృత్తులలోకూడా వారు ప్రవీణులు. లంబాడీలదుస్తుల్ని చేయడంలో ఉన్న పనితనం మరే యితర చేతివృత్తులకైనా వినియోగించుకోవచ్చును. బుట్టలు, విస్తరాకులులాటి అందరికీ ఉపయోగపడే వస్తువుల్ని వారు అల్లేటట్లు ప్రోత్సహించవచ్చు. ఇలాంటి ఉపవృత్తులవలన వారి వారి ఆర్థిక పరిస్థితి బాగుపడుతుంది.

### వైద్య విజ్ఞానం

అలాగే వారి వైద్య విజ్ఞానాన్ని మెరుగులు దిద్ది అభివృద్ధి చేయవచ్చు. గిరిజనులకు కొందరికి వనమూలికల విషయంలో అపారమైన ప్రజ్ఞ ఉంది. వారు కన్నులాంటి సున్నిత అవయవాలకు ఉపయోగించే పసరులు చాలా బాగా పనిచేస్తాయి. ఎన్నడూ ఆ మందులవలన అపకారం జరిగిన సంఘటనలు కనిపించవు.

అందువలన యీ విజ్ఞానాన్ని మరింత విస్తృత పరచవచ్చు. శ్రీశైలం ప్రాంతంలో ఆయుర్వేదం కొరకు నెలకొల్ప సంకల్పించిన మూలికావనం లాంటివి ఏజన్సీ ప్రాంతాలలో నెలకొల్పవచ్చు.

### వ్యవసాయం

సామాన్యంగా గిరిజన గ్రామాలు గోదావరి నదిలాటి ప్రవాహాలకు దగ్గరగా ఉంటున్నా సేద్యం వర్షాధారంపై జరుగుతుంది. ఇప్పటికీ ఏజన్సీప్రాంతాలలోని భూముల్ని సర్వేచేయలేదు. ముప్పయి నలభై ఏండ్లుగా సేద్యంచేస్తున్న గిరిజనులకు సహితం యిప్పటివరకూ పట్టాలివ్వలేదు.

ఇప్పుడు జరిగే పోడు వ్యవసాయంవలన ఎక్కువలాభంలేదు. ఎడ్లు, నాగళ్ళు వుండవు గనుక సుళువుగానే కనిపిస్తుంది. కొలనైజర్లు ఉన్నచోట ఎడ్లు యిచ్చినా నీరులేదు. అందువలన కొండవాలుగా ఉన్నచోట కత్తితో త్రవ్వి మొక్కలు వేస్తారు. ఇది ఎంతవరకు ఉపయోగం? గోదావరి ప్రక్కనున్న గిరిజన గ్రామాలకు పంపింగ్‌ద్వారా నీటిని సరఫరా చేయాలి. విద్యుచ్ఛక్తిని విస్తృతంచేయాలి. ట్రాక్టర్లు, బుల్‌డోజర్లు ప్రవేశపెడితే ఆ భూములలో ఎక్కువపంట పండుతుంది.

### రహదారులు

రహదారులు, వంతెనలు లేక గిరిజన ప్రాంతాలలో ఎంతో యిబ్బందిగా ఉంది. కొండవాగులకు విరివిగా వంతెనలు నిర్మించాలి. రాజమండ్రి—మారేడిమిల్లి రోడ్డుపని అత్యవసర పరిస్థితి వలన నిలిచిపోయింది.

ప్రభుత్వం గతసంవత్సరం హైదరాబాదులో గిరిజన సాంస్కృతిక పరిశోధనా శిక్షణ సంస్థను నెలకొల్పింది. ఆ సంస్థ సలహామండలిలో నేనూ సభ్యురాలినే. ఆ సంస్థ యిటీవల నిర్వహించిన మూడు రోజుల గోష్ఠిలో గిరిజనాభ్యుదయానికి అనేక సూచనలు చేయబడినాయి.

అయితే గిరిజన భాషలను ఉపాధ్యాయులు నేర్చుకొని పిల్లలకు చదువు చెప్పాలనే సూచన ప్రయోగాత్మకమైనది కాదు. దానివలన గిరిజనులకు కలిగే ప్రయోజనమూ ఉండదు. వారంతా తెలుగు నేర్చుకొనేటట్లే ప్రోత్సహించాలి. ★

---

(18 వ పేజీ తరువాయి)

ఎందుబోయిరో యేమొ యేనెరుగ నన, నె
గాదిగ వాని గమనించి, తిలకించి గదితలుపు,
వ్రేలాడు తాళమ్ము వీక్షించి, గద్దించి,
గదితలుపు తెరువుమనగా, నతడు వినకున్న,
ముక్కడులు బిగమ్ము వ్రక్కలింపఁదొడంగ,
సద్దమ్ముగా నంత హంపన్న నిలువఁబడి,
రాపాడి త్రోపాడి యా పాపజాతితో
కడగి పోరాడ, రక్కసులు కక్కసపెట్టి,
పీడించుచుండఁ, బదతాడనంబునఁదల్బు
నూడదన్నగనొకడు వీ డడ్డపడుచుండ,
లోనున్న భీతైణలోచనలు కుయివెట్ట,
కైవట్టి యీడ్వఁబో కామాతురులు వారు,
కామమ్ము గ్రోధమై కడగి వారించు హం-
పన్నపై పగ గొని తుపాకీలతో గ్రుమ్మి
పొడుచుచుండగ సత్తు వుడివోవుదాక హం
పన్న,అంగాంగములు కొన్నెత్తు రొలుకంగ
పంతమున పోరి యాపన్నుడై కను మూసె.

భుగభుగ మని నిప్పులు గ్రక్కెడి పొగ
లెగయించుచు నట కేతెంచెడి నొక
బండిని గని యా దుండగు లెచటికొ
పరువెత్తిరి హంపన్న కళేబర
మవనిపైన కన్నార్పక యుండగ.

ఆర్తరక్షణపరుం డల్లదిగొ గుత్తిస
త్రము దాపులో రోడ్డుప్రక్కన సమాధిలో
మూగభాషణతోడ భోధించుచున్నాడు –
“స్త్రీరక్షణము, మాతృ భూరక్షణము మించి
పున్నెములేదుపో పురుషులకుఁ బుడమి”యని
ఎన్నగాఁ దరమె! హంపన్న ధన్యులమిన్న.

# ఆంధ్రప్రదేశ్ సంక్షేమ నిధి
## రాఫిళ్ల నిర్వహణ

ఆంధ్రప్రదేశ్ సంక్షేమనిధి ఒక సాంఘిక సంక్షేమ సంఘం. దీని కార్యస్థానం హైద్రాబాదు. సాంఘిక సంక్షేమ పథకాల అమలుకు కావలసిన నిధిని సమకూర్చడమే యీ సంఘం లక్ష్యం. గవర్నరు దీని ముఖ్య పోషకులుగా ఉన్నారు.

ఈ సంక్షేమనిధి, వార్షిక రాఫిల్స్‌ను నిర్వహించడానికి ప్రభుత్వం అధికారం యిచ్చింది. రాఫిల్ టిక్కెట్లను స్వచ్ఛందంగా విక్రయించడంద్వారా యితర అన్ని సంక్షేమ సంస్థలు రాఫిల్ నిర్వహణలో పాల్గొనవచ్చు. యీ సంక్షేమనిధికిగల లక్ష్యాలతో పనిచేసే సంక్షేమ సంస్థలు యీ అమ్మకంలో పాల్గొనవచ్చు. విక్రయంద్వారా లభించిన ఆదాయంలో కొంతభాగాన్ని పొందే ఒప్పందంపై యీ టిక్కెట్ల విక్రయం జరుగుతుంది. యీ రాఫిళ్ళ ఉద్దేశం బహుళార్థ సాధకమైంది. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోని సంక్షేమ కార్యక్రమాలకు - గ్రామం మొదలు పట్టణం, గ్రంథాలయం మొదలు ఆసుపత్రికి - అన్ని పథకాలకు వీటివల్ల లభించే మొత్తాలను వినియోగించవచ్చు.

1961 వ సం॥లో ప్రారంభించిన మొదటి రాఫిల్ 1961 మే 28 తేదీన ముగిసింది. దీని రాబడి లక్ష్యం రు. 6.00 కోట్లు. రు. 4,15,300/- ల విలువచేసే టిక్కెట్ల విక్రయం జరిగింది. 1962 వ సం॥ రెండవ రాఫిల్ 1962 సెప్టెంబరు 2 వ తేదీన ముగిసింది. దీని రాబడి లక్ష్యం రు. 8.00 లక్షలు. రు. 3,63,800/- ల విలువచేసే టిక్కెట్లను విక్రయించారు. 1963 వ సం॥ మూడవ రాఫిల్ 1963 నవంబరు 3 వ తేదీన ముగిసింది. దీని రాబడి లక్ష్యం రు. 8.00 లక్షలు. రు. 3,92,465/- ల విలువ గల టిక్కెట్లను విక్రయించారు.

రాష్ట్రంలోని అన్ని జిల్లా కమిటీలు, కొన్ని సాంఘిక సంక్షేమ సంస్థలు టిక్కెట్లను విక్రయించడంద్వారా యీ మూడు రాఫిళ్ళ నిర్వహణలో పాల్గొన్నాయి.

జిల్లా సంక్షేమనిధి కమిటీలకు మొత్తం రు. 3,24000/- లను ఆంధ్రప్రదేశ్ సంక్షేమ నిధి రాఫిల్ కమిటీ విరాళంగా ఇచ్చింది. మొదటి, రెండవ రాఫిళ్ళలో మాత్రమే పాల్గొన్న సంక్షేమ సంస్థలకు రు. 68,400/- ఇచ్చింది.

జిల్లా సంక్షేమ నిధి కమిటీలు తమకు లభించిన మొత్తాలను దిగువ తెల్పిన రీతిగా వినియోగించాయి :

(i) కృష్ణాజిల్లా కమిటీ, రు. 50,000/- ల ఖర్చుతో స్వంతభవనాన్ని నిర్మించింది. (ii) నిజామాబాదు జిల్లాకమిటీ, షార్ట్‌వేవ్ థిరాపీ కొనుగోలుకై స్థానిక ఆసుపత్రికి తగినంత మొత్తాన్ని విరాళంగా ఇచ్చింది. (iii) కర్నూలు జిల్లాకమిటీ, కర్నూలులో ఒక బహిరంగ రంగస్థలిని నిర్మించాలని ప్రతిపాదించింది. (iv) శ్రీకాకుళం జిల్లా కమిటీ వద్దలో రు. 30,000/- ఉన్నాయి. శ్రీకాకుళంలో ఒక స్టేడియం, ఓపెన్ ఏర్ థియేటరును నిర్మించాలనే ప్రతిపాదన ఉంది. (v) విశాఖపట్నం జిల్లా కమిటీ వద్దలో రు. 35,000/- లు ఉన్నాయి. తగిన భవనాన్ని నిర్మించాలనే ప్రతిపాదన ఆలోచనలో ఉంది.

ఆంధ్రప్రదేశ్ సంక్షేమ నిధి మొత్తాలు లభించిన ఇతర జిల్లాకమిటీలు, రాఫిల్ నిర్వహణలో పాల్గొన్న స్థానిక సంక్షేమ సంస్థలకు తమవంతు విరాళాలు ఇచ్చాయి.

విజయవాడ మునిసిపాలిటీకి, రు. 11,000/- లు, భారత రెడ్‌క్రాసు సంస్థకు రు. 8,290/- లు, ప్రొద్దుటూరు పాలిటెక్నిక్ కమిటీకి రు. 6,640/- లు విరాళంగా ఇచ్చారు. 1962 లో జరిగిన రెండవ రాఫిల్ నిర్వహణలో పాల్గొన్న కారణంగా వీటికి యీ మొత్తాలు ఇవ్వడం జరిగింది. ★

---

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1964 జనవరిలో యీ దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించబడింది.

మరియల్ (నల్గొండజిల్లా); హవిజ్‌పేట, (హైదరాబాద్‌జిల్లా); చిప్పకుర్తి; అంబాల (కరీంనగర్‌జిల్లా); తొర్రూరు (వరంగల్‌జిల్లా); మెట్లకుంట (మెదక్‌జిల్లా); నిదుగుర్తి, ఉత్కూరు, దెంతమూరు (మహబూబ్‌నగర్‌జిల్లా); దుబక్, సిరికొండ, కొండూరు, ముత్తకూరు, నేనూడి, చిన్నవల్గోడి, పెద్దవల్గోడి, పొత్నూరు (నిజామాబాదుజిల్లా); చిన్నతుంబలం (కర్నూలు జిల్లా).

# పాశవిక కృత్యము

జగర్లపూడి కృష్ణమూర్తి

పశుబలమున చైనీయా!
వశము న్గావించుకొనఁగ వచ్చితె! అస్మ
ద్వశమైన భరతభూమికి,
పశుబలి యొనరింత్రు లేర! భారతవీరుల్.

"నీఫా" ప్రాంతము లాక్రమించి తనుటం
  తేగాని, వైదేశికుల్
లోభర్లంచును, వాకొనంగలుగదే,
  రోషంబు మీజాతికిన్
మ్యాపుల్ దిద్దియు బ్రహ్మపుత్రవఱకున్,
  మాదన్న దుష్టాత్ములన్
రూపుమాపగలారు, మా భరత వీ
  రుల్, శౌర్యపుంభావులై.

గౌతమధర్మసూత్రముల
  గంగనుఁ గల్పు కిరాతులార! మీ
చేతము లెట్లు పాల్పడియె,
  శీతనగంబు, సగంబు మాదనన్
చేతులుమోడ్చి, "మెక్ మొహాను"
  సీమను దాట సుఖంబుగల్గు, మీ
జాతక మెట్టులున్నదొ, వి
  చారణ జేయుఁడు "చౌ" కబంధునిన్.

"చైనా భారతి భాయిభాయి" అని మీ
  "చౌఎన్ లై" భాషించి, మా
పైన న్మార్కొని, మ్రింగజూచెగద "నీ
  ఫా" ప్రాంతభూభాగమున్
ఔనా! ఇట్టి కిరాతకృత్యమును చే
  యన్, గోముఖవ్యాఘ్రమై
ఐనన్మందుకురండు గండుమగలై
  నన్నీలుగావింపమా!

ఈతఁడేనా! పుణ్యశీతలాచలము పై
  కాలుమోపిన యట్టి ఘాతకుండు!
ఈతఁడేనా! "లడక్" భూతియెల్ల హరించి,
  శాసింపనెంచు నిశాచరుండు!
ఈతఁడేనా! నిత్య పూతయౌ భారతీ
  సతి లాగఁజూచు దుశ్శాసనుండు!
ఈతడేనా! జాతి నీతి యన్నది లేక
  పరభూమిఁ గబళించు పాంసులుండు!
ఈతడేనేమి? భారతజాతి పటిమ
గాంచి వెనుకంజ వేయు సృగాలమూర్తి
ఈతఁడా! చైనజాతికి నేత యయ్యు
మానవాళిన సల్పెడి "మ్యావు" ఘనుఁడు."

లేరా! భారత వీరా!
శూరాగ్రేసరుఁడ వయ్యు చూచెదవేలా!
పోరాడి మన విపతుల
మారణమొనరించి లోకమాన్యుఁడ వగుమా!

పరరాజన్యులు వీరమన్యులగు నా
  పాపిష్ఠి చైనీయులున్
భరతక్ష్మాతలమున్, సుధాభరితమున్,
  స్వాతంత్ర్య లక్ష్మీప్రదన్
సరిహద్దుల్ కబళింప జూతురట నే,
  సైన్యాయుధోపేతులై
త్వరగా బోవలె లెమ్ము, మ్రోగెడవి ప్ర
  స్థానంపు భేరీధ్వనుల్

సరివారి న్నగుబాటురా! ఇటుల వి
  శ్వాసంబు పోద్రోచి, మా
త్సరమన్ శత్రుపదాల నుంపఁ దమకిం
  తే బిడ్డవై యుండియున్
దొరవోలె న్నిదురింపగాదగునె, నీ
  దోస్సారము న్జూప, ముం
దరుగన్ లెమ్మిక దుష్టచైనులతో బా
  హాబాహి పోరాడగన్.



# తెలుగు సాహిత్యములో దేశభక్తి కవిత్వము

"మహతీశంకర్"

సాహిత్య మొక నిరంతర స్రవంతి. అది నిత్యనూతనమైనది – నవనవోన్మేష మైనది. దేశకాల పరిస్థితులను బట్టి సాహిత్యముయొక్క స్వరూపము మారు చుండును. భారత భాగవత రామాయణములు ఇతిహాసములు. అవి తెనుఁగున పురాణ కావ్యములుగా వెలిసినవి. వాని పరమ ప్రయోజనము ధర్మోపదేశము, నీత్యుప దేశము. అష్టదిగ్గజ కవుల కావ్యములు ప్రబంధములు. ఆనాటి కావ్యములు అష్టాదశ వర్ణనములతో – శృంగారాత్మకములై యుండెడివి. దక్షిణాంధ్రయుగ సాహిత్యము యక్షగానములకు, పచ్చి శృంగారమునకు ఆకరమైనదనుటకు ఆనాటి కావ్యములే ప్రత్యక్ష ప్రమాణములు. ఆధునిక సాహిత్యము జాతీయ భావములకు, దేశభక్తికి నిల యము. భావకవిత్వము, విప్లవ దృక్పథము నవ్యసాహిత్య లక్షణములు.

ఆధునిక సాహిత్యమునదేశ భక్తి కవిత్వము ఒక విలక్షణమై నది. కర్తవ్యమును గుర్తించిన మహాకవులు ప్రజల మనస్తత్వమునకు తగినట్లుగా కావ్య ములు నిర్మింతురు. నవ్యసాహిత్యమున జాతీ యకవిత దేశభక్తి వెల్లివిరియుటకు ముఖ్య కారణము ఆంధ్రోద్యమము. దాదాపుగా రెండు శతాబ్దములకాలము ఆంగ్ల ప్రభువుల పరిపాల నలో క్రుంగిపోయిన భారతీయులకు స్వేచ్ఛా స్వాతంత్ర్యములను సంపాదించుకొనుటకు ఒక మహోద్ధత విప్లవశక్తి అవసరమైనది. సంఘములో ఆసత్వర స్వేచ్ఛాపిపాస విజృంభించినది. తెలుగునాట నాడినాడిలోను ఆంధ్రాభిమానము ఉవ్వెత్తున పొంగి పొరలి నది. ఆంధ్రులలోని పరస్పర ద్వేష భావములు స్వవినాశమునకు హేతువు కాగలవని గుర్తించిన మహాకవులు విప్లవ శంఖమును పూరించి నిద్రించుచున్న ఆంధ్ర జాతికి మేలుకొలుపు గీతమును గానమొన రించినారు. ఆ కవిపుంగవుల కమనీయ లేఖినీ మహత్వమే నేటి దేశభక్తి కవిత్వము. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అను సూక్తి వారిపట్ల అక్షరసత్యమైనది.

2

కవి విశ్వవైతాళికుడు. కవిత్వము జీవిత విమర్శనము. కవి భూతకాల విషయజ్ఞాపన మొనరించును, వానిని వర్తమాన పరిస్థితు లతో సమన్వయము చేయును. తన్మూల మున భవిష్యత్ మార్గమును నిరూపించును. కవి క్రాంతదర్శి.

నవ్యసాహిత్యమును అవలోకించినచో కవులు తమ జాతీయాభిమానమును దేశ భక్తిని వివిధ రీతులలో వ్యక్తపరచినట్లు బోధపడును. కొందరు పూర్వాంధ్రరాజుల పవిత్ర చరిత్రలను అభివర్ణించి, వారి శౌర్య ప్రతాపములు భావితరమువారికి మార్గదర్శ కములని ప్రబోధించిరి. మరికొందరు కాల ఝుంఝుకు నిలువలేక, కళావిహీనములై, పాడుపడియున్న క్షేత్ర ప్రాభవమును నుతిం చిరి. ఇంక కొందరు చరిత్రను కేవలము సాంఘిక చరిత్రగా కాక భావనా బలముతో 'సరూపకముగ' ప్రాచీన వైభవమును స్ఫురింపజేసిరి. తదితరులు ఆంధ్రులలోని అనైక్యమును ఈర్ష్యాద్వేషములను కన్ను లకు కట్టినట్లు వర్ణించి, విప్లవ భావములను రేకెత్తింపఁజేసిరి. కొందరు వీరందరునైరి.

అంతేకాక పద్యములో ప్రతిశబ్దము భావ మును సూటిగా, గుండెకు తగులునట్లుగా శక్తివంతముగా ఉపయోగింపగల ప్రతిభ జాతీయ కవుల సొత్తు.

3

దేశభక్తి కవిత్వమునకు నాందీగీతము పాడినది మహాకవి గురుజాడ. ప్రాచీన ఛందో బంధాలను త్రెంపి భాషయందును, జాతీయాభిమానమును పురికొల్పి భావము నందును నూతనత్వమునునిరూపించిన యుగ ప్రవక్త గురుజాడ. కవితాసృష్టిని గురించి ఆయన భావన వేరు. ఆయనపాడిన ప్రతిపాట లోను దేశభక్తి మూర్తీభవించి యుండును–

"ఆకులందున అణగి మణగి
కవిత కోకిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశ మం
దభిమానములు మొలకెత్తవలె
నోయ్–"

"కవి(త) కోకిల పలికే పలు కులువిని దేశంలో అభిమానములు మొల కెత్తాలి"– ఇది ఆయన కవితాధ్యేయము – ఇది ఆయన తపస్సు.

గురుజాడ కవీంద్రుని "ముత్యాల సరాలు" నవ్యాంధ్ర కవితా సరస్వతికి సరిక్రొత్త ముత్యాలసరాలు. ఆయన "దేశభక్తి" గేయము ప్రతి ఆంధ్రునికి ధ్యేయము.

"దేశమును ప్రేమించుమన్నా
మంచిఅన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్"–

అని తెలుగు సోదరులకు కర్తవ్య ధర్మమును ప్రబోధించిన మహాకవి గురుజాడ. ఆయన

కోరినది మతైక్యము. భావైక్యము. ఆయన దృష్టి సర్వజనతాపుష్టి. అదే అన్నారు ఈ క్రిందిగేయములో —

"చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడవ వలెనోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతములు మెలగవలెనోయ్."

గురుజాడ మహాకవివలెనే ఉద్విగ్న ఆవేశముతో ఆంధ్రుల ప్రతిభా ప్రాభవాలను కీర్తించిన మహాకవులు శ్రీ రాయప్రోలు సుబ్బారావు - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ - శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి. కావ్యములు "ఆంధ్రావళి" — "ఆంధ్ర ప్రశస్తి" — "రాష్ట్రగానము".

## 4

శ్రీ రాయప్రోలు సుబ్బారావు ఆంధ్రా న్నత్యమును అపూర్వ కవితాదృష్టితో దర్శించి, ఆంధ్రుల కొసగిన భవ్యకావ్యము "ఆంధ్రావళి". ఆయన అభివర్ణించిన ఆంధ్రుల మహత్కార్యములు దేశీయుల హృదయములను కలచివేసినవి. "భక్తితో, బాధతో, ఆందోళనతో కారుతూవున్న తన కన్నీటి జాలు వెలుగులో పూర్వపు టాంధ్రా న్నత్యమునూ, భావిశోభను దర్శింపించ గలిగిన ప్రథమ జాతీయకవి శ్రీ రాయప్రోలు సుబ్బారావు." [వైతాళికులు]

"ఆంధ్రోద్యమము ఆయన కవితకు రంగస్థానమైనది. రాయప్రోలు జాతీయకవితా వాహిని పొంగిపొరలినది. "జారిన దేశ గౌరవము చక్కగదిద్ది, మహాంధ్ర మండలీ భారము శ్లాఘనీయముగఁ బాలనజేసి సమాన రాష్ట్రిముల్, కూరిమి నానఁజేయఁ దెలుగుం బుడమిన్" సముద్ధరింపుఁడని తెలుగు వారికి మేలుకొలుపు పాడిన రాయప్రోలు జాతీయ కవులలో మొదటివాడు." [ఆంధ్ర రచయితలు]

"ప్రబోధము" — ఆయన హృదయము ధరించిన విరాట్ స్వరూపము. "అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయము స్థాపించునాడు", "తనగీతి అరవజాతిని గాయకులనుగా దిద్దితీర్చిన తెలుగువాణి", "కృష్ణా తరంగ పంక్తిన్ త్రొక్కి త్రుళ్ళింత నాంధ్రనౌకలు నాట్యమాడునాడు" — అను పద్యములు నాడేగాక నేడును జాతీయ సభ లందు ప్రార్థన గీతలుగానో, ప్రసక్తాను ప్రసక్తంగానో వినని ఆంధ్రు డుండడు.

"అతి చిరంతనా విచ్ఛిన్న మయిన ఆంధ్ర
జాతిభూత చరిత్రను సంస్మరించి —
తద్భవిష్య దభ్యుదయ సంధానమెంచి
కలుపవమ్మ! ఏకముగా, ఉగాదితల్లీ!"

"గత చరిత్రను చూచి సంతసించు అల్పులు నవ్యులు" అను విమర్శకు సమాధానముగా శ్రీ రాయప్రోలు చరిత్ర అందింపగల దివ్య సందేశమును పై పద్యమున స్పష్టము చేసినారు.

"ఆంధ్రావళి"లో దేశాభిమానము ఉన్నతమైనది. కవి దేశభక్తి ఆంధ్రదేశము నకే పరిమితముకాలేదు. సకలభారతసమైక్య మును కవి అకాంక్షించినాడు. జన్మ భూమిని ప్రేమింపని మానవు డుండడు. భారతమాత కనకగర్భ, భారతఖండము స్వర్గఖండము, భారతభూమిలో రతనాలు మొలిచినవి, భారత సముద్రములో ముత్యాలుపండినవి, ఈ పుణ్యభూమిలో జన్మించుటయే ఒకయోగ ఫలము. జాతిగౌరవము నిల్పుట ప్రతి భార తీయుని విధి —

"ఏదేశ మేగినా, ఎందు కాలిడిన
ఏ పీఠ మెక్కినా, ఎవ్వ రేమనిన
పొగడరా నీ తల్లి భూమిభారతిని
నిలుపరా నీజాతి నిండుగౌరవము"

* * *

"శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలు పాఱిన భాగ్యసీమయి
వ్రాలినది ఈ భరతఖండము
భక్తి పాడర తమ్ముడా!" —

ఇటువంటి దేశభక్తి ప్రబోధ గీతాలు కవి భారతీయతకు ఉజ్జ్వలమైన ఉదాహరణలు. 'ఆంధ్రావళి'లో సంకుచిత జాతీయాభి మానము గోచరింపదు. "ముందు మనము భారతీయులము — అనంతరము ఆంధ్రు లము" — అను విశాల తత్త్వమును 'ఆంధ్రా వళి'లో కవి స్పష్టీకరించినాడు.

ఈ కావ్యములోని దేశభక్తి గుండెలు చీల్చుకొని వెలికివచ్చిన అమృతవాహిని. అఖండ గోదావరిలో పారు చాళుక్య నాగరికతను, పాడుపడిన కోటగోడలలో నిద్రించు కాకతీయ ప్రాభవమును, పల్లె పదాలలో జీవము నిల్పుకొనిన పల్నాటి వీరుల రక్తనాళ పటిమను ఆంధ్రసోదరుల కెరిగింపుమని పుస్తకతపస్విని కవి వేడు కొనును — అంతేకాదు — "నాజనము — నాదు దేశమనంగజాలు, ఇంత జ్ఞానభిక్షీదాన మిమ్ముతల్లీ" అని ఆ తల్లిని ప్రార్థించును.

'తెనుగుతల్లి' అను ఖండకావ్యమున పూర్వాంధ్ర వైభవమును వర్ణించి, ఆ ఆంధ్ర యశస్సును అజరామర మొనర్పుడని తెనుగు సోదరులకు చేసిన ప్రబోధము కడు రమ్యము —

"శ్రీకాకుళస్వామి సిగపై సువాసించె
తెల్లని ఆంధ్రుల మల్లెపూలు
ఒడ్డెరాజుల జీవగడ్డ గ్రక్కదలంగ,
కోరాడె మత్తాంధ్ర కుంజరములు
చీకటి మన్నెముల్ ఛేదించి నవధాన్య
ముల నెత్తె ఆంధ్రుల పోపుటెద్దు
చిలుకసరస్సులో స్వంగార నౌకల,
నడిపె ఆంధ్రుల యింటి పడుచుజతలు
ఉత్కలాళానితంబమ్ము లొత్తి హత్తె,

ఆంధ్రుల యశో దుకూల సితాంచలములు
తమ్ముడా? మాయ నిత్తువె తల్లివన్నె
చెల్లెలా! చిన్నబుత్తువె తల్లిచిన్నె?"—

ఆంధ్రుల కీర్తియనిడి 'తెల్లని' మల్లెపూలు శ్రీకాకుళస్వామి సిగపై సువాసించె— ననుట అపూర్వము? పుట్టుకచేత ఆంధ్రుడైనను శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు రవీంద్రుని పాదసన్నిధిన జాతీయవిద్య నభ్యసించిన భారతవిద్యార్థి—అందువలననే శ్రీ శివశంకర శాస్త్రి, ఆచార్య రాధాకృష్ణులతో పాటు సరోజినీ రవీంద్రులు కూడ ఆయనకు కవితా వస్తువులైనారు. అంతేగాక, భారతభూమిలో అహింసాజ్యోతిని వెలిగించిన అమృత మూర్తులు బుద్ధదేవుడు — గాంధీ మహాత్ముల ప్రశంసలు గూడ భారతజాతికి చైతన్య ఉద్దీపములు కాగలవు.

తెలుగునాట వెలుగులు దిద్ది తీర్చిన ఉగాది అభివందనముతో ప్రారంభమై, స్వేచ్ఛాగీతితో సమాప్తమగుటయే 'ఆంధ్రావళి'లోని ఉదాత్త జాతీయతకు ప్రబల నిదర్శనము —

''జన్మహక్కుగ చిక్కి—స్వార్జితంబుల చీలి
రాజ్యసీమల సిరికి — పూజ్యమగు నీ పొలము
పండునో ఎండునో — ఓ సుస్వతంత్రమా...
స్వకుటుంబ కలహాలు — జాతిమత భేదాలు
నీ తలకు చుట్టేరు — నీతిమంతులు నేడు
నిజమో అబద్ధమో—ఓహో స్వతంత్రమా...

* * *

## 5

శ్రీవిశ్వనాధసత్యనారాయణగారు ''ఏ విషయాన్నైనా కవితాదృష్టితో చూడగలకళా శీలి'' అని ప్రస్ఫుటముగా నిరూపించు కావ్యము ''ఆంధ్రప్రశస్తి''. 'శ్రీరాయప్రోలు సుబ్బారావుగారి లాగా ఆంధ్రాభిమానమూ, ఆంధ్రతేజమూ ఈయననూ పూరించినది.' ఒకనాడు 'ఆంధ్ర ప్రశస్తి' తెలుగు కంఠాలలో మారు మ్రోగింది. అందులోని పద్యాలు నేటికిని పఠనపాఠన వ్యాసంగాలలో తెలుగుదేశములో దృశ్యమానములు. "జాతీయకవితాశాఖ నధిష్ఠించి కూసిన కల కంఠములలో విశ్వనాధకవి తొలివాడో మలివాడో!'' [ఆంధ్ర రచయితలు]

ఆంధ్ర చరిత్ర నిర్మాణ దీక్షాదక్షులైన మహామనీషి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారికి ఈ కావ్యము అంకితము చేయుటలోనే కవి అచ్చమైన ఆంధ్రత్వాన్ని పుణికి పుచ్చు కొన్నట్లయినది.

కావ్యారంభంలోనే ''పూర్వాంధ్ర ధరాధి నాయక కథా మంజూషికా రత్నగాథా పద్యావలి...ఆంధ్రసోదరుల కందిత్తు''నని కవి తన ఆశయమును వెల్లడించినాడు.

''ఆంధ్ర ప్రశస్తి''లో చరిత్ర ప్రసిద్ధులైన ఆంధ్ర చక్రవర్తుల వీరకథావళి మహోత్తమముగా శ్రీ విశ్వనాధవారు చిత్రించినారు. శ్రీకాకుళము రాజధానిగా త్రిలింగ రాజ్యములు పరిపాలించిన మహా చక్రవర్తి ''ఆంధ్రవిష్ణువు'' నిశుంభుడను రాజును పరిమార్చి ఆంధ్రరాజ్యమును సుస్థిరము చేసిన విధాన మిందభివర్ణితము.

ఆంధ్రుల సైన్యము నిశుంభుని చుట్టు ముట్టినది. వనముల నెల్లను బట్టబయలు చేసినది. కొండమార్గములను అరికట్టినది. గుహలను అద్రిభాగములను ఆవరించినది. నిశుంభుని నివాసము చుట్టును మహాగజయూధము లను కాపువెట్టిరి. ఆంధ్రవీరుల జయజయారావములు మిన్నుముట్టినవి. నిశుంభుడు వెలికి వచ్చి ''రోష దష్టాధరుండయి రుద్రు వోలె'' సముద్వత్ క్రోధ తామ్రాక్షుడై తన శూలమును సంబంధించినాడు. అది తెలుగు భూలలనా మనోహరు జేరకమున్నే, ఆంధ్ర నేత దానవునిపై బాణము ప్రయోగించినాడు. ఆంధ్రనాయకుడు 'బాణాగ్రమునందు అగ్ని సంధించెన్' గాబోలు, వైరి సైన్యము సమూలముగ భగ్నమన్నది. శ్రీకాకుళాంధ్ర పురలక్ష్మి యెదురై మందహాసముతో ముద్దు బిడ్డనికి కర్పూర నీరాజన మిచ్చినది — అనాడు...

''రాజరా జాంధ్రవిష్ణుని రాజధాని
కలుషముల కెల్ల పిడుగు శ్రీకాకుళంబు
కన్నులకుఁ గట్టినట్లుగఁ గానబడెదు —
వేదకాలమునాటి ముత్తైదు వట్లు''

ఇందలి మరియొక చారిత్రాత్మక వీరకథ 'శాతవాహనుడు' పుత్ర వియోగము చే దుఃఖించుచున్న ''దీపకర్ణి'' యను రాజునకు కులదేవత సింహాసనాసీనుడై నబాలునిచ్చి, శాతవాహన వంశమును సంరక్షించిన కమనీయ గాథ — అది.

''గౌతమీపుత్ర శాతకర్ణి'' ఆంధ్రరాజులలో అగ్రగణ్యుడు ధనుర్విద్యా విశారదుడు, ప్రజ్ఞావంతుడైన గౌతమీపుత్ర శాతకర్ణి, ఆంధ్ర విజృంభణము నాపిన సహపానుడను రాజు వంశమును నిర్మూలించి, ఆంధ్ర చక్రవర్తిత్వమును మరల నిలిపిన కథా విశేషమును కవికావ్యఖండికగా మలచినాడు.

ఆంధ్ర సైన్యము ముందునకు నడచి పోవుచున్నది. మునుముందు రణభేరికా సకల వాయిద్యములను ఉష్ట్రసమితి మోయు చున్నది. నాట్యకత్తెలు గీతమాధుర్యమును చూపుచున్నారు. ఆపైన సరదారులు బారులు తీరిచి ఘన జవాశ్వములపై నున్నారు. ఆవెనుక ధనుష్పాణులైన తెలుగు వీరులు — వారివెంట తురగపదాతులు — వాని వెనుక గజయూధికా సహస్రములపై ఉక్కు తునకల వంటి ఆంధ్రభటాళి — వారిచెంత చాపాచార్యులు — దుర్భేద్యుడైన ''తెలుగు రాజు'' పృధ్వీచక్ర మల్లాడగా మందగమనముతో ముందునకు సాగిపోవుచున్నాడు. వందిమాగధులు కైవారములు పట్టినారు.

ఇంతలో 'విజలక్ష్మి స్వాగతము' పల్కినట్లు ఆంధ్రవనితలు 'త్రిపుర సంహారకేళి' గాన మొనర్చుచు ఎదురు వచ్చినారు. తెనుగు తనము రూపుదాల్చినది — ఎదురువచ్చిన ఆంధ్ర వనితలు ఇట్లున్నారు —

"కాళ్ళకుఁ బారాణి, కన్నులఁ గాటుక
చెలువొప్పు ముత్తైదువలు మునళ్ళు
పసుపు పూసినమేని, నొసలుపైకడు వెడ
లైన కుంకుమబొట్టు లంద మెసగ
ముడుతలువడికొంచెముగవంగినయొడళ్లు
కనకాంబరముల కాంతి తరుమ
లలిత మంజీర మంజుల నాదములతోడ
పుంజీ భవన్మహా పుణ్యరాసు
లట్లుకదుపుగ 'త్రిపురసంహారకేళి'
పాట పాడుచు నెదురుగా వచ్చినారు
ఆంధ్ర ధారుణీధవుని సైన్యములకెల్ల
విజయక్ష్మి ప్రసాదాంక విధము వోలె.

ఎదురువచ్చిన వీరకాంతలు త్రిపురాసుర సంహారమును పాటగాపాడుచు వచ్చినా రనుటవలన ఆంధ్ర ధణీశ్వరుని భవిష్యత్ విజయం సూచించినట్లయింది.

సౌరాష్ట్ర దేశాధీశుని ఓటమిని కవి ప్రత్యక్షముగా వివరింపడు. మరియొకరీతిగా స్ఫురింపజేయును. యువరాజు పులమాని సహాయముగా వచ్చినాడు మహారాజునకు. ఆంధ్రభటులు...

"గౌతమీసుత శాతకర్ణి యీశాత వా
హనుడు తా నసలు "దావాగ్నికీల"
శ్రీపులమావి వాసిష్టీకుమారకుం
డా యువరాజు "ఝంఝూవిలంబు"
ఇంక నేమయ్యె సుమ్మీ సహపానుడు
సౌరాష్ట్ర మింక "భూస్థాపితంబ"—

అని అనుకొనుచున్నారట! దావాగ్నికీలకు ఝంఝూనిలయము తోడైనచో శత్రు నాశనముతప్ప మరేమి మిగులును. సార్థక పదరచనము శ్రీ విశ్వనాధవారి కవితా శిల్పము.

కేవల వీరగాథలనే కాక ధర్మపాలనకు ప్రసిద్ధిచెందిన "మాధవ వర్మ" కథము నిందు చేర్పబడుట సహృదయులకు పరమ సంతృప్తిని ఇవ్వగలదు. ఇటువంటి వీర చరిత్రములు ఆంధ్రుల పాలిటి పెన్నిధాన ములు. చరిత్రాంశములను హృదయ రంజక మైన కావ్య ఖండములుగా తీర్చిదిద్దుట కవి అద్భుత ప్రజ్ఞ మాత్రమే.

తరువాత "వేగి, ముఖలింగము వంటి క్షేత్రాలు కాలాన్ని దాటి ప్రసరించే ఈయన చూపుకు ఎదురువచ్చి, ఒకనాటి తమశోభతో దర్శనమెచ్చి ఆవేశ పూరితుణ్ణి చేశాయి — ఈయన ఆంధ్రుడు. ఆంధ్రత్వంలో మహా గర్వి." [ వైతాళికులు ]

ఒకనాడు వేగిక్షేత్ర సందర్శనము, "లోకాద్భుత దివ్యదర్శనము" నీయతుల ప్రభావమహనీయిత వేగి పురాధి రాజమా! ఆయతధర్మమూర్తులు మహాత్ములు వారలు, బ్రహ్మకోశ గోపాయిత లాంధ్రపల్లవ నృపా లుర హుంకృతి వ్యాఘ్రగర్జగానై, యరిలోక భీకర మహాద్భుత శౌర్యరసాకృతిం జనెన్' అని పల్లవ రాజ్యశ్రీని కొనియాడి కవి ఆత్మ సంతృప్తి పొందినాడు. అస్మదజ్ఞాత పూర్వ దివ్యత్వ మొప్పు, నీ పునీతావని ఖండ మిచట నిలిచి, యస్వతంత్రిత దొరలు నా యాంధ్ర శక్తి, నన్నుకంపింపజేయుచున్నది భృశమ్ము" — అను పద్యభాగమునందు కవి ఆవేశము స్పష్ట మగును. అవును; ఒకనాడు సకల సౌభాగ్యములతో తులతూగి నేడు సర్వసంపదలు వీడి, కళావిహీనమై, నామమాత్రావశిష్టముగా మిగిలియున్న వేంగి పురమును చూచి, ఏ ఆంధ్రుడు 'హృదయ స్నిగ్ధార్ద్ర సద్భావనాఖిల చైతన్యుడై' ఆంధ్ర పల్లవ నరేంద్ర 'శ్రీయశఃస్తంభము' వలె నిలిచిపోడు! ఇటువంటివే 'ముఖలింగము', 'కొండవీటి పొగలు', అను ఖండకావ్య ములును. "చిరుత పొగమబ్బు లీ కొండ సీమ, బఖకపడి విశీర్ణమై ధూతమై తడిసి, రాచసిరి యుడిగిపోయినట్టి యీ శిథిల దుర్గ లక్ష్మి కొనకూర్చు వెట్టియలంకృతులను" అని కొండవీటి పొగలను గూర్చి కవి చేసిన భావనము ఉత్తమోత్తమము.

'నన్నయభట్టు' అను పేరుగల ఆంధ్ర భారతావతరణ ఘట్టము'ఆంధ్రప్రశస్తి' కొక యలంకారము వంటిది, అది రాజరాజ నరేంద్రుని సభాభవనము. సామంతులతో, సేనాపతులతో, సచివులతో, శాస్త్రవిదులతో తార్కికప్రవరులతో, కవిపండితులతో, రాజమహేంద్రవర పురజనులతో సభాంగ ణము క్రిక్కిరిసి పోయినది. శబ్దశాసనుడు "ఉదయశిఖరి మార్తాండుని" వలె ఆసనము నధిష్ఠించి యున్నాడు. ఇంతలో రాజరాజ నరేంద్రుడు వందిమాగధులు కైవారములు పల్కుచుండగా సభాభవనము ప్రవేశించి 'సకల ఋషిసేవ్యుడగు శచీజానివోలె' చింతామణీ భద్రపీఠి నలంకరించినాడు. రాజ రాజు 'అస్మదీయ వంశమున విమల సద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్ర వినంగ' తన యభీష్టము నెరిగించినాడు. ఆ సకల జన మహిత సాహితీ సభాంగణంలో 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ' యను నాశీః పూర్వకారంభ వాణీ వైదగ్ధ్యమునందు ఆదికవి నన్నయ భట్టారకుని భారత భారతీ తంత్రీ నిస్వనము మ్రోగినది. ఈ మధుర ఘట్టము నవీనసాహితీ సమారంభములకు మార్గదర్శకము కావలెనని కవి ఆశయం.

ఈ రీతిగా ఆంధ్రుల సాంఘిక చరిత్ర విశేషములను, పురాతన క్షేత్రవైభవమును, సాహితీసభా వైశిష్ట్యమును పరమోత్కృష్ట ముగా నిరూపించు భవ్యజాతీయ కావ్యము శ్రీ విశ్వనాధవారి "ఆంధ్రప్రశస్తి"

## 6

సరసమైన శయ్య, గంభీరమైనభావన, అమేయమైన ఆవేశము — అనెడి కవితా సాధనములతో ఆంధ్ర హృదయములను ఉజ్జ్వుత లూగించిన మహాకవి శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు. ప్రస్తుత కావ్యము ''రాష్ట్రగానము'' — ఈయన ప్రాణములో హృదయములో మనస్సులో శరీరములో ఆంధ్రుడు. ఈ ఆంధ్రత్వమును భిన్నవర్ణములు చెఱుపలేవు, భిన్నవృత్తులు చెఱుపలేవు, భిన్న ప్రకృతులు చెఱుపలేవు" శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు నూటికి నూరుపాళ్ళు తెలుగువారి కవి.'

"తెలుగు దేశము, తెలుగుభాష, తెలుగు చరిత్ర, తెలుగుప్రజ, తెలుగుసంస్కృతి అనినంతనే నా యొడలు పులకరించును. ఇవి నాకు ప్రాణకల్ప విషయములు. నేను తెలుగు వాడ నను' నహంకారము నాకెక్కువ, ఈ అహంకారమే నన్ను కవిని చేసినది. ఇట్టి నా జాతియు, నా భాషయు పరతంత్రములై పరకీయ సంస్కారము నాశ్రయించి ప్రాచీన గౌరవమును కోల్పోయినది కదా! ఇది నా మనస్సులో అనుక్షణముగా రేగునట్టి యారాటము. ఈ యారాటమునకు నా జీవుడు కదలినాడు. ఆ కదలికయే ''రాష్ట్రగానము'' అను కవి వాక్యములు ఆయన నిర్మలమైన ఆంధ్రహృదయమును వ్యక్తము చేయును.

సువిశాల భారత జాతీయదృష్టి శ్రీ రాయప్రోలు వారిది; ఆంధ్ర చరిత్రావలోకన దృష్టి శ్రీ విశ్వనాథ వారిది; కేవలము రాష్ట్రగానము శ్రీ సీతారామమూర్తిగారి దృష్టి. ఈ విధముగా ఈ జాతీయ కవిత్రయము యొక్క కావ్యములలో వ్యక్తములగు దృష్టులు వేరైనను కావ్యముల ప్రయోజనము మాత్రము ఒక్కటియే. అది "ఆంధ్రజాతి అభ్యుదయం."

'రాష్ట్రగానము'న సంకుచిత మగు భావ సమన్వయమే కలదనియు, ఆంధ్రేతర జాతి దూషణ మున్నదనియు లోకమున నొక భ్రాంతి గలదు. అది కేవలము 'భ్రాంతి' యనియే నా విశ్వాసము.

శ్రీ సీతారామమూర్తిగారు వేషము నందును, భాషయందును ఆంధ్రుడే. 'తెనుగుదన' మను ఖండికయందలి ఈ పద్య మా విషయమును స్పష్టము చేయగలదు —

''మీసములేని మూతి, కవి
మిశ్రమనోహర కావ్య వాఙ్మయా
భ్యాసములేని పల్కు, నవ
పల్లవ కోమల కన్యకా పద
న్యాసములేని గీము, లల
నా మధురాధర సంపుటీ సుధా
గ్రాసములేని మన్గడ జ
గమ్మున రిత్తకు రిత్తసోదరా!" —

* * *

అంతియేగాక పరవిద్యలకును పరజాతి వారికిని దాసులైపోయి, కొంకిరి వేసములను వలచి కోతులుగా మారిన తెలుంగుబిడ్డలకు, ఈ పిచ్చి సన్నాసులకు 'మానవత్వము' నిమ్ము తల్లీ'యని తెనుగు తల్లిని కవి ప్రార్థించును ఈ విధముగా జాత్యభ్యుదయమును జాతి శ్రేయస్సును గోరుకొనుట అసమంజసముకాదుగదా; అవశ్యము అభిలషణీయము.

శ్రీ సీతారామమూర్తిగారికి మాతృభాషపై అనన్యమైన భక్తి తాత్పర్యములు గలవు. మాతృభాషాభక్తి పరభాషాదూషణముగా మారిన దని కొందరు భావించుట అనుచితము. భావదాస్య మనుభవించుచున్న ఆంధ్రులు భాషాదాస్యమును కూడ అనుభవించు దుర్భరావస్థ కవికి క్షమింపరానిదైనది. అందువలననే "ఇద్దరు తెల్గువాండ్రు తమ యింటివి కష్టసుఖాలు చెప్పుకోనద్దిర మాతృభాష తగదా" యని ఆంగ్లభాషా దాసులను కవి ఈసడించినాడు. అవును; తెలుగు దేశములో పుట్టి తెలుగు దేశములో పెరిగి, తెలుగు దేశములో తెలుగువారితో జీవించుచు, ఇంటి కష్టపరిస్థితులు కూడా చెప్పుకొనుటకు తెలుగు మాటాడ నోచని అల్పులను ఈసడించిన కవి అభినందనీయుడు — అభివందనీయుడు కూడ. ఇందు పరభాషా దూషణ మను ప్రశ్నయే కనిపింపదు.

'ఆంధ్రులలోని కులతత్వములు శ్రీ చౌదరి గారికి గిట్టవు. నియోగులు వైదికులు — కమ్మవారు కాపులు — ఇంక లక్షభేదములు. ఈ భేదములును, వీనిని పురస్కరించుకొనిన దురభిమానమును ఈ కవి యూహలో 'వెధవ' గుణము.

''వైదికులన్నచో మొగము
వాడ్చు నొకండు, నియోగ భోగముల్
ఛేదము గూర్చు నొక్కనికి,
గిట్టదు గిట్టదు కమ్మవారి భా
గ్యోదయ మన్న గొందఱకు.
నోర్వడు రెడ్ల యశం బొకండు స
మ్మోదము నీదు కాపుల స
మున్నతి యొక్కనికేమి పాపమో!"
మాయురే! మూయగారాని మచ్చయగుచు
వెన్ను దన్నుచునుండె! నీవెధవ గుణము
చుట్టుప్రక్కల దేశాల సోదరులకు
లేతయై పోయె మన తెల్గుజాతి బ్రతుకు —

సంఘమునందేగాక సాహిత్యమునందును జొరబడి తెలుగుజాతిని సర్వభ్రష్టమొనర్చుచున్న ఈ నీచమైన కులమత ద్వేషములు సమూలముగ నాశనము కావలసిన అవసరము నేటికిని ఉన్న దనుట స్పష్టము. ఇంత మాటను సాహసించి వాడిన ఆ మహామనీషి 'ఆదర్శబుద్ధి' — 'అమృత హృదయుడు!'

చరిత్ర దివ్య సందేశ మొసగగల దను సత్యమును గుర్తించిన శ్రీ చౌదరిగారు 'ప్రశస్తి' అను కావ్యఖండములో తెలుగు వారి ప్రాచీన వైభవమును వేనోళ్ళ నుతించినారు.

"ఆంధ్రరాజ్య స్థాపనాచార్యుడై తెల్గు,
వేలుపైనాడాంధ్ర విష్ణువిభుడు
రణకళానిధి సుశర్మను జంపి మగధోర్వి
శాసించె శ్రీముఖ చక్రవర్తి
ఔత్తరాహుల నెల్ల నదలించె హాలుండు,
శాలివాహన శక స్థాపకుండు
నిజజయస్తంభముల్ నిఖిలదిక్కులఁ బాతె,
గౌతమీపుత్రుండు శాతకర్ణి
క్షత్రపుల గెల్చి మాళవధాత్రి కెల్ల,
నాథుడయ్యెను వాసిష్ఠి నందనుండు
ప్రాతవడినట్టి యాంధ్ర భూపతుల కథలు,
చదువ దొకసారి కండలు కదిలియాడ–"

* * *

అది ఆంధ్రోద్యమము. మదరాసుకై అరవలును, ఆంధ్రులు తగవులాడుకొను దుర్దినములు. అరవలకు గూడ కళారహస్యముల నెరిగించిన తెలుగువారికి, వారుచేయు ద్రోహమును కవి భరియించలేక పోయినాడు. అందువలననే 'చెన్నపురం బహో! తెలుగుసీమకు రాదట, వేంకటేశ్వరుం డన్ని విధంబులన్ తమిళు డట్టె...' అని వారి అనుచిత సంభాషణములను తృణీకరించినాడు. ఏది ఏమైనను 'సైమ నదరిపోవగా తుపాకికి ఎదురుగా నిలిచి త్రొమ్మిచ్చు ఆంధ్రకేసరియు, శాసన ధిక్కార శరమును సంధించిన రంగయ్యనాయ డుండగా ఆంధ్రోద్యమము సముజ్జ్వలము కాగలదనియు, అసలే 'చాలిన జాతి నీ తెలుగుజాతి, సముజ్వల శూరజాతి' యనియు తెలుగు సోదరుల కనులకు వెలుగును ప్రసాదించిన జాతీయకవి శ్రీ సీతారామమూర్తి.

పుట్టుకతోడనే తెలుగుకవి యైన శ్రీ సీతారామమూర్తిగారి 'ఆశీస్సు' తెనుగు జనయిత్రికి నిత్యమైన పచ్చతోరణము –

"ఆ చక్రవాళంబు నాంధ్రజాతీయతా
మధుర సౌరభ్యముల్ మలయుగాత
బిగువెక్కి నేల నాలుగు చెఱంగులయందు
తెలుగు రాచఱికంబు వెలయుగాత
లక్ష్మి సరస్వతీ లలనా నివాసమై
యాంధ్రదేశమ్ము పేరందు గాత
విశ్వమోహన కళా వీధియై త్రైలింగ
శిల్ప విన్యాసంబు చెలగు గాత
రసికలోకమ్మునకు విందు లొసగి పొసగి
దేశకవితాలతాంగి వర్ధిల్లుగాత
తెనుగు జనయిత్రి పచ్చతోరణములతోడ
నిత్యకళ్యాణరాశియై నెగడుగాత!!

* * *

జాతికి జీవముపోయు ఇటువంటి జాతీయ కావ్యములు మానవజాతికి నిత్యకళ్యాణ సాధకములు; మానవతా ప్రబోధకములు. ★

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1964 ఫిబ్రవరి నెలలో ఈ క్రింది గ్రామాలలో, సంస్థలలో కమ్యూనిటీ రేడియోసెట్లు నెలకొల్పడం జరిగింది.

హైద్రాబాద్ జిల్లా : పోచారం, జాపల్, మెడ్‌పల్లి, గుమ్మడెవెల్లి, కొహెడ, గాంధి చెరువు, తుకుగూడ, సదర్‌నగర్, బోధమ్‌పాడు.

మెదక్ జిల్లా : మాచారం, బండు పోరంపల్లి.

నిజామాబాద్ జిల్లా : గాంధీనగర్, హంగర్గ, పెంటకుర్దు, కాస్లబాద్, పురన్ పేట్, బాబాపూర్, అమీనాపూర్ (జానకీ పేట పంచాయతి బోర్డు ప్రధాన కార్యాలయము) మారంపల్లి, నుత్‌పల్లి.

ఆదిలాబాద్ జిల్లా : భోరజ్, గుడిహట్ నూర్, చిత్రకుంట, భట్‌పల్లి, ఖిమిని, దిల్‌వర్‌పూర్, నర్సాపూర్, అంగరాజు పల్లి, సోమన్‌పల్లి (నాగాపురం), జన్‌గావ్ (అల్‌గాం).

కరీంనగర్ జిల్లా : మెడ్‌పల్లి నవ్‌కల్స, తంగ్రడియాల్, బొమ్మెన, లక్ష్మీపూర్, జాబితపూర్, నాన్‌చెర్ల పూడూర్, యల్లారెడ్డి పేట, చెక్కపల్లి II (ఎదురుగట్ల వద్ద), మోదేపల్లి, యంగాల్, స్తంబంపల్లి, బస్వాపూర్ II (పూ రెడ్డిపల్లి వద్ద), బస్వాపూర్ III (నాగసముద్రాలవద్ద), అంబాల్, ఖీంపల్లి, ధర్మరాజ్‌పల్లి, ధూల్‌కట్ట, కుక్కల గూడూర్, యిస్లతక్కాలపల్లి, కున్నారం, రత్నాపూర్ II, కొండంపేట, వాడిపాల వంచ, కాలేశ్వరం, బోర్లగూడెం.

శ్రీకాకుళం జిల్లా : ప్రభుత్వ ట్రైనింగ్ స్కూలు, శ్రీకాకుళం.

విశాఖపట్టణం జిల్లా : గారు భీమవరం, ముర్కాడ, రాజుల అగ్రహారం, పేటసుడి పురం, ఎర్కమ్మపాలెం, జల్లుడిపుడి, కొండల అగ్రహారం, ఖండివరం, జంపన, బాయిలపూడి, సిరిజం, చొల్లంగిపేట, ముఖం, నాడిపల్లి, అమకం, విలాస్థన్‌పాలెం, సి. వేములవలస ప్రభుత్వ పాడిక్షేత్రం, విశాఖపట్టణం.

తూర్పు గోదావరి జిల్లా : సానపల్లి లంక II, వెంట్రకొన, సన్నవిల్లి, వుడుముడి II, బొడ్డవరం, పెద్దిపాలెం, సరభ వరం, గజ్జనపూడి, రామయ్యపేట, రమ ణక్కపేట, భద్రవరం, కంద్రకోట II, చింతలూరు, పల్లపూచవరం, బాబరువాక, పెరిజెల్లిపేట, పిడింగొయ్య, అడ్డెంపల్లి, తాపేశ్వరం III, అలమూర్ III. దొశేశ్వరం II.

పశ్చిమ గోదావరి జిల్లా : తిమ్మరాజు పాలెం, మల్లవరం, ఆరుగొలను, చోడ వరం, గోపీనాథపట్నం.

గుంటూరుజిల్లా: పాల్వాయ్II, నమలికల్లు, సజ్జవారి పాలెం, రవిపాడు, వుప్పలపాడు, చేబ్రోలు IX, చేబ్రోలు X, కరుమురు, ట్సుండూర్ III, మల్లవోలు, నర్మలపాడు, అగతవారపాడు, వుప్పలపాడు, అంగల కుదురు, కుర్నూటల, పెద్దవరం, చెన్నయ పాలెం, భీమవరం II, ధర్మవరం, రేవింగ వరం, మట్టిగుంట, వాసిపల్లిపాడు, గునపల్లి లింగంగుంట, చీరాల, నిడమలూరు.

ఖమ్మం జిల్లా : అత్కూర్, బోనకల్, త్రిపురపెంటవేడు, కొత్తగూడెం, నంది గామ, గన్నవరం, కాల్లేరు, పింజరిమడుగు, రెమిడిచెర్ల, బనిగుండ్లపాడు (చొప్పకట్ల పాలెం), పెగాళ్ళపాడు, కమలాపురం, యినగాలి II (ములుగుమాడు), రామన్న పాలెం (గోసవేడు), నిధానపురం, జమలా పురం.

నెల్లూరు జిల్లా : తూర్పు సంగవరం, బండివెలిగండ్ల, దాసల్లపల్లి, బ్రాహ్మణపల్లి, పుల్లెంగెరికుప్పం, మద్దలికండ్రిగ, రాపూర్ జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాల, నెల్లూరు జిల్లా సమాచారకేంద్రం, బసవయ్యపాలెం, గొల్లవండుకూర్, గోరవరం, అనంత సాగరం.

చిత్తూరు జిల్లా : తీర్థమ్, కప్పల్లి, చెన్నుపాటివారి పల్లి, పూలపల్లి, ఓడెపల్లి.

అనంతపురం జిల్లా : బ్రాహ్మణపల్లి, కృష్ణాపురం, దిమ్మగుడి, జక్కలచెరువు.

కడపజిల్లా : గొటువారిపల్లి, దిగువబాబ వరం, శాత్రూయం సోమవారం, తోతుగుంట పల్లి, అకెపాడు, పెద్దకారంపల్లి, రోల్లమడుగు

కర్నూలు జిల్లా : పెద్ద గోనహల్, తాగడోన, తోకసల్లి, కొమ్మరోల్, కాకనాల పల్లి, గోలపల్లి, బి. తాండ్రపాడు, పూల కొలన, కొలిమిగుండాల, సొమ్మతాగేరి, దుడ్డి, చిన్నబోదనం.



# పారిశ్రామిక విశేషాలు

## రాష్ట్ర రంగం

బాల్ బియరింగులు, గాజు వస్తువుల కొరకు కర్మాగారాల నిర్మాణానికై, రాష్ట్ర ప్రభుత్వం తాలూకు ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంఘం లిమిటెడ్ విదేశ సహకారాన్ని ఒక కొలిక్కి తీసుకొచ్చి, యీ పరిశ్రమల అభివృద్ధికి కొన్ని కొత్త కంపెనీలను స్థాపించడంపై ప్రాథమిక చర్యల్ని పూర్తిచేసింది.

## ప్రయివేటు రంగం

క్లోరో సల్ఫోనిక్ ఏసిడ్‌ను తయారు చేసుకోవడానికి తణుకులోని ఆంధ్రషుగర్స్ వారికి, పారాహైడ్రాక్సీ బెంజైడ్ ఏసిడ్, దానికి సంబంధించిన యితర ఏసిడ్‌ల తయారీకి హైదరాబాదులోని బయోకెమికల్ అండ్ సింథటిక్ ప్రోడక్ట్సు లిమిటెడ్ వారికి లైసెన్సులు యివ్వబడినవి.

హైదరాబాదులోని హైదరాబాదు ఎజ్‌బెస్టాస్ సిమెంటు ప్రోడక్ట్సు లిమిటెడ్‌వారికి, ఏడాదికి షీట్లు, గొట్టాలు మొదలయిన ఎజ్‌బెస్టాస్ వస్తువుల తయారీలో వారి ఉత్పత్తిశక్తిని 60,000 టన్నులకు విస్తృతీకరించేందుకు అంగీకరించబడింది.

కర్నూలుజిల్లా ఎమ్మిగనూరులోని ఎమ్మిగనూర్ స్పిన్నింగ్ మిల్స్‌వలె నంద్యాలలోని వెంకటలక్ష్మీ మిల్స్ లిమిటెడ్ వారికి 25,000 కదుళ్ళతో తమ యూనిటును నెలకొల్పుకోవడానికి భారత ప్రభుత్వం అనుమతించింది.

వస్త్రాలను ఉత్పత్తి చేయడానికి ఒక్కొక్కటి 100 మరమగ్గాలను ఏర్పాటు చేసుకోవడానికి తణుకులోని అక్కమాంబా టెక్స్‌టయిల్స్, సత్యనారాయణ స్పిన్నింగ్ మిల్స్, కాకినాడలోని సర్వారాయ టెక్స్‌టయిల్స్ వారిని భారతప్రభుత్వం అనుమతించిది.

## మైనింగ్ కార్పొరేషన్

ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషను భారతప్రభుత్వ భౌగోళిక పరిశీలనశాఖ సహాయంతో కడపజిల్లా పులివెండ్ల తాలూకాలో ఎజ్‌బెస్టాస్ కొరకై చురుకుగా పరిశీలన కార్యక్రమాలను కొనసాగిస్తున్నది. ఈ పరిశీలనల ఫలితాలను ఆధారం చేసుకుని యీ కార్పొరేషను బ్రహ్మనపల్లి గ్రామంలో కొద్దిపాటి స్థలాన్ని తీసుకుని, అక్కడ ప్రయోగపూర్వకంగా త్రవ్వకం కొనసాగిస్తుంది. ఈ పని త్వరలోనే ప్రారంభం కానున్నది. దీనివల్ల ఎజ్‌బెస్టాస్ నిధులకు సంబంధించిన విలువయిన సమాచారం లభించగలదు. తద్వారా, ఎజ్‌బెస్టాస్ ఉత్పత్తి కాగలదు.

తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రికి దగ్గరగా పుణ్యక్షేత్రంవద్ద బంకమట్టికొరకు యీ కార్పొరేషన్ త్రవ్వకం సాగిస్తున్నది. గ్రాఫైట్ మూసల తయారీకి యీ బంకమన్ను చాలాబాగా వుపయోగిస్తుంది. గ్రాఫిక్ మూసలతయారీ రాజమండ్రిలో బాగా అభివృద్ధి చెందుతున్న పరిశ్రమ. మూసల్ని తయారు చేసేవారికి, కుమ్మర్లు మొదలయిన యితర వినియోగదార్లకు యీ బంకమట్టి సరఫరా చేయబడుతుంది.

విశాఖపట్నం జిల్లా నక్కపల్లి వద్దనైనా బంకమట్టిత్రవ్వకం, శుద్ధి కార్యక్రమాలనుకూడా యీ కార్పొరేషను త్వరలోనే చేపట్టనున్నది. ప్రభుత్వ పింగాణీ నిపుణుడు కొనసాగించిన పరిశోధనలనుబట్టి నక్కపల్లి బంకమన్ను కుంద్ర బంకమన్ను బదులు వాడవచ్చునని వ్యక్తమయ్యింది.






## 5

(బ్రహ్మానందరావు తనగదిలో ఆలోచిస్తూ తిరుగుతుంటాడు. ఇంతలో శారద ప్రవేశిస్తుంది)

శా : ఏమి టాలోచిస్తున్నారు?

బ్ర : ఏమీలేదు.

శా : ఏదో ఆలోచిస్తున్నారు. నాకు చెప్పట్లేదుగాని.

బ్ర : నే నాలోచిస్తున్నానని మీకెల్లా తెలుసు?

శా : నేను మీతో సమానంగా చదువుకోక పోతేమాత్రం ఈపాటి తెలియదటండీ. "Face is the index of mind." అని నేనూ చదువుకున్నాను.

బ్ర : (నవ్వుతూ) ఆలోచనేమీ లేదుగాని (గంభీరంగా ముఖంపెట్టి) నిన్ను కూడా విచారంలో పడెయ్యటం నా కిష్టంలేదు.

శా : నేను మీ అర్థాంగిని, మీతో సుఖంలో వాటా ఉన్నట్టే దుఃఖంలోకూడా ఉంది. మీరు నన్నలా పరాయిదాన్నిగా ఎందుకు భావిస్తున్నారు ?

బ్ర : (ఆమెతల నిమురుతు, నేను నిన్ను పరాయిదాన్నిగా ఎప్పుడూ భావించను. నిన్ను బాధపెట్టటం ఇష్టంలేక. ఎందుకో తెలుసా ? నువ్వు అబలవు, పుష్ప కోమలవు.

శా : పరిహాసం విడిచిపెట్టండి. స్త్రీ సామాన్యంగా అబల, పుష్పకోమల, కాని అవసరమొచ్చినపుడు సబల. వజ్రం కంటె కూడా కఠోరమైనది కాగలదు. (కొంచెం ఆగి) లక్ష్మి వివాహానికి డబ్బు సర్దుబాటయిందా ? చెప్పండి !

బ్ర : దాన్నిగురించే ఆలోచిస్తున్నాను శారదా. ఏం చెయ్యాలో తోచట్లేదు.

శా : అంతా రెడీ అయిందని చెప్పేరుగా ?

బ్ర : అయిపోయినట్టేగాని ఒక '500' రూపాయలు మాత్రం తక్కువయ్యాయి. క్రిందటిసారి "ఎగ్జామినర్ ఫీజు" కూడా దొరకలేదు.

శా : ఇంకా ఒకవారం టైముందిగా ! ఈలోపల దొరుకుతుందేమో చూద్దాం.

బ్ర : వారమేమిటి ? నెలకూడా అవుతుందిట. నిన్ననే యూనివర్సిటీ ఆఫీసుకి వెళ్ళి అడిగాను.

శా : అయితే యిప్పుడేం చెయ్యాలి ?

బ్ర : అదే నేనూ ఆలోచిస్తున్నా ! సమయానికి ఎక్కడా సర్దుబాటు కావట్లేదు.

శా : మూర్తిగారి నడగండి. "ఎగ్జామినర్" ఫీజు అందగానే ఇచ్చేద్దురుగాని.

బ్ర : అతని నింకేం అడగను ? నీకు జబ్బుచేసినప్పుడు తీసికున్న అప్పు ఇంకా తీర్చనే లేదు. ఆయన అడిగితే లేదనరుగాని అస్తమానం అడగడం మనకుమాత్రం ఏం బాగుంటుంది ?

శా : మీకు ధనవంతులైన మిత్రులు చాలా మంది వున్నారుగా ! వాళ్ళ నెవరినైనా అడగండి.

బ్ర : ఎంత అమాయకురాలివి శారదా ! ఎంత డబ్బున్నా ఎవరి స్వార్థం తో

హిందీ నాటిక


మూలం :

చావలి సూర్యనారాయణమూర్తి

అనువాదం :

గోటేటి సావిత్రి


వాళ్ళుంటారు. ఎవరైనా ఒకవేళ ఇద్దామనుకున్నా ఒక "టీచర్" తీరుస్తాడని నమ్మకమేమిటి ? ఉపాధ్యాయునికి గౌరవస్థాన మివ్వాలనే బుద్ధి ఇంతవరకూ కలగలేదీ సంఘంలో !

శా : (కొంచె మాలోచించి) అయితే ఈ 'నెక్లెసు' ఎక్కడైనా తాకట్టుపెట్టి పని నడిపించండి. డబ్బందిన తరువాత విడిపించుకుందాం ! (నెక్లెసు తీస్తుంది)

బ్ర : నీ నెక్లెసా ?...వద్దు...వద్దు.

శా : ఏం ?

బ్ర : శారదా ! అది మీనాన్నగారి వాత్సల్యానికి చిహ్నం. నేనెట్లా తీసికోను ?

అనువాదభారతి

శా : ఇది నా ప్రేమకి చిహ్నం ! తీసికెళ్ళండి. (నెక్లెస్ బ్రహ్మానంద్ జేబులో పడేస్తుంది)

బ్ర : ఏం పని చేస్తున్నావు శారదా ?

శా : సమయాన్నిబట్టి ఈయవలసి వచ్చింది. దీనిని మీరు వద్దనకండి. మంచి పనుల్లో కూడా నన్ను మీ అర్థాంగిని కానివ్వండి.

బ్ర : (ప్రేమగా ఆమె చెయ్యిని నిమురుతూ) నీవెంత మంచిదానవు శారదా ! నిన్ను భార్యగా పొందిన నా జన్మ సఫలమైంది.

శా : మిమ్మల్ని పొందిన నా జన్మ కూడా సార్థకమైంది.

బ్ర : అంతవరకూ నీ మెడలోనే ఉంచు. తర్వాత తీసికెళతా.

(నెక్లెస్ శారద మెళ్ళో పెడతాడు)

కొన్ని పేపర్స్ ఇటుతే. దిద్దుతాను టైము దగ్గరపడుతోంది.

శా : (పేపర్లుతెస్తూ) వాళ్ళుచెప్పిన టైముకి పేపర్లు దిద్దివ్వాలిగాని ఫీజు మాత్రం వాళ్ళు టైముకివ్వరు.

బ్ర : ఇది ప్రపంచం శారదా. తమపనిముందు ఇంకొకళ్ళపని తరవాత. ఏం చేస్తాం (పేపర్లు దిద్దుతూ ఉంటాడు)

(బయటనుండి "బ్రహ్మానందరావుగారికి" పిలుపు)

(శారద లోపలికెళ్ళిపోతుంది. వినాయకరావు ప్రవేశం)

బ్ర : ఓ ! వినాయకరావుగారా ! రండి కూర్చోండి.

వినా : నమస్తే ! కులాసాగా ఉన్నారా ? (కుర్చీమీద కూర్చుంటాడు)

బ్ర : ఆఁ ! మీ దయవల్ల.

వి : ఆవేళమీరు నాదగ్గరకొచ్చి 500 రూపాయలు అడిగారు.

బ్ర : అవునవును. సర్దుబాటు కావని చెప్పేరుకదూ.

వి : అవును ! ఆ మాటలు వదిలెయ్యండి.

ఆ సమయం అలాంటిది. ఇప్పుడు తీసి కోండి (జేబులోంచి 5 వంద రూపా యలనోట్లు తీస్తాడు) మిమ్మల్ని నిరాశ చేశానే అని తరవాత చాలాబాధపడ్డాను.

బ్ర : అదేం లేదులెండి. మీ దగ్గర లేకపోతే మీరుమాత్రం ఏమిచేస్తారు ?

వి : వీటిని తీసుకోండి.

బ్ర : టేబుల్‌మీద పెట్టండి. మీకు నేను చేయగలిగిన ఉపకారమేదైనా ఉంటే చెప్పండి.

వి : (డబ్బు టేబుల్ మీద పెడుతూ) చూడండి. మా అబ్బాయిని మీ రెరుగు దురుకదూ. శంకర్రావు.

బ్ర : ఆఁ ! ఆఁ ! అతన్ని ఎరక్కేం ? కర్నూలు కాలేజీలో చదువుతున్నాడు కదూ ?

వి : ఆఁ ! వాడే ఈ ఏడు బి. ఏ. పరీక్ష ! కెళ్ళాడు. వచ్చేనెల్లో వాడిపెళ్ళి.

బ్ర : ఎక్కడ ?

వి : బెజవాడ.వాళ్ళమామ య్యొకడున్నాడు. వాళ్ళ అమ్మాయిని ఇస్తున్నారు. ఇదిగో! శుభలేఖ తీసికోండి. సపరివారంగా తప్ప కుండా రావాలిసుమండీ. (శుభలేఖ ఇస్తాడు)

బ్ర : (తీసుకుంటూ) అయ్యో ! తప్పకుండా.

వి : (కొంచెం దగ్గుతూ) చూడండి మీరు బి. ఏ. హిందీ సెకండుపార్టుకి "ఎగ్జా మినర్" అని తెలిసింది. మా వాడు అందులో చాలా 'వీక్'గా ఉన్నాడు. కాస్త మీరు దయచూపించి మావాడు పేసయేటట్టుచూడాలి. వాడినంబరు4845.

బ్ర : ఇదా విశేషం? ఊరకరారు మహాను భావులు!

వి : ఏమండోయ్! నన్ను కష్టపెడుతున్నారు మీరు

బ్ర : చూడండి! వినాయకరావుగారూ! నేను మిమ్మల్ని అనవసరంగా ఆశ పెట్టను! అతను వ్రాసిన దానికి తగినట్టుగా మార్కులొస్తాయి! మీరు ఖంగారు పడతా రెందుకు ?

వి : ఖంగారు పడవలసిన విషయమేనండీ ఇది. వాడు హిందీలో 'ఫూర్ ఫెలో' అనటంలో కొంచెంకూడా సందేహం లేదు. ఇంకో విషయం. ఈ పరీక్ష గట్టె క్కితే వాళ్ళ మామయ్య సిఫార్సుమీద వాడికి ఉద్యోగం కూడా రాబోతుంది! ఇందుకోసమే మిమ్మల్నింతగా ప్రార్థిస్తు న్నాను!

బ్ర : మీరు నన్ను బలవంతం పెట్టకండి. అతనెల్లారాస్తే అల్లా మార్కులు వేస్తాను!

వి : మీరే ఇల్లా చెప్తూంటే ఇంక నేనెవరి మీద ఆశ పెట్టుకోను ?

బ్ర : మీరెవరిమీదా ఆశ పెట్టుకోకండి! అది చాలా తప్పు. విద్యాలయం అతిపవిత్ర మైనది. అందులో ఇటువంటి పరిస్థితులు తటస్థపడితే అది చాలా అపవిత్రమై పోతుంది! విద్యార్థులు చక్కగా చదువు కుని వాళ్ళంతట వాళ్ళు అభివృద్ధిలోకి రావాలిగాని "ఎగ్జామిషనర్స్‌కి" గడ్డి తిని పించి పాస్ చేయించుకోవటం బాగుంది టండీ!

వి : అరె! మీరుదీన్ని గడ్డిగాభావిస్తున్నారా?

బ్ర : లేకపోతే ఇంకేమనుకోమంటారు ? మొన్న నేను డబ్బడిగితే లేదన్నారూ. ఇవాళ ఈ వంక పెట్టుకుని తెచ్చి ఇస్తు న్నారూ? ఇది గడ్డికాకపోతే ఇంకేమిటి?

వి : బ్రహ్మానంద్‌గారూ! ఇది గడ్డి కాదండీ ! మీకుమేము శ్రద్ధాభక్తులతో ఇచ్చేకానుక. ప్రపంచంలో ఇలాంటివి కూడా ఉంటాయి గదండీ!

బ్ర : ఈ ప్రపంచమంతా ఒక్కసారి తగుల బడితే బాగుంటుంది. లేకపోతే ఈ ప్రపంచంలో ఇంతకంటే మంచిపనులు లేవేం ? మీరా మంచిపనే ఎందుకుచెయ్య్ కూడదు ?

వి : మనకా పనులవల్ల లాభంలేందే అవెం దుకు చేస్తాం ?

బ్ర : తమ లాభంకోసం ఈ క్షేత్రాన్ని మలిన పర్చటం చాలా అన్యాయం

వి : వ్యవహారంలో ఎవడు, కూడా కూడా ఉంటాడో వాడు విజయం పొందుతాడు! అలాంటివాళ్ళు చూస్తూండగానే లక్షాధి కారు లవుతున్నారు!

బ్ర : అలాచేస్తే బీదవాళ్ళకి చాలాఅన్యాయం జరుగుతుంది! నేను శిక్షితుణ్ణి! శిక్షకుణ్ణి. ఆపని నాచేతకాదు. క్షమించండి.

వి : మాటకు సూటిగా వెళ్ళే మనుష్యులకి ప్రపంచంలో అన్నీ కష్టాలే. జ్ఞాపకం పెట్టుకోండి!

బ్ర : కష్టాలు రావటమా? మీరు కొంచెం ఆలోచించారా? ఇలాంటి బూటకాల మూలంగానే వాళ్ళకి కష్టాలు రావటం. ఈ పాప పంకిలంలో మీరు దిగటమే కాక ఇవతల వాళ్ళనుకూడా దింపు తున్నారు.

వి : సరే ! ఈ తర్కాన్ని ఆపేయండి. ఈ డబ్బుతీసికొని నేను చెప్పిన పని చేయండి.

బ్ర : ఈ పని నావల్లకాదు. వినాయకరావు గారూ ! క్షమించండి. నాకు మీ డబ్బుతో పనిలేదు. మీరు చూపినదయకు కృతజ్ఞుణ్ణి.

వి : మిత్రులయికూడా మాకోసం ఈమాత్రం చేయలేరా ?

బ్ర : ఈ విషయంలో మాత్రం కాదు. మిత్ర త్వానికి ఇదొక్కటే ప్రమాణంకాదు.

వి : అయితే ఇది మీ ఆఖరి నిర్ణయమా ?

బ్ర : అవును.

వి : అయితేసరే : కాళ్ళదగ్గరకు వచ్చిన లక్ష్మిని వద్దనేవాళ్ళని ఇంకేంచేస్తాం ? (డబ్బు తీసికొని వెళ్ళిపోతు) నమస్తే.

బ్ర : నమస్తే : (తెరపడుతుంది)

## 6

(పార్కు. బ్రహ్మానంద్, రమేశ్ కూర్చుని జనరల్ గామాట్లాడుకుంటూ ఉంటారు)

బ్ర : నేను చెప్పేదేమిటంటే అతనిప్రాణం తీసేందుకు ఎవరికీ అధికారంలేదు.

ర : అది నేనూ ఒప్పుకుంటానుగాని ఆ క్రైము వచ్చేటప్పటికి మానవుడు పశువుకంటె కూడా అధముడై పోతాడు.

బ్ర : అలాంటి సమయంలోనే శాంతంగా ఆలోచించుకోగలగాలి. అక్కడే మానవత్వం విశిష్టత.

ర : ఇంకెక్కడి శాంతం ? ఆ క్రైముకి ఆలోచించాలని తోచొద్దూ ? ఒకడు తన భార్య ప్రవర్తన మంచిదికాదనే నిదర్శనం చూచాక శాంతంగా ఉండగలడా? అలా ఉండగలిగితే వాడు దేవుడే ?

బ్ర : అది నేనూ ఒప్పుకుంటానుగాని తన భార్య ప్రవర్తన మంచిది కాదని ఏ భర్తకైనా తెలిస్తే అతనికి కోపం రావటం సహజం. కాని ఆ పరిస్థితుల్లోకూడా పరమేశ్వరుడిచ్చిన ప్రాణాన్ని తీసేందుకు ఎవరికీ అధికారంలేదు. ఎవరిప్రాణమూ అంత తేలికైనదికాదు. ఇవే తారుమారయి భార్య యెదుటకొస్తే ? పాపం ! అదంతా హృదయంలోనే అణచుకొని ఉండాలి. భర్త వ్యభిచారియైతే ఆమె కిమ్మనకుండా ఊరుకోవాలి ? కాని భార్య అపరాధంచేస్తే భర్త ప్రాణంకూడా తీస్తాడా ? ఇదేనా ? మన సమాజం న్యాయం ?

ర : ఇది న్యాయమవనీ అన్యాయమవనీ మొదటినుంచి సమాజంలో నున్నపద్ధతి.

బ్ర : మానవుడు ఇంతకంటె ఉన్నతస్థితికి వెళ్ళాలి. బుద్ధిలో జంతువులాంటి అవస్థను వదలి సభ్యత నేర్చుకోవాలి. బలహీనత ప్రతివ్యక్తిలోనూ ఉంటుంది. కాని దానిని నిగ్రహించు కొనటంలోనే మానవత్వమూ విశిష్టత.

(ఇలా చర్చిస్తూ ఉండగా నాగేశ్వర్ ప్రవేశం)

(బ్రహ్మానంద్‌ని గుర్తిస్తాడు).

నా : (ఆశ్చర్యంగా) బ్రహ్మానంద్ !

బ్ర : (ఆశ్చర్యంగా) నువ్వా నాగేశ్వర్ ! (కౌగలించుకొని) అబ్బ ! ఎన్నాళ్ళకు కలుసుకొన్నాం !

నా : చాలారోజులకు కలుసుకున్నాం ! నువ్విక్కడున్నా వేమిటి ?

బ్ర : నేనిక్కడ ఆరేళ్ళనుండి ఉంటున్నాను ! నువ్వు ?

నా : నేనిక్కడికొచ్చి నెలయింది.

బ్ర : ఎక్కడి నుంచి వచ్చావు ?

నా : కాశీనుంచి.

బ్ర : కాశీనించా ?

నా : అవును. అదంతా ఒక పెద్ద రామాయణంలే. తరవాత చెప్తాను. నేను రైల్వే ఆఫీసులో 'సూపరింటెండెంట్' గా ఉంటున్నాను. నువ్వో ?

బ్ర : నేనిక్కడ కాలేజీలో 'లెక్చరర్'గా ఉంటున్నా !

నా : (రమేశ్ వైపు చూచి) ఈయ నెవరు?

బ్ర : ఈయన నా ఫ్రెండ్ రమేశ్ ! ఇక్కడ బ్యాంకిలో ఎకౌంటెంట్ గా ఉంటున్నాడు. (రమేశ్‌తో) ఈయన నా బాల్యమిత్రుడు నాగేశ్వర్. ఇంచుమించు 7 సంవత్సరాల తర్వాత మళ్ళీ కలుసుకున్నాం !

నా : అలాగా ! సమస్కారమండీ.

ర : నమస్తే !

బ్ర : నువ్వెక్కడుంటున్నావు ?

నా : మా ఆఫీసుకు ఎదురుగా ఉన్న మేడలో ఒక రూముతీసికొని ఉంటున్నాను.

బ్ర: నాగేశ్వర్ ! నువ్వు చాలా వింతమనిషివి. చదువైనతరువాత ఇప్పటివరకూ ఒక్క ఉత్తరం ముక్కైనా వ్రాయలేదు.

నా : కొన్ని పరిస్థితులవలన రాయలేక పోయాను. అంతకంటె ఏమీలేదు.

బ్ర : ఇంటికిపద ! విశ్రాంతిగా చెప్పుకుందాం!

నా : నీకు పెళ్ళయిందా ?

బ్ర : ఆ ! అయింది. నువ్వు పెళ్ళికివస్తావనుకున్నా. కానీ నీ జాడైనా తెలియకుండా మాయమయ్యావు ?

నా : పిల్లలెంతమంది ?

బ్ర : మేము సంతాన నిరోధానికి కృషి చేస్తున్నాం. పిల్లల్లేరు.

నా : కొంతమంది పుట్టాక కదూ నిరోధం ! అసల్లేకుండా నిరోధ మేమిటి ?

(అంతా నవ్వుతారు) !

బ్ర : ఇక్కడంతా కలుసుకున్నాం ! చాలా ఆనందంగా ఉంది.

ర : బ్రహ్మానంద్ : ఇకనేను వెడతాను.

బ్ర : మేముకూడా వస్తునాం పద ! ఇంటికెడదాం ?

నా : నన్ను క్షమించాలి; నీ యెడ్రస్ చెప్తే ఆదివారంనాడు వస్తాను.

బ్ర : (అతని చెయ్యిపట్టుకొని) ఫరవాలేదు! రద్దూ ?

నా : అలాకాదు! బ్రహ్మానంద్! నువ్వు నన్ని వాళ వదిలెయ్యక తప్పదు! ఆఫీసు పని బోల్డు పడి ఉంది.

బ్ర : సరే! అయితే! ఇదుగో విజిటింగ్ కార్డు తప్పకుండా రావాలి.

నా : తప్పకుండా వస్తాను! (కార్డు తీసుకొని) నమస్తే!

బ్ర : నమస్తే!

## 7

(నారాయణ గది! నారాయణ, ప్రభాకర్ కుర్చీల్లో కూర్చుని ఉంటారు! కమల డ్యాన్సుచేస్తూ ఉంటుంది)

## 8

(బ్రహ్మానందరావుగది! బ్రహ్మానంద్ అటూ ఇటూ తిరుగుతూ ఉంటాడు. టేబుల్ మీద రేడియో పాడుతూ ఉంటుంది. ఇంతలో శారద వచ్చి రేడియో ఆపేస్తుంది.)

బ్ర : రేడియో ఆపేశావేం?

శా : ఏమీలేదు.

బ్ర : ఏమీ లేదూ?

శా : కొంచెంసేపు మీతో మాట్లాడ్డానికి.

బ్ర : అదేమిటి? కాలక్షేపం మాటలకోసం ఫస్ట్‌క్లాసైన సంగీతం వస్తుంటే ఆపేస్తావా?

శా : ఆ సంగీతం ఎప్పుడూ ఉండేదే.

బ్ర : నీ మాట లెక్కడికైనా ఎగిరిపోతాయేమిటి?

శా : (కొంచెం కోపంగా) మీకు నాతో మాట్లాడటానికి టైమే దొరకటంలేదు రోజంతా ఒంటరిగాకూర్చుంటే ఎప్పుడో సాయంత్రానికి దయచేస్తారు శ్రీవారు. అప్పుడుకూడా రేడియో పెట్టుకునో స్నేహితులతో కబుర్లు చెప్తూనో గడుపుతారు. లేకపోతే ట్యూషన్ చెప్పటంలో ఆ టైముకాస్తా ఐపోతుంది. రాత్రి భోజనం అయిన తరువాత ఏదో చదువుతూనో వ్రాస్తూనోకూర్చుంటారు సెలవు రోజొస్తే మీటింగుందనో, కాలేజీలో వర్కుందనో వెళ్ళిపోతారు. ఇంక మీతో ఎప్పుడు మాట్లాడను చెప్పండి.

బ్ర : నైస్ వెరీనైస్! 'బ్యూటిఫులైన లెక్చర్‌దంచేశావ్' కాలేజీలో నాప్లేస్‌లో నిన్ను 'లెక్చరర్'గా వేస్తే బాగుంటుంది కదూ?

శా : పోదురూ? లెక్చర్ నేనే మివ్వగలను? మీరు పండితులు. మీ రివ్వగలరు.

బ్ర : (ఆమెగడ్డం పట్టుకుని) నువ్వే పండితునికి తీసిపోతావు శారదా? సరస్వతికి ప్రతిరూపానివికదూ.

శా : అయినా బ్రహ్మగారికంటె తక్కువదాన్నేగా.

బ్ర : బ్రహ్మగారి శక్తివని చెప్పవేం? (ఇద్దరూ నవ్వుతారు)

శా : అయితే వినండి.

బ్ర : అయితే చెప్పండి.

శా : మీబావగారు ఉత్తరం వ్రాసినట్టున్నారు. లక్ష్మీసంబంధంమాట ఏమాలోచించారు?

బ్ర : (గంభీరంగా) ఉపాయం ఏమీ తోచటం లేదు. ఏం చెయ్యాలి? (పళ్ళు పిండుతూ) ఈ వినాయకరావు అంతా తారుమారు చేసేశాడు.

శా : ఆయనకు నీతో శత్రుత్వం దేనికి?

బ్ర : ఎందుకూ పనికిరానివాళ్ళ అబ్బాయిని నేను లంచం తీసుకుని బి.ఏ. పరీక్ష ప్యాస్ చేయించలేదని ఆయనకు నామీద కోపం.

శా : ఆయనకు శత్రువు మీరూ; ఆ ఫలం అనుభవించేది లక్ష్మినా?

బ్ర : ఆ నీచుడు 'తన మూలంగా నిరపరాధిని యైన బాలికబ్రతుకు ఏమవుతుందోకూడా ఆలోచించలేదు. మనలక్ష్మీమీద ఆయన వేసిన అపవాదు అందరికీ తెల్సిందంటే దాన్ని పెళ్ళి చేసుకుందుకు ఒక్కడైనా ముందుకు వస్తారా? చూడు, అబద్ధం మాటలు సంఘంలో ఎంత అనర్థాన్ని తీసుకొస్తాయో! మా బావ ఎన్నో తంటాలుపడి తీసుకొచ్చిన సంబంధం ఈ నీచుని మూలంగా తప్పిపోయింది. నీ కేదైనా ఉపాయం తడితే చెప్పు.

శా : నేను...మీకు...చెప్పనా?

బ్ర : ఏం? ఎందుకు చెప్పకూడదు? స్త్రీలను గురించి శాస్త్రాల్లో ఏంచెప్పారోతెలుసా?

శా : ఏమిచెప్పారు?

బ్ర : (నవ్వుతూ) చెప్పనా?

శా : ఊఁ...చెప్పండి.

బ్ర : ఇదిగో, మరి చెప్పేస్తున్నా, మరి తీరా చెప్పేక నీకు కోప మొస్తుందేమో!

శా : చెప్పండి. ఫరవాలేదు.

బ్ర : అయితే విను. స్త్రీలు పురుషులకంటె రెట్టింపు ఆహారం తింటారు. బుద్ధి పురుషులకంటె నాలుగురెట్లు ఎక్కువుంటుంది. సాహసం ఆరురెట్లు.

శా : నన్ను మళ్ళీ వేళాకోళం చేస్తున్నారు.

బ్ర : నిజం చెప్తున్నా శారదా ఇలా సరదాగా కబుర్లు చెప్తూంటే నా మనస్సెంతో తేలిగ్గా ఉంటుంది.

శా : కబుర్లు తరవాత చెప్పుకుందాం. ముందేం చెయ్యాలో ఆలోచించండి. మీ చిన్నప్పటి మిత్రు డెవరో వస్తాడన్నారుగా. అతను లక్ష్మికి సరిపోతాడేమో చూడండి. ఇంకా అతనికి పెళ్ళి కాలేదన్నారుగా.

బ్ర : వేరీగుడ్. సమయానికి బలే ఉపాయం చెప్పేవు శారదా! శాస్త్రకారులు భార్య మంత్రితో సమాన మని చెప్పేరు; వాళ్ళ మాట అబద్ధం కాలేదుసుమా!

శా : పొగడ్త కట్టిపెట్టి నేను చెప్పింది చెయ్యండి.

బ్ర : తప్పకుండా!

(లోపల గిన్నెలు తీసిన చప్పుడు)

శా : పిల్లి పాలగిన్నె తీసినట్టుంది. చూసి వస్తాను (లోపలకు పరుగెత్తుతుంది).

బ్ర : వాళ్ళొచ్చే వేళవుతుంది. ఇంట్లో "మిల్క్ పౌడర్" ఉందా ?

(బయటనుండి – బ్రహ్మానంద్ – పిలుపు)

బ్ర : అరె ! వచ్చేశాడు. (అంటూ బయటకు వెళ్ళి నాగేశ్వర్‌తో ప్రవేశిస్తాడు.)

నా : (కుర్చీమీద కూర్చుంటూ) ఒరేయ్. ఏం చెప్పమంటావురా బాబూ. బస్సు కోసం వెయిట్ చేసి చేసి కాళ్ళు పోయాయనుకో. సరే ఇంతలో ఏదో బస్సొస్తే అందులో ఎక్కేను. మధ్యలో దానికి రిపేరొచ్చింది. అందు కింత ఆలస్యమయింది. సు వ్వేం చేస్తున్నావు.

బ్ర : ఏమీ చెయ్యట్లేదు.

నా : రమేష్‌గా రింకా రాలేదా ?

(ఇంతలో రమేష్ ప్రవేశం)

ర : (నవ్వుతూ) ఇదుగో ! నేను కూడా వచ్చేశా.

నా : నాటకంలోలాగ వచ్చేశారే. (అంతా నవ్వుతారు)

ర : క్షమించాలి. ఆలస్యమయింది.

నా : అం...ఫరవాలేదు. నేనూ యిప్పుడే వచ్చాను.

బ్ర : శారదా.

(లోపలినుండి – వస్తున్నా –)

(శారద ప్లేట్లలో టీ, కాఫీ, తీసికుని ప్రవేశిస్తుంది. శారదను చూచి నాగేశ్వర్ ఆశ్చర్య పడతాడు. నాగేశ్వర్‌ను చూచి శారదకూడా ఆశ్చర్యపడుతుంది )

నా : శారదా ! నువ్వా ?

శా : నాగేశ్వర్ !

బ్ర : (ఆశ్చర్యంగా) మీ రిద్దరూ పరిచితులేనేమిటి ?

(కొంచెంసేపటి వరకూ ఎవరూ మాట్లాడరు. కాస్సేపటికి శారద సంబాళించుకొని)

శా : అం...ఇతను మా మేనత్త కొడుకు.

బ్ర : అలాగా, నా కింతవరకూ చెప్పలేదేం ?

నా : శారదా ! నువ్విక్కడున్నావేమిటి ?

ర : బ్రహ్మానంద్‌గారి శ్రీమతి ఈమేనండీ.

(నాగేశ్వర్ శూన్యంలోకి చూస్తూ ఉంటాడు. అతని తల తిరుగుతూ ఉంటుంటుంది. తనను తాను సంబాళించుకుంటాడు)

నా : అం

బ్ర : అయితే మనం బంధువుల మయ్యామన్నమాట.

నా : (నీరసంగా తెచ్చిపెట్టుకున్న నవ్వుతో) అం, మరే మరే.

(శారద ఖాళీప్లేట్లు పట్టుకుని వెళ్ళిపోతుంది)

(స్టేజీమీద కాస్సేపు చీకటి–తెర)

(బ్రహ్మానంద్ గది, శారద – నాగేశ్వర్ మాట్లాడుకుంటూ ఉంటారు).

నా : అయితే నా ప్రేమని అంత తేలిగ్గా భావించావన్నమాట !

శా : ఎప్పుడూ లేదు.

నా : అయితే ఇల్లా ఎందు కయింది ?

శా : (మాట్లాడదు)

నా : చెప్పు శారదా ! భయ మెందుకు ?

శా : ఏం చెప్పను? నాగేశ్వర్! (ఏడుస్తుంది)

నా : నా ప్రేమను ఎందుకు తిరస్కరించావు ?

శా : నీ ప్రేమను నే నెప్పుడూ తిరస్కరించలేదు. వివాహ సమయంలో నా హృదయం ఎలాంటిస్థితిలో ఉందో ఆ భగవంతుడికి తెలియాలి.

నా : అయితే మీ నాన్నగారి బలవంతంమీద చేసుకున్నావా ?

శా : లేదు, లేదు. నాఇష్టానికి విరుద్ధంగా నేను మా నాన్న చెప్పినాసరే పెళ్ళి చేసుకోను.

నా : (ఆశ్చర్యంగా) అయితే ఈ పెళ్ళి నీ యిష్టప్రకారంగానే అయిందా ?

శా : ఆ సమయంలో తప్పనిసరిగా అలా చేయవలసివచ్చింది.

నా : (వ్యంగ్యంగా) అబ్బా ! నువ్వు ఇంకొకరిని పెళ్ళాడవలసినంత తప్పనిసరి ఏ మొచ్చిందో చెప్పు విందాం !

శా : పోనిద్దూ ! అవన్నీ తవ్వుకోటంవల్ల ప్రయోజనం ఏమిటి ?

నా : ప్రయోజనం ఉన్నాసరే, లేకపోయినా సరే నీవు చెప్పకతప్పదు.

శా : (మౌనంగా నాగేశ్వర్ వంక చూస్తుంది).

నా : శారదా ! నా హృదయంలోని బాధ నీ వర్థం చేసికోలేవు. కాశీనుంచి నేనెన్నో ఊహాసౌధాలు నిర్మించుకుంటూ వచ్చాను కాని నిన్నిక్కడ చూచేటప్పటికి నా సౌధాలన్నీ కూలిపోయాయి. నా హృదయబాధ ఏమని చెప్పుకోను ?

శా : నన్నంత హృదయ హీనురాలుగా తలచకు నాగేశ్వర్ ! గత్యంతరం లేక పరిస్థితులతో రాజీ పడవలసివచ్చింది.

నా : పరిస్థితుల్లో రాజీ ! పవిత్ర ప్రేమలో కూడా రాజీయేనా ?

శా : ఆ ! నా విషయంలో అంతే అయింది. నాహృదయంలో కర్తవ్యానికి, ప్రేమకు సంఘర్షణ బయల్దేరింది. చివరికి కర్తవ్యానికిముందు ప్రేమ తగ్గవలసివచ్చింది.

నా : (హేళనగా) నిశ్చలప్రేమను కూడా బలిచేయవలసిన కర్తవ్యం నీకు కలిగిందన్నమాట !

శా : పరిహాసం విడిచిపెట్టు నాగేశ్వర్ ! నా పరిస్థితి అర్థం చేసుకోటానికి ప్రయత్నించు.

నా : అంతా అర్థం చేసుకున్నాను.

శా : నువ్వు మర్చిపోయావు నాగేశ్వర్ ! నేను చెప్పేది విను. నే నెప్పుడూ నీ ప్రేమను నిరాదరణ చెయ్యలేదు. పైగా నువ్వే చేశావు. కావాలంటే నీ హృదయాన్నడుగు !

నా : (ఆలోచనగా) ఏమిటంటున్నావు ? నీ ప్రేమని నిరాదరణ చేశానా ?

శా : నేను నిజమే చెప్తున్నా నాగేశ్వర్! నీకే నామీద నిజమైన ప్రేముంటే నన్ను విడిచి వెళ్ళేవాడివా ?

నా : అడగవలసినమాట అడిగావు. నే నెందుకు వెళ్ళానో నీకుమాత్రం తెలియదా శారదా ? ఆ రోజున మీ నాన్న నన్నెంత అవమానం చేశాడో నీకు జ్ఞాపకంలేదూ ?

శా : అయితే ఇదిచెప్పు. నువ్వు అవమానానికి బదులుగా ప్రేమను బలితీసుకున్నా వన్నమాట ! లేకపోతే వెళ్ళేటప్పుడైనా నన్ను కలుసుకున్నావా ? ఇదేనా నీ ప్రేమకు నిదర్శనం ? వెళ్ళాక ఒక ఉత్తరమైనా వ్రాశావా ? ఇదే నీప్రేమకు నిదర్శన మనుకోమంటావా ?

నా : ఓ ! నాది నా కప్పుచెప్పేశావే !

శా : నీది నీకు అప్పచెప్పాలనే ఉద్దేశ్యంతో అలా అనలేదు. నాన్నగారి ఆజ్ఞను పాలించవలసివచ్చింది. అది నా కర్తవ్య మని నే నల్లా చేశాను.

నా : (కోపంగా) హుం..... ఆజ్ఞాపాలన... కర్తవ్యం ! (నొక్కిపలుకుతాడు).

శా : (దీనంగా) పోనీ నువ్వేచెప్పు నాగేశ్వర్ ! మా నాన్నమాత్రం పెళ్ళి చెయ్యకుండా నన్నింట్లో ఎన్నాళ్ళని ఉంచుతాడు ! ఆయన చనిపోకుండా నాపెళ్ళి చెయ్యాలని ఆయనకోరిక. నిన్ను వెతికించడానికి ఆయన ఎన్ని ప్రయత్నాలు చేశారో నీకు తెలియదుమరి. నువ్వేమో ఎక్కడా జాడైనా తెలియకుండా అదృశ్యమై పోయావు. అసలు పరిస్థితులెంతవరకు వచ్చాయంటే నీవు చనిపోయావని కూడా వదంతులు బయల్దేరాయి... చూడు ! మరి మా నాన్న యిలాంటి పరిస్థితిలో ఏం చెయ్యగలరు ? నా సుఖం కోసం మా నాన్న తనసుఖాన్ని త్యాగం చేశాడు. ఆయన మాటను శిరసావహించటం తప్ప ఆయనకు నేను చేసే దింకేముంది ? పితృరుణం తీర్చటానికి నాదగ్గర సాధన మింకేముంది ? నువ్వే చెప్పు నాగేశ్వర్ ?

నా : ఏమిటంటున్నావు ? నేను చనిపోయానని వదంతులు లేవదీశారా ? ఎవరు ?

శా : మీ తమ్ముడు నారాయణ !

నా : నారాయణా ?

శా : ఆ ! అంతేకాదు. నీ ఆస్తిని కూడా స్వాధీనం చేసుకున్నాడు.

నా : (నెత్తిమీద చేతులు పెట్టుకుని) అబ్బా ! ఎలా అయింది పరిస్థితి.

శా : ఇప్పుడేమనుకుంటే ఏం లాభం ? పరిస్థితులతో రాజీపడి ముందుకు నడవాలి.

నా : (పళ్ళుపిండుతూ) రాజీ పడాలట రాజీ ! నా జీవితాన్ని శ్మశానం క్రింద మార్చి ఉపదేశం చేస్తున్నావా ?

శా : ఎందుకు? అనవసరంగా కోప్పడతావు? ఏం చేస్తాం ? మనమంతా ఈశ్వరుని ముందు కర్రబొమ్మలం.

నా : (కోపంగా) వేదాంతం కట్టిపెట్టు శారదా? మధ్యన ఈశ్వరుణ్ణి ఈడుస్తా వెందుకు ? (శాంతంగా) నీకు కనక నామీద నిజమైన ప్రేముంటే నా జీవితాన్ని తిరిగి నందన వనం చెయ్యగలవు ?

శా : నే నెట్లాచెయ్యగలను ?

నా : ప్రపంచంలో అసంభవమైన దేదీలేదు... బ్రహ్మానందానికి విడాకులిచ్చేస్తే అది సంభవమే అవుతుందికదూ ?

శా : (కోపంగా) నాగేశ్వర్ ! బుర్ర దగ్గర పెట్టుకుని మాట్లాడు. స్త్రీని అంత తుచ్ఛురాలుగా భావిస్తున్నావా ? అట్లా మాట్లాడ్డానికి నీకు సిగ్గువెయ్యట్లేదూ ?

నా : నేను స్మృతి తప్పి మాట్లాడట్లేదు. జాగ్రత్తగానే మాట్లాడుతున్నా !

శా : (అసహ్యంతో) ఎంగిలి వస్తువును ముట్టేటంత నీచమయి పోయిందేమిటి. నీ మనస్సు ?

నా : అలా అనటంవల్ల నేను నిన్నెంత ప్రేమిస్తున్నానో నీ కర్థమవుతుంది.

శా : ఇది ప్రేమకాదు, కామవాంఛ.

నా : నాదినువ్వు చెప్పినవాంఛే అయితే దాన్ని పూర్తిచేసుకునేందుకు నిన్ను భిక్ష అడిగే అవసరం ఉండదు.

శా : ఇది వాంఛకాకపోతే ఇంకేమిటి ? నిజమైనప్రేమ శరీరసంబంధాన్ని కోరదు.

నా : నిజమైన ప్రేమ ! అహ్హ హ్హ ! నాది నిజమైన ప్రేమ కాకపోతే నీకోసం నా తల్లి దండ్రుల్ని, ఆస్తిని వదలి వెళ్ళి పోయుందునా ? (బ్రతిమాలే ధోరణిలో) చూడు శారదా ! నే నెన్ని కష్టాలనుభవించానో అవన్నీ నీకోసం. ఇక్కడికి వచ్చేవరకు "మనిద్దరికి పెళ్ళయినట్టు, మనం సంసారం చేస్తున్నట్టు ఎన్నో తీయ తీయని కలలు కన్నాను. కలలు కలలుగానే త్రుంచిపారేస్తావా శారదా ?

శా : నాగేశ్వర్ ! జీవితంతో రాజీపడి నేను చాలాదూరం వచ్చేశాను. ఇప్పుడు మళ్ళీ వెనక్కి తిరిగిరావటం, ఇంకో త్రోవని వెళ్ళటం ఇదేం బాగులేదు. నీ సూచనను భారతీయ సంస్కృతి అంగీకరించదు. మానవుడు కేవలం తన స్వార్థంకోసమే

కొక సంఘంగురించి కూడా ఆలోచించాలి.

నా : సంఘం....ఈ సంఘమే నన్ను సర్వ నాశనం చేసింది శారదా !

శా : నాగేశ్వర్ ! జరిగినదంతా మర్చిపోయి నన్ను చెల్లెలిగా భావించు.

నా : శారదా !

శా : నీ చెల్లెలి ప్రార్థనను అంగీకరించ లేవా అన్నయ్యా ! (నమస్కరిస్తుంది)

నా : శారదా ! (గొణుక్కుంటూ నెమ్మ నెమ్మదిగా బయటకు వెళ్ళిపోతాడు)

(శారదకూర్చుని ఏడుస్తూ ఉంటుంది. బ్రహ్మానంద్ ప్రవేశం)

బ్ర : శారదా ! సిద్ధమయ్యావా ?

శా : (కళ్ళు తుడుచుకుని) మీరా ?....వచ్చేశారా ? సిద్ధమయ్యాను పదండి !

బ్ర : (ఆమెవంక చూచి) అరె ! నీ కళ్ళల్లో నీళ్ళు !

శా : (పెదవులమీదికి నవ్వు తెచ్చుకొని) లేదు.

బ్ర : అయితే కళ్ళు తడిగా వున్నాయేమిటి?

శా : (అదేవిధంగా) ఏమీలేదు పదండి.

బ్ర : చెప్పాలి. ఎందుకేడుస్తున్నావే ?

శా : ఎమీలేదు; మానాన్నగారు జ్ఞాపకం వచ్చారు. అందుకు మనస్సు వ్యాకుల పడింది.

బ్ర : అదా. అయితే ఎంతసేపేడుస్తావు ?

శా : ఏమీలేదు పదండి. (ఇద్దరూ వెళ్ళి తూండగా తెర)

## 9

(నారాయణ గది. సంగీత దర్శకుడు వసంతలాల్, ప్రభాకర్, మాట్లాడు కుంటూ ఉంటారు.)

వసం : చూడండి ! ఇలా అయితే పనేమి నడుస్తుంది ? ఇప్పటికీ మూడు పాటలు మాత్రం రికార్డయ్యాయి ! ప్లేబాక్ గాయకులకు, మ్యూజిక్‌వాళ్ళకి ఇంకాపూర్తిగా డబ్బివ్వనేలేదు. నాకు ఎడ్వాన్సు కూడా పూర్తిగా ఇవ్వలేదు.

ప్ర : కొంచెం ఓపిక పట్టండి వసంతలాల్ గారూ ! డబ్బు చేతికందగానే అన్నీ సర్దుబాటవుతాయి.

వ : మీరు కబుర్లు జోరుగా చెప్తున్నారు కాని పని కొంచెంకూడా కావట్లేదు. కబుర్లతో కడుపు నిండుతుందిటండీ !

ప్ర : ఇప్పుడు మాటలేం కాదు ! పనే అవుతుంది. చూడండి !

వ : చూడకేమిటండీ ! ఒళ్ళంతా కళ్ళు చేసుకు చూస్తుంటేను ! ఎక్కడా ఆశ కనిపించట్లేదు !

ప్ర : ఈసారి చూడండి వసంతలాల్‌గారూ !

వ : నారాయణగారు ఎక్కడికెళ్ళారు ?

ప్ర : ఎంతసేపటి కొస్తాడో నేను చెప్పలేను గాని ఆ పనిమీదే వెళ్ళేడు !

వ : నేనెప్పుడొస్తే అప్పుడే ఆయనుండటం లేదు !

ప్ర : అరె ! మీకంత ఇబ్బంది దేనికండి ? రేపు డబ్బు వచ్చేస్తుంది. సరేగాని ఇవాళ రిహార్సలెన్నింటికి ?

వ : ఇవాళ రిహార్సల్స్ లేవు !

ప్ర : ఏం ?

వ : మ్యూజిక్‌వాళ్ళు ఇదివరకటి డబ్బు పూర్తిగా ఇస్తేనేగాని క్రొత్త రికార్డుకి రామని ఖచ్చితంగా చెప్పేశారు.

ప్ర : అయితే ఇంకొకళ్ళని పిలవండి, డబ్బిచ్చేద్దాం. మనమేమైనా వాళ్ళచేత ఊరికే చేయించుకుంటున్నామా ?

వ : ఇప్పటివరకు ఊరికేనే పని చేయించుకున్నాం !

ప్ర : ఊరికేనా ?

వ : మూడు పాటలు రికార్డింగ్ అయితే ఒకపాటకే డబ్బిచ్చారు !

ప్ర : చూడండి, డబ్బు రేపటెల్లుండిలో పూర్తిగా దొరుకుతుంది ! ఘాబరా పడకండి; పని కానిస్తూ ఉండండి !

వ : అయితే ఇప్పుడు కొద్దిగా ఇవ్వండి ! వాళ్ళని సమాధాన పరుస్తాను !

ప్ర : అరె ! మీరుకూడ...(జేబులోంచి పర్సు తీసి) ఇప్పటికీవందరూపాయలు తీసుకోండి !

వ : (డబ్బు తీసుకుని) ఇంకొక వందకూడ ఉంటే ఇవ్వండి ! పనిలోపని హార్మోనియం వాళ్ళకికూడ ఇస్తాను. పాపం ! వాళ్ళుచాలా యిబ్బందిలో ఉన్నారు.

ప్ర : ఏం చెప్పనండీ మీతోటి, నా ఖర్చులోది తీసి మీ కిచ్చాను. నాదగ్గర డబ్బుంటే మీ రంతగా అడగాలిటండీ ! ఎక్కువ ఇబ్బందిగా ఉన్నవాళ్ళకి ముందివ్వండి. మిగిలినవాళ్ళకి తరువాత చూద్దాం.

వ : మంచిది. వెళ్ళొస్తాను. నమస్తే (వెళ్ళిపోతాడు).

ప్ర : అమ్మయ్య ! ఇప్పటికీ శనిగాడు వదిలాడు.

(ఇంతలో నారాయణ అరుస్తూ ప్రవేశిస్తాడు).

నా : శనిరోజులు వచ్చాయంటే అంతా మట్టిలో కలిసిపోతుంది (అంటూ హేట్ టేబుల్‌మీద పడేసి కుర్చీలో కూర్చుంటాడు !)

ప్ర : ఏమిటైంది ?

నా : అంతా తారుమారై ఊరుకుంది !

ప్ర : ఏమిటయింది :

నా : ఎంతవాలో అంతా అయింది :

ప్ర : (చిరాగ్గా) అసలు విషయం చెప్తావా ! చెప్పవా ?

నా : నాగేశ్వర్ బ్రతికే ఉన్నాడురా బాబూ !

ప్ర : (నెత్తిమీద పిడుగు పడ్డట్లయింది)

బ్రతికున్నాడా ? ఎక్కడ ?

నా : ఈ ఊళ్ళోనే

ప్ర : ఎవరు చెప్పేరు ?

నా : నా కళ్ళతో నేనే చూశాను !

ప్ర : ఎక్కడ ?

నా : "మోడరన్ కేఫ్"లో

ప్ర : నువ్వు పొరపాటుగా చూశావేమో !

నా : నేనేం పొరపాటు పడలేదు ! డబ్బ డగడానికి వెళ్ళినప్పుడు వినాయకరావు కూడా చెప్పేడే !

ప్ర : అది సరేగాని...వినాయకరావు డబ్బిచ్చాడా ? లేదా ?

నా : డబ్బెల్లా ఇస్తాడు ? వాడు బ్రతికుండగా మనకు డబ్బుమీద హక్కెక్కడుంది ?

ప్ర : ఇదికూడా పోయిందే ! పిక్చర్‌కి షూటింగు కూడా ప్రారంభమయింది ! ఇప్పుడు పనెల్లా అవుతుంది ?

నా : మనం కుట్ర చేశామని వాడికూడా తెలిసిపోయింది !

ప్ర : అరెరె ! అయితే చాలా కష్టం ! వాడు కోర్టులో దావా వేశాడంటే మన్ని పట్టుకుంటారు కూడాను !

నా : (అధైర్యంగా) అప్పుడు మూటాముల్లే పట్టుకుని జాగ్రత్తగా వెళ్ళవచ్చు !

ప్ర : ఎక్కడికి వెడతాం ?

నా : మనజాడ ఎవరికీ తెలియకుండా ఉండే చోటికి !

ప్ర : మనం ఎక్కడున్నా పోలీసులు పట్టుకుంటారు తెలుసా ?

నా : అయితే ఏం చెయ్యాలి ? నీ కేదైనా ఉపాయం తోస్తే చెపుదూ ?

ప్ర : (గంభీరంగా) నీకో ఉపాయం చెప్తాను. నేను చెప్పినట్లు చేస్తావా ?

నా : నీవేం చెప్తే అది చేస్తా

ప్ర : అయితే విను ! ఒక్కటే ఉపాయం. "నాగేశ్వర్"ని పరలోకానికి పంపాలి.

నా : ప్రభాకర్ ! హత్యా ?

ప్ర : అవును ! నువ్వీపని చేశావంటే మన పనికి ఇంకేమీ అడ్డురాదు.

నా : వద్దు ప్రభాకర్ ! వాడు నా అన్నయ్య! వెధవడబ్బుకోసం వాడి నెత్తురుతో నా చేతులు రంగుచేసుకోను. తరవాత బిచ్చగాణ్ణయినా సరే !

ప్ర : అరె ! ఛాఈ ! ఇది జీవితం. ఒకణ్ణి చంపి ఇంకొకడు ఆకలి తీర్చుకోవాలి.

నా : కాని మనం మనుష్యులం.

ప్ర : అవసరమైనపుడు మారుతూ వుండాలి. అది సరేకాని ఈ షర్‌బత్ కొంచెం తీసుకో (ఇద్దరూ చెరొక గ్లాసుతో షరబత్ త్రాగుతారు) అన్నట్లు కమలవచ్చేప్పైమయింది.

నా : కమలెందు కొస్తుంది.

ప్ర : ఇవాళ డ్యాన్స్ రిహార్సల్స్ ఉన్నాయి కదూ ?

(ఇంతలో కమల ప్రవేశిస్తుంది)

క : నమస్తే !

ప్ర : అప్పుడే వచ్చేశావే ?

(కమల ఒక కుర్చీమీద కూర్చుంటుంది)

ప్ర : చూడు కమలా ! ఇదే ఆఖరిరిహార్సల్. నువ్వు డ్యాన్స్ ఎలా చెయ్యాలంటే ప్రేక్షకులంతా పరవశమైపోవాలి. ఊఁ...ఏదీ ప్రారంభించు. (కమల డ్యాన్స్‌చేస్తూ పాడుతూండగా తెర.)

## 10

(నాగేశ్వర్ గది. నాగేశ్వర్ ఆలోచిస్తూ అటూ ఇటూ తిరుగుతూ ఉంటాడు. గది చీకటిగా ఉంటుంది)

నా : హుఁ. నిన్ను చెల్లెలుగా భావించాలా ? అందుకోసమేనా నేను ఊళ్ళన్నీ తిరిగొచ్చిందీ? ఆస్తంతా పోయింది. నాదనుకున్న శారదకూడా పరాయిదైపోయింది. నారాయణా ! ఇన్నాళ్ళూ ఆస్తిమీద కన్నువేసి ఉంచావని తెలియదుసుమా. చివరికి నేను చచ్చిపోయినానని కూడ పుకారుపుట్టించి నీకోరిక తీర్చుకున్నావు. బ్రహ్మానంద్ ! నువ్వుచాలా భాగ్యవంతుడివి. శారదలాటి రత్నాన్ని పొందగలిగావు. అవున్లే నీ తప్పేముంది ? నన్ను కాదని శారద నిన్ను చేసుకుని కులుకుతోంది. ఇది నేను చూస్తూ ఊరుకుంటానా ? లేదు. ఎప్పుడూ లేదు. శారదా! నా జీవితాన్ని ఎందుకూ కాకుండా చేశావు. హాయిగా బ్రహ్మానంద్‌తో కులుకుతున్నావు. ఇది ఎప్పటికీ కాదు. నేనిప్పుడు ఏ స్థితిలో ఉన్నానో ఆ స్థితిలో నీవుకూడా ఉండి మద్రాసురోడ్ల వెంట బిచ్చగత్తెవై తిరుగుతూ ఉండగా చూస్తేగాని నాకు నిద్రపట్టదు. (భయంకరంగా నవ్వుతాడు) బ్రహ్మానంద్ ! నువ్వుకూడా — అహ్హహ...

(బ్రహ్మానంద్ ప్రవేశిస్తాడు)

బ్ర : నాగేశ్వర్ !

నా : (తడబడుతూ) బ్రహ్మానంద్ ! నువ్వా?

బ్ర : అవును ! నేనే ! అలా ఆశ్చర్యపడతావెందుకు ?

నా : అబ్బే ! ఏమీలేదు, కూర్చో ! (ఇద్దరూ కుర్చీలమీద కూర్చుంటారు !)

బ్ర : ఇదేమిటి గదంతా చీకటిగా ఉంచావు !

నా : ఓ ! మర్చిపోయా ! ఏదో ఆలోచనలో పడి లైటుమాటే మర్చిపోయాను.

(లైటు వేస్తాడు)

బ్ర : ఈమధ్య కనపడటమే మానేశావు ! ఏమిటీ విశేషం ?

నా : విశేష మేమీలేదు ; తీరుబడి లేక ;

బ్ర : ఆదివారంకూడా తీరుబడి కాపట్లేదు ?

నా : (కొంచెం సేపు మౌనం ; తరువాత) బ్రహానంద్ !... (ఆగిపోతాడు)

బ్ర : మాట్లాడవేం ?

నా : పోనిద్దూ ! ఇప్పు డెందుకు ?

బ్ర : లేదు నాగేశ్వర్ ! ఇప్పుడు చెప్పక తప్పదు.

నా : సరే అయితే, చెప్తా విను. నిన్న నేను మీ యింటికి వెళ్ళాను ! తెలుసా ?

బ్ర : నాకు తెలిదే. ఎన్నింటికి వెళ్ళావు !

నా : సాయంత్రం మూడింటికి.

బ్ర : అవును. అప్పుడు నేను ఇంటిదగ్గర లేను ! నువ్వొచ్చినట్టు శారద నాతో చెప్పలేదే ?

నా : (కుటిలంగా నవ్వుతూ) అవును. ఎట్లా చెప్తుందిలే !... చూడు బ్రహ్మానంద్ ! నేను మీ యింటికి రాకుండా ఉండటమే మంచిది మీ యింటికి వచ్చి చక్కటి సంసారంలో చిచ్చుపెట్టలేను ! మనం ఇల్లా బయటనే కలుసుకుంటూ ఉందాం !

బ్ర : నువ్వుచెప్పేది నాకు కాస్తకూడా అర్థం కావట్లేదు ! డొంకతిరుగుడు లేకుండా సరిగ్గా చెప్పకూడదూ ?

నా : నువ్వెంత అమాయకుడివి బ్రహ్మానంద్ ! శారద మా మామయ్య కూతురని నీకు తెలుసా ?

బ్ర : అవును ! నువ్విక్కడ కొచ్చాక తెలిసింది.

నా : అవున్లే ! అంతకుముందు విషయం నీకేం తెలుస్తుంది ! సరే ! విను ! మొదట అందరూ శారదను నాకివ్వాలనే అనుకునేవారు ! మేమిద్దరంకూడా గాఢంగా ప్రేమించుకున్నాం ! ఒకరోజు మామయ్య నన్ను చాలా అవమానం చేశాడు ! దాంతో నేను అందర్నీ విడిచి పారిపోయాను ! తరువాత నీతో శారద పెళ్ళయింది. ఆ విషయం నా కిక్కడ కొచ్చేవరకూ తెలియదు. పాపం ! శారద తన పూర్వప్రేమను మరువలేక పోయింది ! నేను నిన్న మీ యింటికి వెళ్ళినపుడు... ! ఇంక నేను చెప్పలేను బ్రహ్మానంద్ ! అందుకనే మీ సుఖమయ జీవితంలో అశాంతి వ్యాపించకుండా ఉండడానికి మనం దూరంగానే ఉందాం !

బ్ర : చాలు ! ఇంక చెప్పనవసరం లేదు ! అంతా తెలిసింది... వెడుతున్నా !

నా : బ్రహ్మానంద్ ! నువ్వేమీ అనర్థంతీసుకురాకు. నామీద ఒట్టు.

బ్ర : హుం (చెయ్యివిడిపించుని విసురుగా వెళ్ళిపోతాడు.)

నా : అహ్హహ్హ — శారదా! (గట్టిగా. భయంకరంగా నవ్వుతూ ఉండగా తెరపడుతుంది)

## 11

(బ్రహ్మానంద్ తనగదిలోతిరుగుతూ ఉంటాడు. రాత్రిసమయం. అతని ముఖం భయంకరంగా ఉంటుంది. ఏదో భయంకరమైన పని చేస్తాడేమో ననిపిస్తుంది ఆ ముఖంలో. ఒకమంచం మీద శారద నిద్రపోతూఉంటుంది )

బ్ర : (పళ్ళుపిండుతూ) ఎంత విశ్వాసఘాతకురాలివి. ఇన్నాళ్లూచూపిన ప్రేమంతా నటనన్నమాట. నా మిత్రునితోకూడా ఇలాంటి వ్యవహారమా ? ఛీ ! ఛీ ! సిగ్గులేదూ ? ఇలాంటి విశ్వాసఘాతకమైన పని చేసినందుకు అనుభవించు. (అంటూ కత్తి బైటకి తీసి ఆమెను పొడవబోతాడు) ఇంతలో గోడమీదనుండిఅతనినీడ ఇట్లా అంటుంది.

నీడ : ఆగు! పరమేశ్వరుడిచ్చిన ప్రాణాన్ని తీసేందుకు ఎవరికీ అధికారం లేదు.

బ్ర : ఏమిటీ ? అంటున్నది ? పరమేశ్వరుడిచ్చిన ప్రాణాన్ని తియ్యటానికి ఎవరికీ అధికారంలేదూ ? అయితే ఇది చేసిన అపరాధం ?

నీ : అపరాధం ! .ఆ రోజు నువ్వు పార్కులో రమేశ్‌తో ఏమన్నావు ? ఎవరు ఎటువంటి తప్పు చేసినాసరే చంపటానికి అధికారంలేదని వాదించావు గుర్తుందా ?

బ్ర : (కొంచెం చిన్నగొంతుతో) అం ! జ్ఞాపకం వస్తోంది.

నీ : ఆ సలామె అపరాధం చేసిందని నీకెలా చెప్పగలవు !

బ్ర : నా చిన్ననాటిమిత్రుడు అబద్ధం చెప్తాడా ?

నీ : నాగేశ్వర్ !

బ్ర : అవును ఏం ?

నీ : ఆనాగేశ్వర్ నీకునిజంచెప్పాడని నమ్మకమేమిటి ?

బ్ర : అతనికి అబద్ధం చెప్పవలసిన అవసరమేముంది ?

నీ: బ్రహ్మానంద్! ఇది ప్రపంచం! ఎన్ని రకాల మనుష్యులుంటారు? పైకి రామ్. రామ్ అనటం లోపల కత్తులు నూరటం నిజానిజాలు తెలిసేవరకూ తొందరపడి ఏ పనీ చేయకూడదు. చేస్తే జీవితాంతం పశ్చాత్తాప పడాలి, జాగ్రత్త.

(నీడమాయమవుతుంది)

బ్ర : (సాలోచనగా) నిజానిజాల్ని ఋజువు చేయటం ఎలాగ ?... పోనీ శారదనే అడిగితేనో. అబ్బే అసలు విషయం చెప్పదు (కొంచెంసేపు ఆలోచించి) అం ఇల్లాచేస్తే బాగుంటుంది ( రీపు మీద కూర్చొని ఒక కాగితంమీద ఏదో వ్రాసి కవరులో పెట్టి టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోతాడు)

## 12

(బ్రహ్మానంద్ గది. నాగేశ్వర్ శారద మాట్లాడుకుంటూ ఉంటారు)

నా : అయితే ఈ ఉత్తరం ఎవరు వ్రాశారు ?

శా : నాకు తెలియదు !

నా : నాదగ్గర అబద్ధం చెప్పకు శారదా ! నువ్వుతప్ప నా కింకెవరు ఉత్తరం వ్రాస్తారు ?

శా : అది నే నెలా చెప్పగలను ? అయినా నేను నీ కెందుకు రాస్తాను ?

నా : అవును, ఉత్తరం ఎందుకు వ్రాస్తావు ? ఏం చెయ్యాలో అంతా చేశాక !

శా : నేను నిన్నేం చేశాను ?

నా : ఇం కేం చెయ్యాలి ? నా ప్రేమను కాద న్నావ్ ! నా జీవితాన్ని శ్మశానంలా తయారు చేశావు ! నీ ప్రేమలో పడి పిచ్చివాణ్ణయి నా ఆస్తినంతా కూడా వదులుకున్నాను ! నీ కేం తెలియనట్లు భోగ విలాసా లనుభవిస్తున్నావు ! ఇంతకంటే ఏం చెయ్యాలి ?

శా : అన్నయ్యా ! నాగేశ్వర్ ! ఇంత చదువు కున్నావు ! ఇన్ని ఊళ్ళు తిరిగావు. నీ ప్రియమిత్రుని భార్యతో అసహ్యకరంగా ప్రవర్తిస్తున్నావు ! నీ మన స్సింత నీచ మయి పోయిందేమిటి ? నీ ఆత్మ నిన్ను వెక్కిరించట్లేదూ ?

నా : నువ్వేమన్నా సరే శారదా ! నేను ఎవరికోసమైతే అంత అవమానాన్ని సహించానో, తల్లి దండ్రుల్ని చివరికి ఆస్తిని కూడా వదులుకున్నానో ఆ శారదని ఇంకొకడు ఎగరేసుకుపోతుంటే నే నెట్లా సహించ గలను ? వాడు నా మిత్రుడవనీ. ఇంకేమైనా అవనీ !

శా : సంకుచిత బుద్ధి వదిలెయ్ నాగేశ్వర్ ! నీ మనస్సును విశాలంగా మార్చుకో ! జీవితంలో మనం కోరినవన్నీ లభ్యం కావు ! లభ్యంకాని వాటికోసం ప్రయత్నించటం మూర్ఖత్వమే అవుతుంది !

నా : నా జీవితంలో చేయవలసింది ఇంకొక్కటే మిగిలిఉంది ! అదేమిటో తెలుసా శారదా ! నీతో వివాహం.

శా : (కోపంగా) నాగేశ్వర్ ! దాని పేరెత్తకు. నాకు పెళ్ళయింది, నేను పతివ్రతను. నా భర్తకు అపకారంచెయ్యను.

నా : (హేళనగా) నీ పాతివ్రత్యం తెలుస్తూనే ఉంది ! ...

శా : (గట్టిగా కోపంగా) నీచుడా ! మాట్లాడకు ! నా పాతివ్రత్యాన్ని పరీక్షించడానికి నువ్వెవడివి ?

నా : నేనెవర్నో నీ కిప్పుడే చూపిస్తా ! (గంభీరంగాను, క్రూరంగాను) చూడు, మన కలయిక, ఈ లోకంలోనైనా అవాలి, లేకపోతే ఆ లోకంలోనైనా (అంటూ పేంట్ జేబులో నుండి పిస్టల్ తీసి, ఏం, నీ కిష్టమేనా ?

శా : (ఆశ్చర్యంతోను, భయంతోను) నువ్వు...నన్ను...చంపుతావా ?

నా : నిన్ను చంపి నేనుకూడ పొడుచుకు చస్తాను ! వచ్చే జన్మకు మనిద్దరం కలుసుకుందాం !

శా : ఇంట్లో నన్ను ఒంటరిగా చూసి చంపే అంత సాహసం చేశావన్నమాట ! కానీ ! నీవు నన్ను చంపగలవు గానీ నా ఆత్మను ఏమీ చెయ్యలేవు ! వచ్చేజన్మకు కాదుకదా, వెయ్యి జన్మలెత్తినా నీవంటి నీచునితో మిత్రద్రోహితో కూడా నా పెళ్ళి కాదు ! జ్ఞాపకం పెట్టుకో !

నా : సరే. అయితే (అంటూ పిస్టల్తో పేల్చడానికి డేగర్ మీద వేలు పెడతాడు. ఇంతలో బ్రహ్మానంద్ వచ్చి నాగేశ్వర్ చేతిమీద గుద్దుతాడు. అతని చేతిలోనుంచి పిస్టలు క్రింద పడుతుంది)

శా : (ఆశ్చర్యంగా) మీరా ?

నా : (తడబడి) బ్రహ్మానంద్ ! నువ్వా !

బ్ర : అవును, నాగేశ్వర్, నేనే, నువ్విక్కడేం చేస్తున్నావు ?

నా : (ఉత్తరం చూపిస్తూ) ఇది చూడు.

బ్ర : (ఉత్తరం తీసికొని) ఇదిశారదవ్రాయలేదు. నేనే వ్రాశాను.

శా : మీరా ?

నా : ఏమిటి ? నువ్వా?

బ్ర : అవును, నేనే, నీ మాటల్లో నిజం ఎంతుందో తెలుసుకోటానికి ఈపన్నాగం పన్నాను. అది సఫలమైంది. సమయానికి ఆ ఈశ్వరుని దయవల్ల వివేకం కలిగింది గాని లేకపోతే నీ మాటలు నమ్మి ఘోరంగా స్త్రీహత్యకు పాల్పడిఉందును.

శా : ఆఁ...ఇంత నీచత్వమా ? (అంటూ గబుక్కున వంగి కిందపడి ఉన్న పిస్టల్ తీసి నాగేశ్వర్వైపు గురిపెడుతుంది)

బ్ర : శారదా ! ఏమిటాపని ? (ఆమె చెయ్యి పట్టుకుంటాడు)

శా : నా చెయ్యి వదలండి. నేను ప్రతీకారం తీర్చుకోందే వదలను. తరువాత ఏమైనా సరే. (చెయ్యి విడిపించుకు నేందుకు ప్రయత్నిస్తుంది.)

బ్ర : ఇది పిచ్చితనం. ఈశ్వరుడిచ్చిన ప్రాణాన్ని తియ్యటానికి ఎవరికీ అధికారం లేదు !...నాగేశ్వర్ ! నేను మీ మిత్రునికి అడ్డు నిలబడ్డానని తలుస్తున్నావు కదూ! మీ రిద్దరూ పెళ్ళిచేసుకొని సుఖంగా ఉండాలని ఉంటే నేను మీ త్రోవకి అడ్డురాను. నేను ఎక్కడికైనా వెళ్ళిపోతాను. పెళ్ళి చేసికొని సుఖంగా ఉండండి. నా కేమీ ఇబ్బందిలేదు.

నా : (ఆశ్చర్యంగా బ్రహ్మానంద్ వంక చూస్తాడు)

బ్ర : శారదా ! నేను నిన్నిక్కడ బలవంత పెట్టి ఉంచుతానని మాత్రం ఎప్పుడూ అనుకోకు..నీ యిష్టం.

శా : (బాధగా) మీరుకూడా నన్నవమానిస్తున్నారా ? నేను భారతస్త్రీని. ఆమెను అవమానించడాని కెవరికీ అధికారంలేదు. పరాయి పురుషుడొచ్చి ఒక స్త్రీని అవమానిస్తున్నపుడామెభర్త ఏమీమాట్లాడకుండా చూస్తూ ఊరుకుంటాడా ?

'స్త్రీమాన' మంటేఅంత తేలికా ?పూర్వం కౌరవులు ద్రౌపదిని అవమానించినపుడు పాండవులు ప్రతీకారం ఎలా తీర్చుకున్నారో గుర్తుతెచ్చుకోండి.

బ్ర : కౌరవ కులాన్నంతా నాశనం చేశారు. కాని ఏం లాభం ? వాళ్ళ దుష్టప్రవృత్తి మానలేదుగా ?

శా : మీరు వెయ్యిచెప్పండి, నేను ప్రతీకారం తప్పకుండా తీర్చుకుంటాను.

బ్ర : అవును.

బ్ర : ఇతన్ని నువ్వు క్షమించలేవూ ?

శా : క్షమించలేను. నా హృదయ మెంత క్షోభగా ఉందో మీకు తెలియదు.

బ్ర : అయితే సరే. ముందు నా ప్రాణంతియ్యి. తరవాత అతనిది. (అంటూ నాగేశ్వర్ ముందుకు వెళ్ళి శారద కెదురుగా నిలపడతాడు.)

శా : (ఆశ్చర్యంగా) స్వామీ! మీరు చేస్తున్న పనేమిటి ?

బ్ర : డేగర్ నొక్కు. ఆగిపోయావేం ?

శా : హాయ్! భగవాన్! (పిస్టల్ క్రింద పారేసి ఏడుస్తూ లోపల కెళ్ళిపోతుంది నాగేశ్వర్ నెమ్మదినెమ్మదిగా బయటకు వెళ్ళిపోతాడు)

## *13*

(మద్రాస్‌బీచి అంతాచీకటిగా ఉంటుంది. నారాయణ. ప్రభాకర్ ప్రవేశిస్తారు )

ప్ర : ఇదే వాడొచ్చే టైము. పని పూర్తిచేసి సముద్రంలోకి విసిరేద్దాం.

నా : ప్రభాకర్! నా శరీరం వణుకుతోంది. నే నేపనీ చెయ్యలేను.

ప్ర : అరె. ఇంతదూరం వచ్చి వెనక్కి వెడతానంటావు ? మనస్సును దృఢపర్చుకో. వాడు రాగానే చేతులువెనక్కి విరిచి కట్టేయటమే. 'బస్' అంతకంటె నువ్వేం చెయ్యక్కర్లేదు. మిగిలినదంతా నేను చూసుకుంటాను. ఆపనికూడ చెయ్యలేకపోతే అదికూడ నేనే చేస్తా! ఎల్లాగో అల్లాగ నువ్వో నేనో ఎవరో ఒకరు వాడికీ భూమ్మీద నూకల్లేకుండా చెయ్యాలి. లేకపోతే మనపని అడుక్కోవడమే. (టార్చివెలిగించి) చూడు, వాడొస్తున్నాడు. అల్లా పద, అక్కడ దాక్కుందాం. (ఇద్దరూ పక్కగా నక్కి కూర్చుంటారు)

(నాగేశ్వర్ తనలోతాను ఏదో మాట్లాడుకుంటూ ప్రవేశిస్తాడు)

నా : బ్రహ్మానంద్! నీ దెంత ఉదారబుద్ధి ? శారదపై నీ కధికారమున్నాకూడా నన్ను తీసుకోమని ఎంత త్యాగబుద్ధి చూపించావు! ఆమెపై నా కేవిధమైన అధికారమూ లేనప్పటికి ఆమెకోసం ఎన్నో తప్పుడు పనులు చేశాను. అబ్బ! బ్రహ్మానంద్! నిన్నెలా పొగడాలో అర్థం కావట్లేదు!

(ఇంతలో వెనకాలనుండి నారాయణ వచ్చి నాగేశ్వర్ చేతులు వెనక్కి విరుస్తాడు)

నా : ఎవరు ? (విడిపించుకునేందుకు ప్రయత్నిస్తాడు.)

ప్ర : (నాగేశ్వర్ నోరుమూస్తూ), మాట్లాడకు.

నా : హత్య – హత్య – రండి - రక్షించండి.

(ఇంతలో బ్రహ్మానంద్ ప్రవేశిస్తాడు)

బ్ర : నాగేశ్వర్! నువ్వా ? (ప్రభాకర్‌ను పట్టుకొని ఒక్కగుద్దు గుద్దుతాడు. ప్రభాకర్ బ్రహ్మానంద్‌ని విడిపించుకుని అతని భుజంమీద కత్తితో పొడుస్తాడు.)

బ్ర : అబ్బా! (మూలుగుతూ క్రిందపడిపోతాడు. ఇంతలో జనం పోగయి పోలీస్, పోలీస్, అని అరుస్తారు. నారాయణ నాగేశ్వర్‌ని విడిచి పారిపోతాడు. వాడి వెనకాలే ప్రభాకర్‌కూడా పరుగెత్తుతాడు)

నా : (బ్రహ్మానంద్ దగ్గరకు వెళ్ళి) బ్రహ్మానంద్ దెబ్బబాగా తగిలిందా ? (మెడదగ్గర రక్తంచూచి) అబ్బ ఎంత పెద్దగాయం.

బ్ర : నా కేం ఫరవాలేదు నాగేశ్వర్. నీవు బతికి బయటపడ్డావు. చాలా సంతోషంగా ఉంది.

## *14*

(బ్రహ్మానంద్ తన గదిలో మంచం మీద పడుకొని ఉంటాడు! గాయంమీద కట్టు కట్టబడి ఉంటుంది! అతనికి రెండు వైపులా నాగేశ్వర్, శారదలు నిలబడి ఉంటారు)

నా : (ఆదుర్దాగా) బ్రహ్మానంద్!

(బ్రహ్మానంద్ కొద్దిగా కళ్ళు తెరుస్తాడు )

శా : (ఖంగారుగా) ఎలా వుందండీ ?

బ్ర : బాగానే ఉంది. అబ్బా! (అంటూ గాయాన్ని తడుముకుంటాడు)

(ఇంతలో డాక్టర్ వస్తాడు!)

నా : అరుగో! డాక్టర్‌గారు వచ్చేశారు!

(డాక్టర్ బ్రహ్మానంద్‌ని స్టెతస్కోపుతో పరీక్షిస్తాడు)

నా : డాక్టరుగారూ! ప్రాణాని కేమీ మోసం లేదుగదా ?

డా : అబ్బే! ప్రాణాని కేమీ భయం లేదండీ! కట్టు కట్టేను! విశ్రాంతి చాలా అవసరం, వెళ్ళొస్తాను (వెళ్ళిపోతాడు)

శా : అమ్మయ్య!

నా : బ్రహ్మానంద్! నన్ను క్షమించవూ ? నీ అద్భుతమైన త్యాగం నాకు క్రొత్త జీవితాన్ని ప్రసాదించింది. చెల్లీ! శారదా! నీవుకూడా నన్ను క్షమించవూ ?

బ్ర : (నవ్వుతూ) శారద ఎందుకు క్షమించదు ? స్త్రీ హృదయం పువ్వుకంటె

కూడా కోమలమైనదని నీకు తెలియదా నాగేశ్వర్!

శా: ఒక్కొక్కప్పుడు రాయికంటె కూడా కఠినమైపోతుందని చెప్పరేం?

నా: ఆవిషయం చెప్పక్కర్లేదు చెల్లీ! నాకనుభవ మయిందిగా!

శా: అన్నయ్యా! ఇప్పుడొక షరతుమీద స్త్రీ యొక్క కోమలత్వం కూడా ఎలా ఉంటుందో చూడు!

నా: ఏమిటి?

(బ్రహ్మానంద్ శారదవైపు ప్రశ్నార్థకంగా చూస్తాడు)

శా: నాగేశ్వర్! మా లక్ష్మిని నువ్వు చూశావు కదూ?

నా: ఆ!

శా: నీవామెను భార్యగా స్వీకరించు!

నా: శారద చెప్పింది నీ కంగీకారమేనా బ్రహ్మానంద్?

బ్ర: నాకెందు కిష్టంలేదు? శుభస్య శీఘ్రం! అన్నా చెల్లెళ్ళిద్దరూ మొత్తానికి రాజీ పడ్డారన్నమాట! బలే! నాకు చాలా సంతోషంగా ఉంది! (నవ్వుతాడు)

(అందరూ నవ్వుతూ ఉండగా తెర)

సమాప్తము

# నాటక రచయితలకు ఒక క్రొత్త అవకాశం

చైనా మన దేశానికి చేసిన ద్రోహం బయటపడ్డతర్వాత ప్రజలలో కలిగిన నవచైతన్యం – ఇప్పటి మన దేశ రక్షణప్రయత్నంలో ప్రజానీకంపాత్ర – ప్రజాశికా కార్యక్రమంవల్ల నిజంగా కలుగుతున్న సాంఘిక సంచలనం – ఇవి ముఖ్యాంశాలుగా సూచించగల ఇతివృత్తంతో, రెండు గంటలలో ప్రదర్శించటానికి వీలైన తెలుగు రంగస్థల నాటకాలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యీ క్రింది బహుమతు లివ్వటానికి నిర్ణయించింది –

మొదటి బహుమతి......రూ. 1,000

రెండవ బహుమతి....... రూ. 500

మూడవ బహుమతి.......రూ. 300

రచనలు క్రొత్తవిగా వుండాలి ఇది వర కెక్కడా ప్రచురింపబడినవి గాని, ప్రదర్శింపబడినవి గాని పంప గూడదు. ఒక్కొక్క రచన మూడు ప్రతులు పంపాలి. అవి 1–9–1964 లోపుగా యీ దిగువ చిరునామాకు చేరాలి.

బహుమతి పొందిన నాటకాలమీద అన్ని హక్కులూ ప్రభుత్వానికే చెందుతవి.

డైరెక్టరు,
సమాచార పౌరసంబంధాల శాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,
హైదరాబాదు.

*

# దివ్యస్మృతి

★ కొల్లా శ్రీకృష్ణారావు

స్తవనీయ ప్రతిభావిశేష ! కవితా
  సాహిత్య కూలంకషా !
కవిలోకమ్ము భజింపఁ బండితులు కైం
  కర్యమ్ము గావింపఁ బ్రా
గ్భవ పుణ్యమ్మున యావదాంధ్రజన స
  త్కారమ్ము గైకొంటి నీ
కెవరయ్యా సరివారు ? తిక్కన వినా
  యీ యాంధ్రభూమండలిన్.

నిరుపమ భావసంపదలు
  నివ్వటిలం దగు క్షేత్రలక్ష్మిలో,
గురిసిన నిగ్గు లీ రయితు
  కోటికిఁ గొంగు పసిండి యయ్యె నీ
యొరవడిలోన నేఁడు చివు
  రొత్తిన కబ్బము లున్న వెన్నియో
నరస కవీంద్ర ! నీ కలము
  నం బువుఁదేనియ నింపు కొంటివా ?
పసువుల్ వాటి ప్రశంస కెక్కినది కా
  వ్య ప్రౌఢి మాంచాలలో
ఎరసిద్ధాశ్రమ వీధులం గపురముల్
  వాసించె నాంధ్రావనిన్
మురిపించెం బలనాటి నాగమ కథల్
  మోదమ్ము సేకూర్చె నీ
నిరవద్య స్థిర వీరభారత కథా
  నీకమ్ము లోకమ్మునన్.
తెలుఁగు పొలమ్ము నేఁటి కొక
  తెన్నున దున్నిన దివ్య కావ్య కృ
ద్ధలికులు లేరు పాపటము
  లై నవి వేవిలి నేల లెల్ల నీ
కల మను నాఁగటం దునిన
  గాలిఁ బయళ్ళను గూడ సత్కవీం
ద్రులు పయనించుచుందు రటఁ
  ద్రోవలఁ గన్నులు గోరగింపఁగన్.

పలుకు లవేల మా తెలుఁగు
  భాషకు వన్నె ఘటించు సత్కవీ
శుల సిరిబంతి వీవు నినుఁ
  జూచి పురా కవులం దలంతు రీ
తెలుఁగు లఖండ భారతిని
  దీరిచి దిద్దితి నీ కవిత్వపుం
బొలముల వాసనల్ విరియఁ
  బూచిన నవ్వలతాంత సంతతిన్.

  ప్రాంత క్రొత్తలఁ గల లోఁతు పాతు లెఱిఁగి
  పలుకు పలుకునఁ బియూష మొలుకు కృతులఁ
  దెలుఁగు కైతకు వన్నె చిన్నెలు ఘటించి
  భావి కవిశేఖరుల కొజ్జబంతి వైతి.
  తెలుఁగు బిడ్డల నెమ్మేను పులకరింపఁ
  గావ్యకన్యలఁ గడుపారఁ గన్న నిన్ను
  హాలము కలముల నిరుకేల నందికొనిన
  అమర కవి వని సేవించి రఖిల జనులు.

కమ్మని తెల్గుతల్లి చిర
  కాలము నోఁచిన నోముపండ ని
క్కమ్ముగఁ దేనె లూరు నుడి
  కారము దీరిచి తీవు, కాల గ
ర్భమ్మునఁ గన్నుమాసిన ప
  రాక్రమ శీలుల దివ్య చిత్ర రా
జమ్ముల జీవమూఁదితి ర
  సజ్ఞులు విజ్ఞులు ప్రస్తుతింపఁగన్.
భారత వర్ష వీరవిభ
  వమ్ముఁ గా పలనాటి గడ్డకుం
బేరు ప్రతిష్ఠలన్నిలువఁ
  బెట్టిన నీదు మహాకవిత్వ దీ
పారతి కంజలింపని జ
  గమ్ము యుగమ్మొక నుండఁబోదు నీ
హార మృణాల హీర రుచి
  రాఢ్యయశః పరిపూర్ణ దిక్తటా !
వెలివై పోయిన తెల్గు నానుడులు దీ
  పింపంగ జాతీయముల్
చిలుకంగల్గి యథార్థ మా విధుల పో
  షింపంగ ధర్మాకృతుల్
తెలుఁగుం బిడ్డల వీరగాథలను చి
  త్రింపంగ భాగ్యమ్ము నీ
వలనం జేకుఱె నంచు నెంచిరి కవి
  బ్రహ్మా ! నమోవాకముల్

★




పదిహేడవ శతాబ్దంలో బాబా ఉద్దీన్ అనే ముసల్మాన్ యాత్రికుడు మక్కా నుండి ఏడు కాఫీ గింజలను తీసుకొచ్చి, అభివృద్ధికి చిహ్నంగా వాటిని సంతానానికి యిచ్చాడు. దానితో భారతదేశంలో కాఫీ పెంపకం ప్రారంభమైందని ఒక ప్రతీతి. ఒకటిన్నర శతాబ్దం నుండి భారతదేశంలో కాఫీ తోటల పెంపకం పెరటిదొడ్లలో పెరిగే దిగువ స్థాయినుంచి పంటతోటల స్థాయికి పెరిగింది. 1890 ప్రాంతంలో కాఫీ తోటల పెంపకం శీఘ్రగతిని అభివృద్ధి చెందింది. ఆ రోజుల్లో పశ్చిమ తీరంనుంచి ఏటా ఓడలమీద ఎగుమతి అయిన కాఫీ గింజలు 30,000 టన్నులు వుండేవి. ఈ స్థాయి యిప్పటి స్థాయినికూడా మించివుంది.

## ప్రస్తుతం భారత దేశంలోని కాఫీ గింజల ఉత్పత్తి

భారతదేశంలో ప్రస్తుతం సుమారు మూడులక్షల ఎకరాలలో కాఫీ తోటలు పెంచబడుతున్నాయి. ఇది, ప్రపంచమంతటా పెంచబడుతున్న కాఫీ తోటల వైశాల్యంలో 2 శాతం వుంది. చిన్నా, పెద్దా, మధ్యరకం పెంపకందారులు సుమారు 4600 మంది వీటిని ముఖ్యంగా మైసూరు, మద్రాసు, కేరళ రాష్ట్రాలలో పండిస్తున్నారు.

ఈ దేశంలో కాఫీ గింజల ఉత్పత్తి గత రెండు దశాబ్దాలనుండి స్థిరమైన పెరుగుదలను సూచిస్తున్నది. యుద్ధానికి ముందు భారతదేశంలో ఉత్పత్తి స్థాయి 15,000 టన్నుల నుంచి 1958 నాటికి 22,000 టన్నులకు పెరిగింది. ఆ తర్వాత యింకా యిది పెరిగి, యీ నాటికి సుమారు 60,000 టన్నుల స్థాయికి చేరుకుంది.

యుద్ధానంతర కాలంలో విదేశీమారక ద్రవ్యాన్ని సంపాదించి పెట్టేదానిగా కాఫీ ప్రధాన స్థానాన్ని ఆక్రమించుకుంది. ప్రస్తుతం 30-35 వేల టన్నులు గృహావసరాలకు వినియోగించగా, దేశానికి చాలగా మిగిలినది ఎగుమతి చేయడం జరుగుతున్నది. ఎగుమతులవల్ల ఏటా సుమారు 6-8 కోట్ల రూపాయల విలువగల విదేశీ మారకద్రవ్యం లభిస్తున్నది.

## భవిష్యత్తులో అభివృద్ధి

ఎగుమతి ఉత్పత్తి ఉద్యమం ఫలితంగా, ప్రతియేటా మన విదేశీ మారకద్రవ్యానికి అదనంగా 10 కోట్ల రూపాయల్ని చేర్చే ఉద్దేశ్యంతో ప్రస్తుత ప్రణాళికాంతానికి మన దేశంలో కాఫీ గింజల ఉత్పత్తిని 80,000 టన్నులకు పెంచాలని ఉద్దేశించబడింది. పై ధ్యేయాన్ని సాధించటానికిగాను అదనంగా 50,000 ఎకరాల నేలను సాగులోకి తీసుకురావాలని ఉద్దేశించబడింది.

మరింతగా కాఫీతోటల పెంపకానికై ప్రస్తుతం సక్రమంగా వినియోగింపబడని అడవులను, యితర భూభాగాన్నీ; ఎకరాకు సరియైన దిగుబడిరాని పంట భూమినీ యివ్వవలసిందిగా కాఫీతోటలు వేయడానికి వీలయిన కొండచరియలు, లోయలు గల నాలుగు దక్షిణ భారత రాష్ట్రాలలోని వారినీ; భారత ప్రభుత్వ వాణిజ్య, పరిశ్రమల మంత్రి శ్రీ మనూభాయ్‌షా బెంగుళూరులో కాఫీబోర్డు భవనాలకు ప్రారంభోత్సవం చేస్తూ విజ్ఞప్తి చేశారు.

ఇందుకు అవసరమయ్యే అన్ని విధాలైన ఆర్థిక సహాయాన్ని, యితర రకాల సహాయాన్ని ఏ విధమైన ప్రత్యేకింపులు లేకుండా యివ్వడానికి భారత ప్రభుత్వం తరఫున వాగ్దానం చేశారు. ఉచితమైన రేట్లకు తక్కువగా ధరను నిర్ణయించే విషయంలో కాఫీతోటల పెంపకందారుల భయాలను తొలగించడానికి, అధికోత్పత్తి కారణంగా పెంపకం దారులకు సంభవించే నష్టాన్ని తప్పించడానికి అవసరమైతే ప్రభుత్వం సరసమైన ధర హామీ పథకాన్ని గూర్చి ఆలోచించడానికి సిద్ధంగా వుందని మంత్రి అన్నారు.

## ఆంధ్రప్రదేశ్‌లో ఆరంభం

1960 లో మరో సభ్యుడు, భారతదేశపు కాఫీకుటుంబంలోకి వచ్చి చేరాడు. గోదావరి సైకతాలను తాకుతూ, కృష్ణవేణమ్మ కురులను స్పృశిస్తూవుండే తూర్పు కనుమలు ఆంధ్రప్రదేశ్‌లో కాఫీతోటలకు స్వస్థలాలయ్యాయి. ఈ తోటల పెంపకందార్లు ఆంధ్రప్రదేశ్ అటవీశాఖ. దీనిలో పాల్గొనే వారు తూర్పు గోదావరి, విశాఖ జిల్లాల ఏజన్సీ ప్రాంతాలలోని రంప, గోలుకొండలలో నివసించే మోటురకం గిరిజనులు. ఏజన్సీ ప్రాంతాలలోని గిరిజనుల సాంఘిక, ఆర్థిక స్థితిగతులను చక్కబరచడానికి 1960 లో కాఫీ పథకం ఆలోచించబడి, నిర్వహించబడి, అభివృద్ధిపరచబడింది.

ఇక్కడ అరవై ఏళ్ళ క్రితం కొన్ని పాశ్చాత్య మిషనరీలు కాఫీ తోటల్ని మొదటిసారిగా వేశాయిగాని, వీటి ప్రయత్నాలు ఫలవంతం కాలేదు. 1960 వరకు మళ్ళీ వీటిని పెంచాలనే గట్టి ప్రయత్న మేమీ జరగలేదు. 1960 సంవత్సరం ఒక సరికొత్త వాణిజ్యానికి ప్రతినిధి. గిరిజనుల ఆర్థిక స్థితికి ఒక వరం. ఆంధ్రప్రదేశ్‌కు గర్వకారణం. ఈనాడు మనకు మారేడుమల్లి, చింతపల్లి, మినుములూరు, అనంతగిరి, వంగసార అనే అయిదు కేంద్రాలలో మొత్తం 400 ఎకరాలలో కాఫీతోటలు వున్నాయి. 1961 లో 170 ఎకరాల్లోను, 1962 లో 130 ఎకరాల్లోను, 1963 లో 100 ఎకరాల్లోను కాఫీతోటలు నాటబడ్డాయి.

## నేల అనుకూలత

కాఫీతోటలను పెద్ద ఎత్తున వేయడానికి గల సాంకేతికమైన అవకాశాలను తెలుసుకోవడానికై విశాఖ, తూర్పు గోదావరి జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాలలో, కాఫీబోర్డు సీనియర్ లైజాన్ అధికారి శ్రీ డబ్ల్యు. రాఘవేంద్రరావు 1959 లో పరిశీలన ప్రారంభించడంతో ఆంధ్రప్రదేశ్‌లో యీ కార్యక్రమం పెద్ద ఎత్తున ప్రారంభమైంది.

విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాల్లో 2,500 అ॥ నుండి 3,400 అ॥ ఎత్తుగల కొండ లున్నాయి. ఏటా యిక్కడ 60"-70" వర్షపాతం వుంటుంది. వర్షానికి తడిసి, ఎండకు ఎండే యీ 2,800 చ. మైళ్ళ కొండప్రాంతం కాఫీతోటల పెంపకానికి చాలా అనువైన ప్రదేశం అని తేలింది. ఏడాదికి సగటు గరిష్ఠ ఉష్ణోగ్రత 81.99° ఫా. నుండి 92.6° ఫా. మధ్యవుండి, ఏడాదికి సగటు కనిష్ట ఉష్ణోగ్రత 54.9° ఫా. నుండి 65.9° ఫా. మధ్య వుండి భూమధ్య రేఖ పరిధిలో వున్న యీ ప్రదేశాన్ని, భారత దేశంలో కాఫీతోటలు పెంచబడే ఏ యితర ప్రాంతాలతో నన్నా పోల్చవచ్చు.

సాధారణంగా ఇక్కడి నేల లోతుగా వుండి, గుళ్ళుబారిన బంకమన్ను కలది. కాఫీతోటల పెంపకానికి యీ నేల చాలా అనువైనది. వర్షాకాలపు భారీ వర్షాలకు తోడు వేసవి వర్షాలు (తొలకరి వర్షాలు) సమృద్ధిగా కురవడం వల్ల యీ ప్రాంతంలో కాఫీతోటల పెంపకంలో విజయానికి ఏమాత్రం సందేహం వుండబోదు.

## గిరిజనుల ఆర్థికాభివృద్ధి

ఈ ప్రాంతాలలో కాఫీతోటల్ని పెంచే ప్రణాళికను ప్రారంభించడంలో ముఖ్యమైన కారణాలు రెండు వున్నాయి. ప్రసిద్ధికెక్కిన రంప ఏజన్సీతోసహా యీ ప్రాంతం—అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో తిరుగుబాటు జరిగిన ప్రాంతం—ఆర్థికంగా వెనుకబడిన, సాంఘికంగా అస్థిరమైన గిరిజనానికి నివాసస్థలం. మన యీ మారుమూలల్లోని గిరిజనులకు ఉద్యోగావకాశాలను కల్పించి వారి జీవనస్థాయిని మెరుగుపరచడానికి రూపొందించినదిగా యీ పథకం అద్వితీయమైన విలువగలది. 100 ఎకరాల ప్రతి కాఫీతోటల యూనిట్టుకు, అందులోని వివిధ పనులకై ఏడాదికి కనీసం 75 మంది పనివారు కావలసివుంటారు. అందుచేత కాఫీతోటల పెంపకానికి సంబంధించిన పథకాలు ఎక్కువ ఉద్యోగావకాశాలను కల్పిస్తాయి. ఉద్యోగావకాశాల్ని కల్పించడమేకాదు, వ్యక్తిగతమైన ఆదాయం రెండునుంచి మూడురెట్లవరకు పెరుగుతుంది. ముందుముందు బీద గిరిజన వ్యవసాయదారుని జీవనస్థాయి పెరగడానికి యిది కారణ మవుతుం దనవచ్చు. ఆర్థికమైన లాభాలకు తోడు చక్కటి నివాస గృహాలు, పరిశుభ్రమైన మంచి నీరు, యింకా యితర శానిటరీ సౌకర్యాలు కల్పించబడతాయి.

## భూసార రక్షణ

కాఫీతోటను వేయడం అంటే ఎకరానికి 600 నుండి 900 కాఫీ మొక్కల్ని, వాటికితోడు పై సంఖ్యలో నాలుగోవంతు నీడనిచ్చే మొక్కల్ని కలిపి నాటడం అన్నమాట. దిన్నెలుగా ఏర్పరచడంవల్ల, భూమిపై పారే నీటి ప్రవాహాన్ని బాగా ఆపుతుంది. మొక్క పైగుబురు, వర్షం తిన్నగా నేలమీద పడనీకుండా ఆపడమే గాక, వ్రేళ్ళతో మట్టికణాల్ని బిగించి పట్టుకుంటుందికూడా. ఈలాంటి పరిస్థితుల్లో మట్టికణాలు పట్టువిడిచి, నీళ్ళల్లో కొట్టుకుపోవడానికి వీలులేదు. ఈ విధంగా భూసారం కొట్టుకుపోకుండా పరిరక్షింపబడుతున్నది.

మరికాస్త ముందుకు వెళ్ళి; పోడు వ్యవసాయం జరిగే ప్రాంతంలోని భూసారం తగ్గి, పనికిరాకుండా తయారయిన భూములు కాఫీ తోటల పెంపకం వల్ల తిరిగి సేద్య యోగ్యంగా మారతాయి అని మనం చెప్పవచ్చు. నీడకొరకై వేసిన మొక్కల ఆకులలములు ఏటా క్రిందబడి, భూమిలో కుళ్ళి, రసాయనిక మార్పులు చెంది, ఎరువై భూమిని తిరిగి సారవంతం చేయడానికి తోడ్పడతాయి. నిజానికి యీ చర్య అతి నెమ్మదిగా జరుగుతుందని, భూమి తిరిగి సారవంతం కావ

డానికి దశాబ్దాలు కూడా పడుతుందని వొప్పుకోక తప్పదు. కాని, 'పోడు' వ్యవసాయంవల్ల సారం తగ్గిపోయిన భూములను తిరిగి సారవంతం చేయడానికి యీ పరిస్థితుల్లో యిదొక్కటే మార్గం అనే విషయం మర్చిపోకూడదు.

### కాఫీతోటల ఆదాయం

నాటిన మూడేళ్లకు కాఫీమొక్క పంటకొస్తుంది. ఈ మధ్యకాలంలో సాగు పనులకుగాను ఎకరానికి రూ. 1500 నుండి 2000 వరకు అవసరమౌతాయి. నాలుగవపట, అయిదవపట ఎకరాకు కొద్దిగా తక్కువ దిగుబడి — అంటే 4–6 హం.వె. రాలుతుంది. ఆతర్వాత ఎకరాకు దిగుబడి స్థిర పెరుగుదలను సూచిస్తుంది. ఎనిమిదవపటనుండి, కొమ్మలు బాగా విస్తరించాక, సగటున ఎకరాకు 8–10 హం. వె. వరకు దిగుబడి రావచ్చు. ప్రస్తుతపు ధరలప్రకారం ప్రతి హం.వె. కాఫీ గింజలకు రూ. 150 నుండి 180 వరకు ఆదాయం వస్తుంది. నాలుగోపటనుండి సాగుకింద రికరింగ్ ఛార్జీలు రూ. 500 నుండి 700 వరకు అవుతాయి అసలు ఆదాయం ఎకరాకు రూ. 300–800 మధ్య వుంటుంది. ఈ విధమైన లాభదాయకమైన దిగుబడులు, జాగ్రత్తగా సేద్యం చేసినప్పుడూ, సక్రమమైన యాజమాన్యం వున్నప్పుడు మాత్రమే లభిస్తాయనే విషయం గుర్తించుకోవాలి.

### ఆంధ్రప్రదేశ్‌లో కాఫీగింజల ఉత్పత్తి

1961 జూలై నెలలో 170 ఎకరాలలో కాఫీ గింజల్ని నాటగా 1963 ఏప్రిలులో మొక్కలు కాపు కొచ్చాయి. ఇటీవలే కోసిన తాజాపంట 6 టన్నుల శుభ్రం చేయబడిన కాఫీ గింజలు అని దిగుబడి లెక్కలనుబట్టి తెలిసింది. వచ్చే ఏడాది పంటదిగుబడి చాలా ఆశాజనకంగా కనిపిస్తున్నది. సుమారు 2 లక్షల రూపాయలు విలువచేసే 60 టన్నుల పంట దిగుబడి కావచ్చు. పై పథకం క్రింద 400 ఎకరాలలోనూ వేసిన తోటలు మరో నాలుగు సంవత్సరాల తర్వాత పూర్తి ఫలసాయాన్నిస్తాయి. ఆనాడు 160 టన్నుల కాఫీ గింజలు లభించవచ్చు. దీనివల్ల వచ్చే ఆదాయం ఏటా రూ. 5.12 లక్షలు వుంటుంది. పైపంట పోషణకు సంవత్సరానికి 3–3 50 లక్షల రూపాయలు అవసర మౌతాయి.

1963 జనవరిలో యీ కాఫీ తోటల్ని సందర్శించిన కాఫీ బోర్డు డైరెక్టరు డా ఎన్. సి. చొక్కన్న యీ గుబురుల్ని చూసి, వీటి కాపుదల శక్తిని ఎంతగానో మెచ్చుకున్నారు. ఈ ప్రాజెక్టు కేంద్రాలలోని కాఫీ తోటలను పరిశీలించిన మీదట ఈ రాష్ట్రంలో కాఫీ తోటలకు మంచి భవిష్యత్తు వుందని అభిప్రాయపడ్డారు.

1963 సెప్టెంబరులో దక్షిణభారతానికి సంబంధించిన యునైటెడ్ ప్లాంటర్స్ అసోసియేషన్ వారిని ఉద్దేశిస్తూ కాఫీ బోర్డు ఛైర్మను శ్రీ హెచ్. సీతారామ రెడ్డి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని కాఫీ తోటలను గురించి యీ విధంగా అన్నారు.

"ఆంధ్రప్రదేశ్‌లో కాఫీ మొక్కల్ని పండించే కొద్దిపాటి ప్రాంతాన్ని యిటీవలే నేను చూడ్డం తటస్థించింది. ఈ మొక్కల పుష్టి, ఏపుగా ఎదుగుతున్న తీరు చూస్తే, ఈ ప్రాంతంలో కాఫీ తోటల పెంపకానికి చాలా అవకాశా లున్నా యనిపించింది" ఈ విధంగా మన రాష్ట్రంలో కాఫీ తోటలు మొలకెత్తాయి. ఇది విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదించి పెట్టేది మాత్రమే కాదు, మన గిరిజనుల ఆర్థిక స్వరూపాన్ని మెరుగుపరచేది కూడా. ★

---

## ప్రభుత్వ నిర్ణయాలు

- రాష్ట్ర గిడ్డంగి కార్పొరేషనులో వాటా డబ్బుక్రింద రూ 2. లక్షలు పెట్టుబడి పెట్టడంజరిగింది.
- ఎరువుల కొనుగోలుకుగాను మనిషికొక్కంటికి రు 250 మించకుండా హామీ లేని విధంగా ఋణాలను సభ్యులు కానివారికి మంజూరుచేయడానికై రూ. 5 కోట్లను ప్రాథమిక సహకార సంఘాల అధ్వర్యంలో వుంచడం జరిగింది. ఇది తీవ్ర ఎరువులపథకం క్రింద వివిధ విధాలుగా, యింతకుపూర్వమే ప్రాథమిక సహకార సంఘాల సభ్యుల అధ్వర్యంలో వుంచిన రూ. 10.5 కోట్లకు అదనం. ఈ రూ. 10.5 కోట్లలో నాలుగోవంతు డబ్బును రసాయనిక ఎరువుల రూపంలో ఋణంగా యివ్వడం జరిగింది.

29_3_1964 తేదీన ఇరాక్ అధ్యక్షుడు ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రత్యేక స్నాతకోత్సవంలో తనకు గౌరవబిరుదు యివ్వబడినప్పుడు ప్రసంగిస్తున్న దృశ్యం.



హైదరాబాదులో ఏప్రిలు 14 వ తేదీన అఖిలభారత ఎన్. సి. సి సీనియరు అధికారుల పునశ్చరణ కోర్సుకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం.



23–3–1964 తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేసిన ఎర్రగడ్డలోని 150 పడకలుగల కార్మికుల ప్రభుత్వ భీమా వైద్యశాల.

కేంద్ర విద్యామంత్రి శ్రీ ఎమ్. సి. చాగ్లా ఏప్రిలు 4 వ తేదీన హైదరాబాదులోని ప్రాంతీయ పరిశోధనా లేబరేటరీని సందర్శిస్తున్నదృశ్యం.



ఆంధ్రప్రదేశ్ అటవీశాఖామంత్రి శ్రీ ఎ. బలరామరెడ్డి కాఫీ తోటలోని కాఫీకాయలను పరిశీలిస్తున్న దృశ్యం.

కేంద్ర వ్యవసాయమంత్రి డా॥ రామసుభాగ్ సింగ్ హైదరాబాదులో 21-3-1964 వ తేదీన క్రొత్త డెయిరీ భవనానికి శంకుస్థాపనచేశారు



ఎనమండుగురు పిల్లలను రక్షించిన స్త్రీ: నిజామాబాదు జిల్లా రెయినంపల్లి గ్రామంలో జనవరి 23 వ తేదీన కాలుతున్న మంటల్లోంచి ఎనమండుగురు పాఠశాలలకు వెళ్ళేపిల్లలను రక్షించిన శ్రీమతి సత్తవ్వ (పూలమాల ధరించిన స్త్రీ). ఈ మంటల్లోనుంచి మరొక కుర్రవాడినికూడా బయటికి తీసుకొచ్చిందిగాని, ఆ కుర్రవాడు గాయాలవల్ల బ్రతకలేదు. మార్చి 27 వ తేదీన ఆ గ్రామంలో జరిగిన ఒక సమావేశంలో శ్రీమతి సత్తవ్వ సాహసాన్ని కొనియాడటం జరిగింది. ప్రభుత్వం తరఫున రూ. 500 లు, సాంఘిక కార్యక్రమాల ఇండియన్ కాన్ఫరెన్సు తరఫున రూ. 501 లు బహుమతిగా ఆమెకు ఇవ్వడం జరిగింది.

★

# పదినముత్యాలు

కర్ణునికంటె దాత, రతికాంతునికంటెను రమ్యమూర్తి, సౌ
వర్ణునికంటె వీరుఁడు, ప్రభాకరుకంటెఁ బ్రతాపశాలి, దృ
క్కర్ణకులారినాయకునికంటెను సత్త్వసముగ్రుఁడంద్రు సం
పూర్ణవితీర్ణి మంత్రిజనపుంగవు సిద్ధయతమ్ముఁ గొమ్మనిన్.

దేవా మున్ను సమస్తభూపతులలోఁ దేజోగరిష్ఠుండవై
యీవింధ్యాచలఘోరకాననమునందిట్లుంగి నీయున్కియున్
దైవాధీనము గాన దీనికి విషాదం బందఁగా నేల యం
భోవాహంబులయట్లు సంపదలొగింబుట్టుంజెడున్
మాత్రలోన్.

విప్రకుమారుఁ డీతఁడు ప్రవీణుఁడు విద్యలఁ బల్కునేర్పుమై
నప్రతిమానుఁ డాహవవిహారములందు సమర్థుఁ డాత్మశ
క్తిప్రకటీకృతిం గొరలి దేశము లెల్లఁ జరింపుచుండుఁ బూ
జాప్రతిపత్తిపాత్రముగఁ జాలెడువాఁడు పయోజలోచనా

ప్రాసాదోపరి రమ్య భాగమున సాంద్రంబైనచంద్రాతప
శ్రీసౌధామలదీప్తులం జెనయఁగా జిత్తోద్భవక్రీడ న
న్యాసంగంబున డస్సిమీరు సుఖనిద్రాయత్తులై యున్నచో
రోసం బెక్కినవీర శేఖరుఁడు నీరూపం బొగిం జూచుచున్.

కోమలిపూర్వజన్మమున క్రూరపుఁ జెయ్వులుపామురూపమై
యేమరియున్నఁ బట్టికొనియెం దలపోయఁగ నిక్కువంబు నీ
స్వామి గతాసుఁడయ్యెఁ బురసంహరుఁడైనఁ బురా
కృతంబులం
దా మిగులంగ నేర్చునె వృథారుధిరంబులు దక్కుమిక్కడన్.

వణిజులు తప్పుచేసినను వారలఁ దండువ పెట్టఁబంచి త
న్మణికనకాదివస్తువులు మానుగఁ గైకొని వీటిలో సువ్యా
ద్గణములఁ బొందకుండ నెడగా నువందగుఁ గాక వారు దు
ర్గుణుఁ ని మేదినీశ్వరుఁడు గోపమునం దెగఁజూడఁ బాడియే.

పరదారాభినివేశబుద్ధి దలఁపం బాపంబు ధర్మార్థముల్
దొరకొల్పంగ నుపాయమైన నది నిర్దోషంబు నాఁడొల్లి బం
ధుర శాస్త్రజ్ఞులచేత విందు గురుబంధుక్లేశ మోక్షార్థికిం
దురితంబయ్యెడు నెట్లుచిత్తమున నాందోలాయితం బేటికిన్.

అల్లుఁడవీవు రాజ్యమున కంతకు నర్హుఁడ వీవు భూమికిం
దల్లివి దండ్రివిన్ బహువిధంబుల దాతవు నీవు మా కులం
బెల్ల సముద్ధరింప నుదయించినపుణ్యుఁడ వీవు నీకు నే
నెల్లి మదీయపుత్రిఁ బురమెల్ల నెఱుంగఁగఁ బెండ్లిసేసెదన్.

కానక కన్నకూఁతుం గడు గారవ మొప్పఁగ నేన దాదినై
యేన పవిత్రినై పెనిచి యిచ్చితి నొక్కట వేదశాస్త్రవి
ద్యానిధియైన విప్రునకు నాతఁడు పెండిలియాడి పోయె నా
గ్గేనుసమంబులై మగుడ నెన్నఁడు రాఁడది కారణంబుగన్.

తల్లి ప్రాణముతోడిచావు మగడుం దవ్వైన నిల్లాలికిన్
తల్లిం దండ్రిని జేరి యున్కిదలఁపం దైన్యంబు నాథర్తని
న్నొల్లంబొమ్మనిత్రోచెఁ బ్రాణవిరహోద్యోగతుమంబందె నా
యల్లంబింతులు వొందరే పరులదైవోపేతుఁ జింతిల్లరే.

నృప నయహీనుఁడైన ధరణీపతి రాజ్యవిభూతి చూడఁగా
నపగతవాత వారణకమైన యెడ న్వెలుఁగొందు దీప రే
ఖపగిది నిప్పుడప్పుడనఁగా జలితస్థితి నుండి నీతిపా
రపరమనస్కుఁడైన నృపు రాజ్యముసుస్థితిఁబొందు నారయన్.

రాజ్యమరాజకం బయినఁ బ్రౌఢిమెయిం భరియింప నుత్తమ
ప్రాజ్యునకైన దుష్కరమ యట్లగుటం దమలోన నెంతయుం
సజ్యతనీతి విక్రమ విచారపరంపర పుట్టుచున్నచోఁ
బూజ్యపురస్సరంబుగఁ బ్రభుప్రతతిం బిలిపించి వారితోన్.

కేతన—దశకుమార చరిత్ర.

నతనానావని నాథయూథమకుటన్యస్తాబ్జరాగోజ్జ్వల
ద్యుతివిభ్రాజితపాదపీఠు లలనాదోశ్చామరోద్ధూతమా
రుతలోలాలివినీలకుంతలుఁ బ్రభాభుగ్గాముఁ గేయూరశో
భితబాహాపరిఘున్ సువర్ణధరణీభృద్ధైర్య దుర్యోధనున్.

తృష్ణాతంతునిబద్ధబుద్ధులగు రాధేయాదులం గూడి శ్రీ
కృష్ణుం గేవలమర్త్యుఁగాఁ దలచి మర్దింపంగ నుత్సాహవ
ద్ధిష్ణుండయ్యె సుయోధనుం డకట ధాత్రీనాథ
యూహింపుమా
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె మదవ్యాఘ్రోగ్ర శుండాలమున్.

తాలాంకుతుముల సమర
క్రీడకుఁ దాళఁగలవాఁడు క్షితిలోపల నె
వ్వాఁడును లేఁ డని యుండకు
నీదగ్గర నున్నవాఁడ నే సెలవిమ్మా
ధర్మతనయ యుష్మదాజ్ఞానిగళవిని
బద్ధమగుచుఁ జిక్కువడియెఁ గాక
విజయమత్తగజము విడివడ్డచో నడ్డ
పాటుగలదె విష్టత్రయమున.

శ్రీకంఠుఁ డెదురునపుడు వ
నౌకోధ్వజ మింద్రమకుట మర్జునతురగా
నీకము దివ్యశతాంగము
నా కవ్వడి కబ్బియున్న నతఁడేమగునో.

ఆ కర్ణదురాలాపము
లాకర్ణింపఁగ నసహ్యమై ద్రోణునితో
నాకనదీసుతుఁ డనియె వ
నౌకోధ్వజ మెఱుఁగవచ్చు నరుఁజూపి తగన్.

పదిదినము లైదుప్రొద్దులు
పదంపడి రెన్నాళ్ళు నొక్కపగలున్ రేయన్
గదనంబుఁ జేసి మడిసిరి
నదిసుత గురుకర్ణశల్య నాగపురీశుల్.

ప్రణతాశేష వసుంధరాధిప శిరస్సిగ్గంధులుబ్ధిభ్రమ
స్వణదభ్ర భ్రమకృద్ద్విరేఫ గణఝుంకార ప్రదాబద్ధసం
ప్రణవత్యుత్ప్రిధిత ప్రవర్ధిత సమస్తక్షత్ర సూయాధ్వర
క్షణసింహాసన భాషితున్ దృఢధను శ్లాఘానుజున్ ధర్మజున్.

*అధర్వణుడు—భారతము*

ఉరగముచేతఁ జచ్చినతనూభవునిం గొని శోకవేదనా
పరవశయు న్వికీర్ణ కచభారయు నుద్గతబాష్పపూరయు
న్గరతల తాటి తాప్యయును గద్గదికావికలార్తనాదయు
న్జరణవిపర్యయాపగత సత్వరయానయునై పొఁడంబొరిన్.

అనలము ప్రజ్వలించివిహితాగమ తంత్రము లాచరించి పెం
పొనరఁగ మంత్రయుక్త మగుహోమము మున్నొనరించి
తుంబురుం
డనఘుఁడు సేయఁగాఁ గువలయాశ్వుఁడు పెండిలి
యయ్యెఁ బ్రీతిన
త్యనుపమ రూపయౌవన మదాలసమానస నమ్మదాలసన్.

క్షత్రాచారముఁదప్పఁద్రొక్కకుమురాజ్యశ్రీదలిర్పన్సుహృ
న్మిత్రవ్రాతముఁ బ్రోవు ముజ్జ్వలకృపాణివిస్ఫురత్పాణివై
శత్రుశ్రేణిజయింపు క్షోణిసురరక్షా ప్రౌఢిపాటింపు స
త్పాత్రత్యాగ మొనర్పుయజ్ఞములుపుత్త్రిసేయు మత్యు
న్నతిన్.

హిమగిరిదక్షిణంబున మునీశ్వర పొల్పగు భారతాఖ్యవ
ర్షమువిను కర్మభూమి యది సంతతము న్బహుపుణ్యపాపక
ర్మము లొనరించి యుద్దివిజమానవనారకతిర్యగాదిజ
న్మములను సౌకమోక్షములు మానుగఁబొందుదు రందున
న్నరుల్.

ఎక్కడనుండివచ్చె నతఁడీతుహినాద్రికి వేడ్కమాని? యే
నక్కట యక్కుమారు రుచిరాకృతి యాదట నేలచూచితిన్
మక్కువయేల నా కెమది మన్మథుఁ డేల సహించునన్ను? వాఁ
డెక్కడ వచ్చునింక? నది యేలపొసంగు? దురాశ యేటికిన్.

తేజస్స్ఫూర్తి దినాధినాథుఁడయి కాంతిం జందురుండై ప్రతా
పాజేయత్వమునం గృశానుఁడయి ఘోరైశ్వర్య
శౌర్యోన్నతిం
దాక్షిణ్యుండయి దర్పమొప్పఁగొనియెం దత్తత్పదమ్ముల్బల
భ్రాజిష్ణుం డసురేశ్వరుం డసురులుబ్బ న్లోకసంహారుఁడై.

అనుపమ దేగసత్త్వసముదంచిత వాహన వాహ్యమానకాం
చనరథచక్ర సంకషణ చారుసుమేరు నగేంద్రసాను సం
జనిత సువర్ణ రేణుచయ సంతతభూషిత దీప్తియైన యీ
దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్.

సిరపక్షంబున నాఁడునాఁటికిఁ గడుం జెన్నొందు శీతాంశు న
ట్లతి లావణ్యవిలాస భాసురతనుండై తల్లికిం దండ్రికి
న్నతతాహ్లాద మొనర్చుచుం బెరిగి యాచార్యోపదేశంబునం
జతురుం డయ్యె మరుత్తుఁడాగమముల న్శాస్త్రమ్ముల
న్విద్యలన్.

*మారన—మార్కండేయ పురాణము*

# భారత ప్రగతి

## ఉత్తరప్రదేశ్

యీ సంవత్సరం శీతాకాలం వర్షాలు తగినంతగా లేకపోవడం వల్లా, మంచువల్లా ఏర్పడిన తీవ్ర పరిస్థితిని ఎదుర్కోడానికి, నీటి పారుదల సౌకర్యం ఉన్న ప్రాంతాలలో అధికాహారోత్పత్తి ఉద్యమాన్ని రాష్ట్రమంతటా ఉత్తరప్రదేశ్ ప్రారంభించింది.

ఆహారధాన్యాలు, పశుగ్రాసం, కూరగాయల అధికోత్పత్తికి నిర్దేశించిన యీ పథకం విజయవంతం కావడానికి వీలుగా మార్చి 1 నుంచి జూన్ 15 వరకు సాగు చేసిన వేసవి పైర్లకు – చక్కెర మినహా – ప్రభుత్వం గొట్టపు బావులు, బందీలు, ఇతర నీటి పారుదల కేంద్ర నీటి తీరువాలో 66⅔శాతం సబ్సిడీ ఇవ్వాలని ప్రభుత్వం నిశ్చయించింది.

పెసర, శనగ, సావన్, మొక్కజొన్న, వరి వంటి తక్కువ కాలంలో పంటకు వచ్చే పైర్లకు కూడా యిది వర్తిస్తుంది.

### భూకమతాల ఏకీకరణ గడువు తగ్గింపు

1960–61 ఆఖరులో ఎకరాకు రు12.39 న. పై. ఉన్న భూకమతాల ఏకీకరణ ఖర్చును 1963 ఆఖరులో ఎకరాకు రు 10.38. న. పై.లకు తగ్గించారు. యీ పథకం క్రింద ఉన్న వివిధ కార్యక్రమాలను సమన్వయించిన కారణంగా తహసీలులో భూకమతాల ఏకీకరణ కార్యక్రమాన్ని పూర్తిచేసే గడువును 40 నెలలనుంచి 33 నెలలకు తగ్గించారు. రాష్ట్ర భూకమతాల ఏకీకరణ సలహా సంఘం సమావేశంలో యీ విషయాన్ని వెల్లడించారు.

### జవానుల కుటుంబాలకు సహాయం

ఉత్తరప్రదేశ్ రాష్ట్ర పౌరమండలి, డిసెంబరు 31వ తేదీతో అంతమైన గత సంవత్సరంలో జవానుల కుటుంబాలకు రు 2,19,150/ల ఆర్థిక సహాయం చేసింది. రు 950/ల ఖర్చుతో వికలాంగులైన సైనికులకు బహుమతులు ప్రదానంచేశారు.

### కాన్పూరుకు క్రొత్త విద్యుచ్ఛక్తి కేంద్రం

కాన్పూరులో 64 యం. డబ్లు. థర్మల్ పవర్ స్టేషన్ నెలకొల్పే ప్రతిపాదనను ఉత్తరప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తిబోర్డు ఆమోదించింది. రు 6.81 కోట్లు ఖర్చు కాగల యీ స్టేషన్ నిర్మాణం 1965–66 ఆఖరువరకు పూర్తి కాగలదని అంచనా. కాన్పూరు ప్రాంతంలోని విద్యుచ్ఛక్తి అవసరాలను యీక్రొత్త స్టేషన్ పూర్తి చేస్తుంది అంతేగాక కాన్పూరు – మొగల్ సరాయల మధ్య ట్రాక్ విద్యుదీకరణకు రైల్వేలకు యీ స్టేషన్ విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తుంది.

### గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి

రాష్ట్రంలో గ్రామీణ పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి వీలుగా యు. పి. ఖాదీ, గ్రామీణ పరిశ్రమల మండలి, 39 సహకార సంఘాలకు రు2,12,322/ల ఆర్థిక సహాయాన్ని చేసింది. ఖాదీ పరిశ్రమను అభివృద్ధి చేయడానికి మరో 8 సంస్థలకు రు 16000/లను ఇచ్చింది. ఖాదీ ఉత్పత్తులు, ఖాదీ ఉత్పత్తి పద్ధతులు, గ్రామీణ పరిశ్రమలను గూర్చి ప్రజాబాహుళ్యంలో ప్రచారం చేయడానికి రు 15000/లు మంజూరు చేసింది.

### రాష్ట్ర విద్యా సంస్థ

ఎలిమెంటరీ విద్యాభివృద్ధికై అలహాబాదులో ప్రభుత్వ విద్యాసంస్థను నెలకొల్పుతారు. ఉపాధ్యాయు– విద్యాధికులకు పరిశీలక సిబ్బందికీ సర్వీసు శిక్షణ, బోధనా విధానాలలో పరిశోధన, విస్తరణ కార్యక్రమాల నిర్వహణ, ఎలిమెంటరీ ఉపాధ్యాయ శిక్షణ సంస్థల పరిశీలన మొదలైన విషయాలను యీ సంస్థ నిర్వహిస్తుంది.

### పాఠశాల గ్రంథాలయాల అభివృద్ధి

రాష్ట్రంలోని 73 సహాయక హయ్యర్ సెకండరీ పాఠశాలలు తమ విద్యార్థులకు గ్రంథాలయ సౌకర్యాలు కలిగించడానికి వీలుగా రు 2.00 లక్షలు ఇవ్వడం జరిగింది. యీ సహాయం లభించిన పాఠశాలలో 14 బాలికా పాఠశాలలు మిగతా బాలల పాఠశాలలు ఉన్నాయి.

### ఉపాధ్యాయినులకు గృహ వసతి

రాష్ట్రంలో గ్రామీణ ప్రాంతాలలోని సీనియర్ బేసిక్ పాఠశాలల ఉపాధ్యాయి

నులకు గ్రహవసతి కల్పించడానికి 60గృహాలను నిర్మించాలని ప్రతిపాదించారు. దీనికై రు 1,50,000/లు మంజూరు చేశారు.

## బెట్వానదిపై వంతెన

ఒర్సా రైలు బ్రిడ్జికి 1,200 అడుగుల దిగువన ప్రవాహంవైపు ఝాన్సీ-హర్పాల్ పూర్ రోడుమీద ఝాన్సీకి తొమ్మిదిమైళ్ళ దూరంలో బెట్వానదిమీద 1 849 అడుగుల పొడవు కాంక్రీటుస్తంభాల వంతెన నిర్మాణం అనుకున్న సమయంకన్నా 5 నెలల ముదుగా వచ్చే అక్టోబరుకు పూర్తవుతుంది. వంతెన నిర్మాణం 80 అడుగుల మేరకు అప్పుడే పూర్తయింది. ఇంచుమించు అన్ని స్తంభాలను బిగించడం జరిగింది. వంతెన పైస్వరూప నిర్మాణం నెలకు 200 అడుగుల చొప్పున సాగుతున్నది.

పని పూర్తయితే ఈ వంతెన నిర్మాణానికి అయినఖర్చు- వంతెనదగ్గరకు వేసిన బాట, యితర పనులకు అయిన ఖర్చుతో సహా-సుమారు రూ 31.40 లక్షలు వుంటుంది.

## కనుపించని జవాన్ల కుటుంబాలకు రక్షణ చర్యలు

కాశ్మీరులో యుద్ధవిరమణ రేఖవద్ద డ్యూటీపై వుంచబడిన ఉత్తరప్రదేశ్ రాష్ట్ర పి. ఎ. సి. జవాన్ల తాలూకు 23 కుటుంబాలకు రూ 5,600లను ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రజామండలి మంజూరు చేసింది. ఈ పి. ఎ.సి. జవాన్లను పాకిస్తాను సాయుధ బలాలు తీసుకు పోయాయి. ఈ జవాన్లు కనుపించడం లేదు. అత్యవసర సహాయం క్రింద ఒక్కొక్క కుటుంబానికి రూ. 200లు యివ్వడం జరిగింది.

## రక్షణకు సంబంధించిన వ్యక్తులకు జీతంనుండి సడలింపు

రక్షణ సేవలకు సంబంధించిన వారి పిల్లలు, వారు ఒకసారి పరిక్ష తప్పినా సరే జీతం చెల్లింపు, డి. ఎ. ఫీజు చెల్లింపుల నుండి సడలించ బడతారని రాష్ట్రప్రభుత్వం ఒక ఉత్తరువు జారీ చేసింది.

సాంవత్సరిక పరీక్షల్లో తప్పిన విద్యార్థులకు జీతం, యితర ఫీజులలో రాయితీ సౌకర్యాలు కల్పించడం జరుగడంలేదు.

## ధరసుకు జల విద్యుత్పథకం

హృషీకేశానికి 77మైళ్ళదూరంలో ప్రధాన హృషీకేశం- ఉత్తర కాశి మార్గంలో 5 కి. వా. విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే శక్తిగల ఒక విద్యుత్కేంద్రం ఏర్పాటు కానున్నది. ఈ విద్యుత్కేంద్రం ఉత్తరకాశీ జిల్లాలోని ధరసు పట్టణానికి విద్యుచ్ఛక్తిని అందజేస్తుంది.

## నాలుగు విద్యున్మండలాల కలయిక

1966 సంవత్సరారంభం నాటికి ఉత్తర ప్రదేశ్‌లోని నాలుగు విద్యున్మండలాలూ ఒకదానితో ఒకటి కలపబడతాయి. దీనికి అవసరమైన యంత్రసామగ్రికి, ప్లాంటు కొరకు అప్పుడే ఉత్తరువులు జారీచేయ బడ్డాయి.

ఈ ఏడాది రిహాండ్ విద్యున్మండలం, తూర్పుభాగపు విద్యున్మండలాలు ఒకదానికొకటి కలపడం జరుగుతుంది. ఇవి 1965 సంవత్సరంలో కాన్పూర్ విద్యున్మండలంతో కలపబడతాయి. ఈ మూడింటిని గంగ-శారద విద్యున్మండలంతో కలిపే చర్యలు తీసుకో బడ్డాయి. ఇది 1966 సంవత్సరం నాటికి పూర్తవుతుందని అంచనా.

## తూర్పుబెంగాలు శరణార్థుల కుటుంబాలు

పిలిభిట్ జిల్లాకు కేటాయించబడిన మొత్తం 1376 తూర్పుబెంగాలు శరణార్థుల కుటుంబాలకు పునరావాస సౌకర్యాలు కల్పించ బడ్డాయి.

పునరావాసానికి సంబంధించిన పథ్నాలుగు పథకాల క్రింద ఈ జిల్లాలో లభించిన స్థలాల ప్రకారం వీలునుబట్టి 20 కాలనీలు ఏర్పాటుచేయ బడ్డాయి.

ప్రతి కుటుంబానికి ఒక వరండా,ఒక వంటగదిగల ఏకగది యిల్లు యివ్వడం జరిగింది. దీనికి తోడు ట్రాక్టరుతో దున్నబడిన 5 ఎకరాల నేల, వ్యవసాయపు పనులకు రూ 500 ఋణం ప్రతి కుటుంబానికి యివ్వబడ్డాయి.

## షహరాన్‌పూర్‌లో టి. బి. శానిటోరియం

షహరాన్‌పూర్‌లోకొత్తగా నిర్మింపబడిన భవనంలో త్వరలోనే 60 పడకలతో ఒక క్షయ శానిటోరియం త్వరలోనే ఏర్పాటు కానున్నది శానిటోరియానికి అవసరమైన ఎక్స్‌రే పరికరాలు, ప్రయోగశాలపరికరాలు యితర సామానులకై రాష్ట్ర ప్రభుత్వం రూ 2,00,000 మంజూరు చేసింది.

ఈ శానిటోరియం, కేంద్రప్రభుత్వ సహాయపు పథకంక్రింద ఏర్పాటు చేయబడుతున్నది. శానిటోరియం క్రింద అయ్యే రికరింగ్ ఖర్చులో 50శాతం, నాన్ రికరింగ్ ఖర్చులో 75 శాతం భారత ప్రభుత్వం భరిస్తుంది.

# కేరళ

భారతదేశంలో మూడువారాలపాటు సుహృద్భావ పర్యటన జరుపుతున్న 10మంది

(మిగతా 54 వ పేజీలో)

### అనంతపురం జిల్లా

*శిక్షణ శిబిరం :*

పెనుకొండ పంచాయతీ సమితిలోని ఆర్. లోచర్లలో మార్చి 23వ తేదీనుండి మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణశిబిరం నిర్వహింప బడింది.

*ఎలిమెంటరీ పాఠశాలలు :*

నిర్బంధవిద్యా పథకాన్ని అమలు జరప డానికిగాను కోటగార్లగుట్ట, హునేసకుంట, గైరగుండనహల్లి — ఈమూడు పాఠశాలలు లేని గ్రామాలలో మూడు ఎలిమెంటరీ పాఠ శాలలు ప్రారంభించబడ్డాయి.

*ఉత్పత్తి కార్యక్రమం :*

ముదిగుబ్బ పంచాయతీ సమితిలో మార్చి నెలలో రైతులకు 30 మణుగుల మేలుజాతి విత్తనాలు, 148 మణుగుల రసాయనికపు ఎరువులు, 15 ఆధునికవ్యవసాయ పనిముట్లు పంపిణీ చేయబడ్డాయి.

### చిత్తూరు జిల్లా

*గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం :*

కుప్పం పంచాయతీ సమితిలో మార్చి 30 వ తేదీనుండి 14 రోజులపాటు గ్రామ లక్ష్మి శిక్షణశిబిరం నిర్వహించబడింది.

నగరిలోకూడా ఒక గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం నిర్వహించబడింది. వివిధ స్త్రీ సంక్షేమ కార్యక్రమాలలో, యితర అభివృద్ధి కార్యకలాపాలలో 10 మంది స్త్రీలు 14 రోజులపాటు శిక్షణ పొందారు.

*కుటుంబ నియంత్రణ :*

మదనపల్లి పంచాయతీ సమితిలోని నిమ్మనపల్లిలో కుటుంబనియంత్రణ పునశ్చ రణ శిక్షణశిబిరం ఒకటి నిర్వహించబడింది. మూడురోజులపాటు జరిగిన యీ శిక్షణలో యాభైమందికి శిక్షణ యివ్వడం జరిగింది.

### తూర్పుగోదావరి జిల్లా

*ఎరువుల పంపిణీ :*

మార్చినెలలో సీతానగరం పంచాయతీ సమితిలో రైతులకు 1326 మణుగుల ఎరు వులు, 100 పౌనుల రసాయనిక క్రిమిసంహా రక మందులు పంపిణీ చేయబడ్డాయి. ఈ కాలంలోనే 25 అంబరు చరఖాలు, 11 తేనె పట్టు పెట్టెలను ప్రవేశ పెట్టబడ్డాయి.

*రసాయనిక ఎరువుల పంపిణీ :*

245 టన్నుల రసాయనిక ఎరువులు, 10 ఆధునిక వ్యవసాయ పరికరాలు పెద్దా పురం పంచాయతీ సమితిలో మార్చినెలలో పంపిణీచేయబడ్డాయి. ఈ నెలలోనే 93 వ్యవ సాయ ప్రదర్శనలు నిర్వహించబడ్డాయి.

### గుంటూరు జిల్లా

*బావుల నిర్మాణం :*

మార్చినెలలో ఇప్పుడు పంచాయతీ సమితిలో ఏడు మంచినీటిబావుల త్రవ్వకం జరిగింది. మరోనాలుగు బావులు మరమ్మతు చేయబడ్డాయి. 12 ఫర్లాంగుల మట్టిబాటవేయ బడింది. 8 ఫర్లాంగుల మట్టిబాట మరమ్మతు చేయబడింది. 9 కల్వంతెనలు నిర్మించ బడ్డాయి.

*గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం :*

మంగళగిరి పంచాయతీ సమితిలోని పెనుమాక గ్రామంలోమార్చి 26వతేదీనుండి మూడు రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది.



కొరిసెపాడు పంచాయతీ సమితిలోని కొమ్మినానియ వారి పాలెంలో గ్రామసహాయ కుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించ బడింది. 52 గ్రామ సహాయకులకు యిక్కడ శిక్షణ యివ్వడం జరిగింది.

*బాలవాడి కేంద్రాలు :*

ఈమని పంచాయతీ సమితి ఆధ్వర్యంలో నెలకొల్పబడిన నాలుగు బాలవాడలు ప్రారంభించ బడ్డాయి.

*పునశ్చరణ శిక్షణ శిబిరం :*

ఈమని పంచాయతీ సమితిలో మార్చి29 నుండి మూడురోజులపాటు 40 మందికి కుటుంబ నియంత్రణలో పునశ్చరణ శిక్షణ యివ్వబడింది.

*గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం :*

ఒంగోలు పంచాయతీ సమితిలో మార్చి 18వ తేదీనుండి 14 రోజులపాటు గ్రామ లక్ష్మిశిక్షణశిబిరంఒకటి నిర్వహించబడింది.

కుటుంబ నియంత్రణ క్రింద మూడు రోజుల పునశ్చరణ శిబిరంకూడా మార్చి 27వ తేదీ నుండి ఒంగోలు పంచాయతీ సమితిలో నిర్వహించ బడింది.

### కృష్ణా జిల్లా

*సదస్సు :*

మూడురోజులపాటు జరిగే కృష్ణాజిల్లా గ్రామసేవికల, ముఖ్య సేవికల సదస్సుకు

## ప్రగతి పథంలో

ఎక్సైజు, సాంఘిక సంక్షేమ మంత్రి ఏప్రిలు 5వ తేదీన విజయవాడలో ప్రారంభోత్సవం చేశారు. పంచాయతీ సమితుల్లోని ముఖ్య సేవికలు, గ్రామ సేవికలు, మహిళా మండలుల సభ్యురాండ్రు, చేర్చుకోబడిన మహిళా సభ్యురాండ్రు యీ సదస్సులో పాల్గొన్నారు.

### మహబూబ్‌నగర్ జిల్లా

*శిక్షణ శిబిరం :*

గద్వాల్ పంచాయతీ సమితిలోని మర్లబీడ్‌లో మార్చి 29వ తేదీనుండి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. సమాజవికాస కార్యక్రమాలకు సంబంధించిన వివిధ విషయాలలోనూ, ప్రత్యేక వ్యవసాయ పద్ధతులలోను యాభైమంది శిక్షితులకు శిక్షణ యివ్వబడింది.

### నల్గొండ జిల్లా

*కుటుంబ నియంత్రణ :*

దేవరకొండ బ్లాకులోని గుడిపల్లి గ్రామంలో మూడురోజులపాటు కుటుంబ నియంత్రణ పునశ్చరణ శిక్షణ శిబిరం నిర్వహించబడింది. ప్రసంగాల రూపంలోనూ, ప్రదర్శనాల రూపంలోను 40మందికి కుటుంబ నియంత్రణలో శిక్షణ యివ్వబడింది.

సూర్యాపేట పంచాయతీ సమితిలోని నారాయణగూడలో గ్రామనాయకుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది. దీనిలో 51 మందికి శిక్షణయివ్వడం జరిగింది.

*నవారు నేత కేంద్రం :*

నక్రెకల్‌లో నవారు నేతకేంద్రం ప్రారంభించబడింది.

### నెల్లూరు జిల్లా

*పారిశ్రామిక సహకార సంఘం :*

కొండపి పంచాయతీ సమితిలోని ఉప్పలపాడులో వడ్రంగులు, కమ్మర్లకొరకు ఒక పారిశ్రామిక సహకారసంఘం నిర్వహించబడింది.

### నిజామాబాదు జిల్లా

మార్చి 29 వ తేదీన నిజామాబాదులో ఒక ఆరోగ్య ప్రదర్శనశాల ప్రారంభించబడింది.

*కుటుంబ నియంత్రణ :*

మార్చి 28 వ తేదీనుండి మూడురోజులపాటు జరిగే కుటుంబనియంత్రణ పునశ్చరణ శిక్షణ శిబిరం ఒకటి నావిపేటలోని ప్రాథమిక ఆరోగ్యకేంద్రంలో ప్రారంభించబడింది. ఈ శిబిరంలో 61 మందికి శిక్షణ యివ్వడం జరిగింది.

### వరంగల్లు జిల్లా

*యువజనోత్సవం :*

పరకాల పంచాయతీ సమితిలో మార్చి 24 తేదీనుండి 28 వ తేదీవరకు యువజనోత్సవం నిర్వహించబడింది.

*గ్రామసభ :*

పరకాల పంచాయతీ సమితికి చెందిన నగరం గ్రామంలో మార్చి 27 వ తేదీన గ్రామసభ ఒకటి నిర్వహించబడింది.

*ఉత్తమ పంచాయతీ సమితి :*

1963–64 సంవత్సరంలో వరంగల్లు జిల్లాలో ములుగుపంచాయతీ సమితిఉత్తమ పంచాయతీసమితిగా ఎంపిక చేయబడింది.

### పశ్చిమగోదావరి జిల్లా

*గ్రామసహాయకుల శిక్షణ శిబిరం :*

చింతలపూడి పంచాయతీ సమితికిచెందిన తాడ్లలో మార్చి 21 వ తేదీనుండి మూడు రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణశిబిరం ఒకటి నిర్వహించబడింది.

*సహకార సంఘం :*

నరసాపురం పంచాయతీ సమితికిచెందిన బూరుగుపల్లి గ్రామంలో 73 మంది సభ్యులతో ఒక కొత్తసహకారసంఘం ప్రారంభించబడింది.

---

(52 వ పేజీ తరువాయి)

సభ్యులుగల రష్యా పార్లమెంటు ప్రతినిధి బృందం మార్చి 2 వ తేదీన కేరళకు వచ్చింది. తిరువేంద్రంలో వీరు ఒకరోజు వున్నారు. ఈ సమయంలో అధికార, అనధికార సంస్థలు నిర్వహించే వివిధ కార్యక్రమాల్లో పాల్గొని, నగరం సమీపంలోగల ముఖ్యమైన సంస్థలను, ఆసక్తికలిపించే స్థలాలను సందర్శించారు.

మార్చి మొదటివారంలో భారతదేశంలోని అమెరికారాయబారి చెస్టర్ బౌల్స్ అయిదురోజులపాటు కేరళలో పర్యటన జరిపారు. ఒక అభివృద్ధిబ్లాకును, విస్తరణ శిక్షణ కేంద్రాన్ని, తుంబ రాకెట్ ప్రయోగ స్టేషన్ను సందర్శించడం, రాష్ట్ర మంత్రులతోనూ, ముఖ్యమైన అధికారులతోను సంప్రదించడం వీరి కార్యక్రమాల్లోని ముఖ్యాంశాలు.

### పరిశీలనా రాకెట్టు

తిరువేంద్రం దగ్గర గల తుంబస్టేషన్ నుంచి మార్చి 14 వ తేదీన ఒక పరిశీలనా రాకెట్టు ప్రయోగించబడింది. రాడారు సక్రమంగా పనిచేస్తున్నదీ లేనిదీ తెలుసుకోవడానికై యీ ప్రయోగం కొనసాగించబడింది. ఈ ప్రయోగం ఫలితాలు తృప్తికరంగా వున్నాయి.



సాహిత్యశాఖలు :

# కథానిక

— చాగంటి తులసి

సాహిత్య శాఖగా చిన్నకథ ఏ నాటి నుంచీ వస్తున్నదో తెలిసికొనడం ఊహాతీతమే. తొలిపలుకులైన వేదాలలో చిన్న కథలున్నాయి. మానవుడు భాషాజ్ఞాని అయిననాటినుండీ చిన్న కథలు చెప్పడం ప్రారంభించాడు. ఏ దేశపు ప్రాచీన గ్రంథాలైనా కథా సంచయాలే.

భారతం చిన్నకథే. దాన్ని సూతుడు శౌనకాదులకు చెప్పాడు. అక్కథకుడు శౌనకాది మహామునులకు చెప్పిన దే వైశంపాయనుడు జనమేజయునికి చెప్పాడు. దాన్నే వ్యాసుడు పద్యాత్మకంగా అందించాడు. అనేకములైనయితర కథానికలతో విస్తృతమై భారతం మహాభారతమైంది.

అంచేత కథాశిల్పం సాహిత్యంలో ఆనాదిగా ఉంది. ప్రాచీన భారత సాహిత్యంలో కథానికాలేఖాగోళం చుట్టబెట్టి ప్రపంచ ప్రఖ్యాతి పొందాయి. మన పంచతంత్ర కథలు అప్పటి నాగరిక ప్రపంచమంతా కీర్తించబడాయి.

అయితే, ఇప్పుడు మనం 'చిన్నకథ'గా వ్యవహరిస్తున్న సాహిత్య మంతా అధునాతనమైనది తెలుగు భాషకేకాదు, మన దేశ భాషలన్నిటికి కూడా అధునాతనమైనది.

తెలుగు భాషలో ఇప్పటిరీతి కథాసాహిత్యం పూర్వం ఉన్నాదా అంటే లేదుకాని కథాసాహిత్యం కూడా ఉండడం ఉంది. హరవిలాసం, బసవపురాణం మొదలైన గ్రంథాల్లో చక్కని కథానికలున్నాయి వృత్తాది పద్యకావ్యాలుగా కొన్ని దేశీయమైన ద్విపదులుగా కొన్ని ఉండడం ఉన్నాయి.

ఆధునికమైన కథ కేవలం వచన రచన. వచన రచన ప్రాచీనాంధ్రంలో కూడా ఉంది. మదన కామరాజు కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, సత్యనారాయణాదివ్రత కథలు మొదలైనవి జనబాహుళ్యంలోఅనుశ్రుతంగామాత్రమే ఉన్నాయి. వీటికి కావ్య గౌరవం కాని పండిత జనాదరణ కాని లేకపోయింది.

ఆధునికాంధ్ర సాహిత్యం కథానికలతోనే ప్రారంభమైందని చెప్పొచ్చు. చిన్నయసూరి నీతిచంద్రిక కథా సంచయమే. ఇది ఆంధ్రీకరణమైన సంస్కృత కథా సంచయమైనా తెనుగు దేశంలో ప్రాచీన భారత కథాక్రమం తెలుసుకోవడానికి వీలిచ్చింది. చిన్నయసూరికి పూర్వం సముఖం వెంకట కిష్టప్పనాయకుడి వచన రచనలున్నా అవి ప్రజలకి తెలియనే తెలియవు. అజ్ఞాతంగా ఉండిపోయాయి.

వచన రచనావశ్యకతను బాగుగా గుర్తించినవాడు కందుకూరి వీరేశలింగం. సులభగ్రాహ్యమైన వచన రచనా విధానం ప్రవేశపెట్టి సంధి విగ్రహ కథలను దేశానికి అందచేశాడు. ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానాలు రెండూ తరచిన ప్రజ్ఞా సమన్వితుడయిన కారణంగా ఆంగ్ల వచన రచనారీతుల ఫణితిని తెనుగులో రాజశేఖర చరిత్ర, సత్యరాజా పూర్వ దేశపు యాత్రలు మొదలైనవి బహుళంగా రచించాడు. అయితే, ఈయన భాష వ్యవహారికం కాదు. కాని భోగరాజు నారాయణమూర్తి. చిలకమర్తి వారి మొదలుకొని ఇప్పటి విశ్వనాథ వారి దాకా కందుకూరి వారి జాడలో వచనం పడిపోయింది.

ఆధునికంగా మనమర్థం చేసుకుంటున్న కథానిక గిడుగువారి పట్టుదలతో గురజాడ అప్పారావు ప్రతిభతో మొట్ట మొదట వచ్చింది.

ఆధునికమైన కథానికానవలా సజీవమైన వ్యవహారిక భాషలో రాస్తేనే వాటిపై లక్షణాన్ని నిలబెట్టుకో గలుగుతాయి. ఈ విషయాన్ని గుర్తించి మేధావులు వ్యావహారిక భాషావాదాన్ని లేవదీశారు.

వ్యవహారిక భాషకీ కథానికకీ అవినాభావ సంబంధముంది. కథ ఉత్పన్నమయే రీతిని సూక్ష్మంగా పరిశీలిస్తే వ్యవహారిక భాషావశ్యకత బోధపడ్తుంది.

మనిషిచెప్పినదంతా కథే. 'కథ్' అన్న ధాతువుకి చెప్పడమనే అర్థం. చెప్పబడినదంతా కథే అన్నంత మాత్రాన అంతా సాహిత్యం మాత్రం కాదు. కాని కథ మాత్రం అవుతుంది. పాశ్చాత్యులు కూడా Story-telling, story-teller లనే అంటారు. అరేబియన్ నైట్సు

కథలు రాజుకి రాజు భార్య వెయ్యిన్నొక్క రోజూ చెప్పిన వెయ్యిన్నొక్క కథలే.

అందుచేత కథ చెప్పే ధోరణిలో చెప్పి తేనే దానిస్వరూపం దానిదౌతుంది. దాని వాస్తవికమైన రూపంతో భాసిస్తుంది. ఒక సంఘటనని సంభాషణలో మనుష్యులు ఏ విధంగా చెపుతారో పరిశీలిస్తే కథారూపం పూర్తిగా అవగాహన చేసుకోబడుతుంది.

ఉదాహరణకి మనమంతా ఒక వివాహానికి వెళ్ళా మనుకొందాం. అక్కడి కొచ్చిన ఆహ్వానితులలో నలుగురు ఏదో చిలిజట్టీ తెచ్చా రనుకొందాం. ఆ జట్టీలో ఇద్దరు ఆడవాళ్ళు, ఇద్దరు మగవాళ్ళు పాల్గొన్నారను కొందాం. తర్వాత ఆ చిలిపి జట్టీని మధ్యవర్తులు పోగై పరిష్కరించారనుకొందాం.

పెళ్లినుంచి మనం తిరిగివచ్చిన తర్వాత మన యింట్లో ఈ జట్టీ గురించి విధిగా ముచ్చటిస్తాం. అడిగిన వాళ్లకీ అడగని వాళ్లకీ కూడా చెప్పించే పదిసార్లు చెపుతాం. ఎందుచేత? ఇది మానవ స్వభావం. మనిషికి ఇంకొక మనిషి గురించి తెలుసుకోవడం, తెలుసుకున్నది లేక చూసింది పదిమందికి చెప్పడం మహా యిష్టం.

ఈ చిలిపి జట్టీ ఇతివృత్తాన్ని మనం ఎలాగ చెపుతాం? సాధ్యమైనంత వరకూ జరిగింది జరిగినట్లు చెప్పడానికే ప్రయత్నిస్తాము. కొంత మనము ఊహించి కలుపుతాము. అంతా పూసగుచ్చి తూ. చా. తప్పకుండా పునశ్చరణ చేస్తాం.

ఆ దెబ్బలాడిన వాళ్లలో ఒకరిది కీచుగొంతుక, ఇంకొకరిది గౌళగాత్రం అనుకుందాం. ఆ రెండు గొంతుకలూ అనుకరిస్తూ వాళ్ళామాటలు ఎలాగ ఉచ్చారణ చేశారో ఆ విధంగానే ఉచ్చారణ చెయ్యడానికి ప్రయత్నం చేసి చెపుతాం. వాళ్ళ మొహాల్లోని హావభావాదులన్నీ మనం మొహంలోకి తెచ్చుకొని మరీ చెపుతాం. అంటే ఆ నలుగురి పాత్రలు మనం ధరించి నాటకీయంగా అభినయిస్తాం.

ఇదే, చెప్పబడే కథకి కీలకం. జరిగింది జరిగినట్టు కళ్ళల్లో ఉట్టికట్టి ఉయ్యాలూపినట్టు నాటకీయంగా చెప్పాలి.

ఇంకా ఏ మేమి చెపుతాం.

జరగడం, జరిగిన కాలం, వాతావరణం కూడా విశద పరుస్తాం. ఉదాహరణకి.

"ఓమూల చిన్న జల్లు! అపరాహ్నం తిరిగి పోయి భోజనాలకి కాలాతీతమై పోయింది. పెళ్ళికొడుకూ, పెళ్ళి కూతురూ పల్లకిలోంచి దిగి గడప దగ్గర నిలుచుండిపోయారు. వాళ్లకి హారతిచ్చి పేర్లు చెప్పించి లోపలికి తీసుకు రావాలని మొగాళ్ళకి తోచదు. ఆడవాళ్లకి తోచదు. ఆకలని ఓ మూల పిల్లలు ఏడుస్తున్నారు. ఆ మధ్య పెట్టుకున్నారు వీళ్ళిల్లు బంగారంగానూ ఈ చిలిపి జట్టీ!"

ఇంకా ఏ విధంగా దాన్ని పెంచుతాం?

ఆ దెబ్బలాడిన ఆసామీల స్వభావాల్ని తీక్షంగా విమర్శిస్తాం. వీళ్లల్లో ఈ తప్పుందని వాళ్ళలో ఆ తప్పుందని ఆరాలు తీసి ఒకరి పక్షంగా కొందరం, రెండో వారి పక్షముగా కొందరం సమర్థించబోతాం. ఇంకా మంచి వాళ్ళమైతే తప్పెవరిదో నిర్ణయించి తీర్పు చెపుతాం.

ఈ జట్టీని మన మందరం ఒక్కలాగ చెప్పలేం. నేను ఈ వివాహ సంఘటనని చెప్పడానికి ఉపక్రమిస్తాను. వెంటనే మీరంతా ఏమంటారు? "నీ మొహం, నువ్వు చెప్ప లేవు. ఆ అమ్మాయి బాగా చెపుతుంది." అని ఇంకొకరిపై మీ యిష్టాన్ని చూపెడతారు. ఆ అమ్మాయేం చేస్తుంది? నన్ను చెప్పనివ్వకుండా నా నోటికి అడ్డంవచ్చి కథంతా మొట్ట మొదట నుంచి చివరిదాకా చెపుతుంది. ఆ అమ్మాయి బాగా కూడా చెపుతుంది! అందరం ఎరిగిన సంఘటనైనా అందరం బాగా చెప్పలేం. బాగా చెప్పగలగడమనే నేర్పు కొందరికి మాత్రమే వుంటుంది.

కథానికకి ఇదే జన్మస్థానం. ఇతర మనుష్యుల గురించి తెలుసుకుందామన్న జిజ్ఞాస మూలంగా తోటి మనుష్యుల్ని విమర్శిద్దామన్న స్వభావం మూలంగా కథాశిల్పం బైట పడ్డది.

ముఖ్యంగా మానవ జీవితానికి సంబంధించినది కాబట్టి పాత్రౌచిత్యాన్ని బట్టి అయితే నేం, నాటకీయమైన సన్నివేశాన్ని బట్టి అయితేనేం, చెప్పవలసినఅవసరమున్న కారణం చేతైతేనేం, కనిథాకకు వ్యవహారిక భాష తప్ప మరొకటి ఉపయోగించబడదు. గ్రాంధిక భాషలో కాని కథ చెప్పేమా దాని సొగసూ, సహజత్వమూ అడుగంటి కృతకంగా తయారవుతుంది.

అందుచేత కథానికకు ఒక సంఘటన, సజీవమైన వ్యవహారిక భాష, వాస్తవికత, పాత్రౌచిత్యం, వాతావరణ వివరణ, సువిమర్శన ముఖ్యమైనవి.

సామాన్యమైన సంఘటన మూలంగా కథ ఉత్పన్న మౌతోంది కనుక కథానికను ఎవరైనా చెప్పొచ్చుననే భావం కలుగుతుంది. చిన్న కథ చెప్పలేని వాడెవ్వడు? ప్రతిమనిషీ ఏదో ఒక చిన్నకథ చెప్పగల్గే స్థితిలోనే ఉంటాడు. కానికథ

సాహిత్యం కావడానికి అనేక తరాలలో అనేక దేశాలలో, అనేక ప్రతిభావంతుల కృషి ఫలితంగా ఉత్తమ సాహిత్యంగా కథానిక వృద్ధి పొందినదని గమనించాలి.

కథానిక సాహిత్యం ఎప్పు డౌతుంది? ఇతర సాహిత్యశాఖలు ఎప్పుడు సాహిత్య మౌతున్నాయో కథానికా అదేపరిస్థితిలో పరిణితి చెందుతున్నది. చెప్పిన కథకి ఎప్పుడైతే రూపసౌందర్యం, శిల్ప చాతుర్యం, రసనిష్పత్తి సమకూరుతాయో అప్పుడే యిది ఉదాత్తమైన సాహిత్య శ్రేణికి చెంది అమరత్వాన్ని పొందుతుంది.

ఏ పరిస్థితి ఏర్పడితే కథానిక అవుతుందీ అంటే విశదీకరించడం అసాధ్యం. పిపీలికాది నక్షత్ర పర్యంతం కథానికకి వస్తువే. ఒకే ఒక్క సంఘటన వుంటే కథవుతుందని నిర్దేశంలేదు. కొన్ని సంఘటనలను మెలివేస్తే "ప్లాటు" అవుతుంది. కథకి 'ప్లాటు' ఉన్నా ఉండొచ్చు. ప్రధానమైన ఒకభావం ఉన్నా కథౌతుంది. ప్రధానంగా ఒక భావముండి అంగంగా అనేకభావాలు ప్రోదిచేసినా కథే. అనతికాలంలో జరిగిన జీవిత విశేషమైనా కథౌతుంది. యావజ్జీవితమూ ఉల్లేఖించినా కథే అవుతుంది.

కథానిక సాహిత్య శాఖలన్నిటికీ అవసరమే. నాటకానికీ, నవలకీ, మహాకావ్యానికీ అంతర్గతంగా ఉండి తీరుతుంది. అందుచేత కథానిక అన్ని సాహిత్య శాఖలకీ అతి చేరువుగా ఉన్నట్టు కనబడుతూ దాని ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ ఉంటుంది. అన్ని సాహిత్య శాఖల్లోనూ కథానికకి తాదాత్మ్య సిద్ధి ఉన్నది.

కథ నవలకి దగ్గరగా కన్పడుతుంది. కొన్ని చిన్నకథలను నవలలుగా పెంచి రాయడానికి వీలుంటుంది.

కథ ఒకసారి రూపకానికి దగ్గరగా ఉన్నట్టు కన్పడుతుంది. రంగస్థలానికి అవసరమైన కొన్ని మార్పులతో అది నాటకమైనా అవుతుంది; ఏకాంకికైనా అవుతుంది.

కథ ఒకసారి భావగీతానికి చేరువుగా కన్పడుతుంది. కథలోని భావాలను ఛందోబద్ధం చేస్తే ఉత్తమమైన ఖండ కావ్యంగా రూపొందు తుంది. ఈ పద్ధతి కథలో సంఘటన కాని సంఘటనావళి కాని ఉన్నట్లయితే దాన్ని పాడుకోడానికివీలయిన గేయంగా మార్చుకో వచ్చును. గురజాడ అప్పారావుగారి కన్యక, పూర్ణమ్మ మొదలైన గేయాలు కథానికలే.

కథ ఒకసారి సామాన్యమైన వ్యాసంగా కన్పడుతుంది. అది వ్యాసమో కథో నిర్ణయించడానికి కూడా వీలులేని స్థితిలో ఉంటుంది.

ఈ విధంగా కథానిక అన్ని సాహిత్య శాఖలకీ చేరువై, సన్నిహితత్వం కల్గి, ఇతర సాహిత్య శాఖలకు బీజమై తన స్వంత వ్యక్తిత్వంతో అలరారుతుంది.

కథలో చిత్రీకరించిన వాస్తవికతకీ, ప్రపంచంలోని వాస్తవికతకీ తేడా వుంటుంది. యదార్థాన్ని యదార్థంగా చిత్రీకరించాలన్న మాట సత్యమే అయినా కథలో వాస్తవికంగా కనపడే సంఘటనలు నిజంగా వాస్తవికాలు కావు. అవి వాస్తవికాలుగా భాసిస్తాయి. రచయిత వాస్తవికత్వాన్ని తన శిల్పం ద్వారా భాసించేటట్లు చేస్తాడు. అతడు చెప్తున్నది నిజమని భ్రమకలగ చేస్తాడు. యదార్థాన్నే చెపుతున్నా దాని వెనకాతల ఆదర్శం అంతర్గతంగా ఉంటూఉంటుంది. అతడు చిత్రించిన యదార్థ విషయాలు మనలో కల్లోలాన్ని లేవతీస్తాయి. ఆలోచనల్ని రేకెత్తిస్తాయి. తన హేతువాదంతో మనల్ని ఆకడతాడు. కాని ఎక్కడా ఉపదేశకుడుగా, ప్రచారకుడుగా తనకుతాను కథలో ప్రత్యక్షం కాడు. అలాగా ప్రత్యక్షమైనట్లయితే అతని కథాశిల్పంకుంటుపడుతుంది. ఆతడు సృజించిన పాత్రలు, ఘటనలూ ఒక్క చక్కటి పద్ధతిలో మనలో మార్పుని తీసుకువస్తాయి. తన భావాలను కథలద్వారా పరోక్షంగా సంఘంలో వ్యాపింప చేయగలిగే శక్తి అతనిలో ఉంటుంది. చలం కథలు ఈ కోవకి చెందిన వే. కొందరు కథకులు తమ కథల్లో యదార్థాన్ని ఆదర్శాన్నీ మేళవించి అందజేస్తే కొందరు కేవలం యదార్థాన్ని హృదయానికి హత్తుకునేటట్లు చిత్రీకరించి ఊరుకుంటారు. తమంత తాము దానిని గురించి ఏమీ చెప్పరు. వారి చిత్రణ పరోక్షంగా ఆదర్శాన్ని వేలెత్తి చూపెడుతూఉంటుంది.

ఈ విధంగా కథానిక యితర సాహిత్య శాఖలవలె రసానందాన్ని యిస్తుంది. జీవితపు లోతుల్ని అర్థం చేసుకునే పరిజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. హితవు చెప్తుంది. కీడుని దూరం చేసి మేలు వేపు దృష్టిని మరలుస్తుంది.

వస్తు దృష్ట్యా కథానిక చిన్నదే అయినా ప్రభావ దృష్ట్యా వజ్ర సన్నిభమైనది.

ఈవిధమైన కథానిక మానవ జీవితాన్ని తరిచి, జీవితానుభవాన్ని రసాత్మకంగా చెప్పినప్పుడే ఉత్తమోత్తమమైన సాహిత్యశ్రేణికి చెందిన కథానిక అవుతుంది. సామాన్యంగా పత్రికల్లో ఒకసారి ప్రకటితమై, ఒకసారి చదివి అవతల పారవేసే కథలు కోటాను కోట్లగా ఈ రోజుల్లో రచించబడుతున్నాయి. అవి కాలప్రవాహంలో కొట్టుకుపోతాయి. చదివిన కథనే తిరిగి తిరిగి చదివి, చదివిన ప్రతిపర్యాయము నూతనమైన సత్యావగహన, అనుభూతికలిగేక ఫలసంఖ్య ఏరోజున పెరుగుతుందో ఆరోజు ఈ సాహిత్యశాఖ విలువ యింకా ఇనుమడిస్తుంది.

---

# సంగ్రహప్రకటనలు

## కొత్తపురపాలక సంఘాలు

అనంతపురం జిల్లాలోని ధర్మవరం పంచాయతీ, గుట్టకిందపల్లి గ్రామంల ప్రాంతాన్ని యిరవైమంది కౌన్సిలర్లతో ఒక పురపాలక సంఘంగా ప్రభుత్వం ప్రకటించింది. ఈ ప్రకటన ఏప్రిలు 1వ తేదీ నుండి అమలులోకి వచ్చింది.

కర్నూలు జిల్లాలోని ఎమ్మిగనూరు పంచాయతీ, దాని పరిసర గ్రామాలయిన వెంకటాపురం, శారదాపురంల మొత్తం ప్రాంతాన్ని 20మంది కౌన్సిలర్లతో ఒక పురపాలక సంఘంగా ప్రభుత్వం ప్రకటించింది. ఇది ఏప్రిలు ఒకటవ తేదీనుంచి అమలులోకి వచ్చింది.

## పాలవాగు ఆనకట్ట

ఖమ్మంజిల్లా, మధిర తాలూకా కోతవంగవీడు గ్రామంవద్ద పాలవాగు ఆనకట్టనిర్మాణానికిగాను – డైరెక్ట్, ఇండైరెక్ట్ ఛార్జీలను కలుపుకుని – రు. 4,65,500 లను, పనులకుగాను రూ. 3,99,600 లను వెచ్చించడానికి ప్రభుత్వం మంజూరు చేసింది.

## ఆయిలు యింజన్ల సరఫరా

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని రైతులు ఆయిలు ఇంజన్లను, ఎలక్ట్రిక్ మోటారు పంపుసెట్లను కొనుక్కోడానికై ప్రభుత్వం తక్కువరూపంలో ఋణాలుగా వ్యవసాయదారులకు యివ్వడానికి రు.18.45 లక్షలను మంజూరుచేసింది.

## రాష్ట్రకార్మిక సలహామండలి

ఈ దిగువ సభ్యులతో మరిమూడేళ్ళపాటు రాష్ట్ర కార్మిక సలహామండలిని రాష్ట్ర ప్రభుత్వం పునర్వ్యవస్థీకరించింది.

*ప్రభుత్వ సభ్యులు:* కార్మికశాఖామంత్రి (ఛైర్మను), హోంశాఖ రెండవకార్యదర్శి; పబ్లిక్ వర్క్సు శాఖ కార్యదర్శి; పరిశ్రమల శాఖ కార్యదర్శి, ఆరోగ్య, గృహనిర్మాణ, మునిసిపల్ వ్యవహారాలశాఖ కార్యదర్శి; ప్రభుత్వ ఉపకార్యదర్శి హోం (కార్మిక) శాఖ — వీరు సభ్యులు. హైదరాబాదులోని లేబర్ కమీషనర్ (సభ్యుడు, కార్యదర్శి). హైదరాబాదులోని ఫ్యాక్టరీల ప్రధాన తనిఖీదారుడు, హైదరాబాదులోని ప్రాంతీయ ప్రావిడెంట్ ఫండు కమీషనరు, హైదరాబాదులోని కార్మికుల ప్రభుత్వ భీమాసంస్థ ప్రాంతీయ డైరెక్టరు, విశాఖపట్నంలోని లేబరు కమీషనరు (కేంద్ర) – సభ్యులు.

*యజమానుల ప్రతినిధులు:* శ్రీ పి. ఎల్. బంగ్రీ, సిరిపూర్ పేపర్ మిల్స్; ప్రొఫెసర్ ఎస్. వి. అయ్యర్, డైరెక్టరు, ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆవ్ ఎకనామిక్స్; శ్రీ ఎస్. ఎస్. కార్డ్‌మాస్టర్, హైదరాబాదు లామినేటెడ్ ప్రొడక్ట్స్ లి. హైదరాబాదు; శ్రీ. జి. ఎస్. రాజా, ఎమ్. ఎల్. సి, సౌత్ఇండియా రీసర్చ్ ఇన్స్టిట్యూట్, విజయవాడ; శ్రీ కె. ఆర్. నందగోపాల్, మేనేజింగ్ డైరెక్టర్, దక్కన్ క్రానికల్, సికింద్రాబాదు, శ్రీ ఆర్. రామానందరావు, వి. ఎల్. టి. డి. కం. లి, గుంటూరు; శ్రీ వి. పి. రామారావు, ప్రధాన నిర్వహణ అధికారి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డురవాణాసంస్థ, ముషీరాబాదు, హైదరాబాదు – సభ్యులు.

*కార్మికుల సభ్యులు:* శ్రీ జి. సంజీవరెడ్డి, ఎమ్. ఎల్. ఏ; శ్రీ వి. జగన్నాధరావు, ఐ. ఎన్. టి. యు. సి. ప్రధాన కార్యదర్శి; శ్రీ ఎన్. నవాజ్‌ఖాన్, ఐ. ఎన్. టి. యు. సి కార్యదర్శి; శ్రీ ఎస్. వి. గిరి, మజ్దూర్ సంఘం అధ్యక్షుడు; శ్రీ కె. ఎల్. నరసింహం, ఎ. పి. టి. యు. సి అధ్యక్షుడు; శ్రీ ఎన్. సత్యనారాయణరెడ్డి, ఎ. పి. టి. యు. సి. ప్రధానకార్యదర్శి; శ్రీ జోస్యభట్ల సత్యనారాయణ, ఎ. పి. టి. యు. సి. కార్యదర్శి, హైదరాబాదు – (సభ్యులు)

*ప్రత్యేకఆహ్వానితులు:* (అనధికారులు)– వర్కింగ్ జర్నలిస్టుల ప్రాతినిధ్యం: శ్రీ. డి. నరసింహారావు, హైదరాబాదు (సభ్యుడు)

## ఖమ్మంజిల్లాప్రెస్ అక్రడీషన్‌కమిటీ

ఈ దిగువ పేర్కొన్న యిదువురినీ ఖమ్మంజిల్లా ప్రెస్ అక్రడీషన్ కమిటీ అనధికార సభ్యులుగా ప్రభుత్వం నియమించింది:– ప్రాంతీయ వర్కింగ్ జర్నలిస్టుల ప్రతినిధి– శ్రీ హీరాలాల్ మోరియా, ఖమ్మం; శ్రీ వంగ సుబ్బారావు, తెలుగుపక్షపత్రిక 'మనదేశం' సంపాదకుడు, కొత్తగూడెం.

## తుపాకులుమొదలైనవాటిపైగుర్తులు

ఏ వ్యక్తిఅయినా తనవద్ద, తయారుచేసిన వారిపేరు, దాని నెంబరు, ఇతర గుర్తులు వివరంగా లేని తుపాకీ మొదలయిన ప్రేలుడు ఆయుధాలను కలిగివున్నట్లయితే అట్టివ్యక్తి యీ ప్రకటన ఆంధ్రప్రదేశ్ గజెటులో ప్రచురణ అయిన రెండునెలలలోగా దానిపై గుర్తులు వేయించుకోవాలి.

ప్రేలుడు ఆయుధాలపై వేసే సూచించబడిన జిల్లా అక్షరాల గుర్తులు ఈ విధంగా వుంటాయి:

ఆదిలాబాదు ఎపిఐ, అనంతపురం ఎపిఎ, కడప ఎ పి డి, తూర్పు గోదావరి ఎ పి పి, పశ్చిమ గోదావరి ఎ పి డబ్ల్యు, గుంటూరు

ఎ పి జి, హైదరాబాదు జిల్లా ఎ పి ఎఫ్, కరీంనగర్ ఎ పి ఆర్, ఖమ్మం ఎ పి హెచ్, కృష్ణా ఎ పి కె, కర్నూలు ఎ పి క్యు, మహబూబ్ నగర్ ఎ పి ఎమ్, మెదక్ ఎ పి బి, నల్గొండ ఎ పి ఎల్, నెల్లూరు ఎ పి ఎన్, నిజామాబాద్ ఎ పి జె, ఉత్తర విశాఖ ఎ పి ఎస్, దక్షిణ విశాఖ ఎ పి వి, వరంగల్లు ఎ పి ఒ, హైదరాబాదు నగరం ఎ పి ఎక్స్.

ఆయావ్యక్తులకు సంబంధించిన లైసెన్సు అధికారుల ఆర్మ్స్ రిజిష్టరులోని వరుస నెంబరు, లేదా ఇ ఎక్ అనే అక్షరాలను కలిగివున్న కారణంచేత ఆ ప్రేలుడు ఆయుధాన్ని తనవద్ద వుంచుకోవడంలో లైసెన్సు పొందడంనుండి మినహాయింపు విషయం, సంవత్సరపు ముద్ర యీ విధంగా యీదిగువ ఉదహరించినచోట వుంటాయి.

రైఫిల్ — బేరల్ మీదా, రైఫిల్ వెనుక భాగంమీద. తుపాకులు, పిస్తోళ్ళు — బేరెల్ మీద, రివాల్వర్లు — వెనుకభాగంమీద, సిలెండరుమీద.

## ఆహారధాన్యాలవర్తకుల లైసెన్సింగ్ ఉత్తరువుసవరణ

1964వ సం.పు ఆహారధాన్యాల అమ్మకందారుల లైసెన్సింగ్ ఉత్తరువులోని కొన్ని భాగాల అమలుపట్లతలఎత్తే కొన్నిబాధల విషయంలో ఆహారధాన్యాల అమ్మకందారుల సంఘాలవారు విన్నవించుకున్న విన్నపాలపై, అవసరమైతే రాష్ట్ర ప్రభుత్వాలు యీ లైసెన్సింగ్ ఉత్తరువులో అవసరమైన మార్పులు చేసుకోవచ్చని భారత ప్రభుత్వం సూచించింది.

ప్రభుత్వం సివిల్ సప్లయిల కమీషనరుతో సంప్రదించి, భారతప్రభుత్వం సూచించిన సవరణలను పరిశీలించి, 1964 సం పు ఆంధ్రప్రదేశ్ ఆహారధాన్యాల అమ్మకందారుల లైసెన్సింగ్ ఉత్తరువులోని కొన్ని భాగాలను సవరించడానికి నిశ్చయించింది.

### సవరణలు

1964 సం. పు ఆంధ్రప్రదేశ్ ఆహారధాన్యాల వర్తకుల లైసెన్సింగు ఉత్తరువులలో — 6వ క్లాజుబదులు యీ దిగువ పేర్కొన్న భాగాన్ని చేర్చవలెను —

"*6. సెక్యూరిటీ డిపాజిటు :* — ఈ ఉత్తర్వు అమల్లోనికి వచ్చేనాటికి 1963 వ సం. ఆంధ్రప్రదేశ్ ఆహారధాన్యాల వర్తకుల లైసెన్సింగ్ ఉత్తర్వు క్రింద జారీచేసిన చెల్లే లైసెన్సుగల ప్రతివర్తకుడూ 1964 మార్చి 31 వ తేదీనకానీ, తత్పూర్వంకానీ, అలాగే ఈ ఉత్తర్వు అమల్లోనికి వచ్చిన పిమ్మట దాని నిబంధనలక్రింద లైసెన్సు కొరకు దరఖాస్తుచేసే ప్రతివ్యక్తి అతనికి లైసెన్సు జారీచేయబడడానికి పూర్వం (1) అతను టోకువర్తకుడైతే రూ. 500/— ల మొత్తాన్నీ, (2) చిల్లర వర్తకుడైతే రూ. 100/— ల మొత్తాన్నీ కాష్ సెక్యూరిటీ ద్వారా లైసెన్సు జారీచేసే అధికారివద్ద డిపాజిటు చేయాలి. కాష్ సెక్యూరిటీజాతీయ రక్షణ సర్టిఫికెట్లరూపంలోకానీ, జాతీయ పొదుపు సర్టిఫికెట్లు మొదలైనవాటి రూపంలో కానీవుండవచ్చు. తనకు లైసెన్సుమంజూరు చేయడానికిగాను విధించబడిన షరతులను పాటించే నిమిత్తమై ఈ సర్టిఫికెట్లు లైసెన్సు జారీచేసిన అధికార్లపేర తాకట్టుపెట్టబడాలి.

అయితే టోకు వినియోగదార్ల సహకార సంఘాలకు, ప్రాథమిక సహకార స్టోర్సుకు ఈ క్లాజు నిబంధనలేవీ వర్తించవు".

(2) షెడ్యూలు I స్థానే దిగువ అంశం చేర్చబడుతుంది :

షెడ్యూలు - 1

(క్లాజు 2 (బి) చూ )

1. గోధుమ, 2. వరి, 3 బియ్యం, 4. జొన్న, 5. సజ్జ, 6. మిలో,

(3) షెడ్యూలు II ఫారం 'బి'లో (ఏ) షరతు 2 లోని ప్రస్తుతపు "గమనిక" స్థానే దిగువ అంశం చేర్చబడుతుంది :—

*గమనిక :—* ఒకవేళ లైసెన్సుదారు తన ఆహారధాన్యాలను పైన పేర్కొనబడిన ప్రదేశాలు మినహా యితరచోట్లలో నిలువ చేయదలచినట్లయితే అతను గిడ్డంగిని వాస్తవంగా ఆక్రమించుకున్నప్పటినుంచి 48 గంటలలోగా ఆ విషయమై తెలియజేయాలి. మార్పులకు సంబంధించి లైసెన్సు దాఖలుచేయాలి.

9 వ నిబంధన స్థానే దిగువఅంశం చేర్చబడుతుంది :—

"9. (ఏ) లైసెన్సుదారు ఒకవేళ టోకు వర్తకుడైనట్లయితే ఆహారధాన్యాలను చిల్లర వర్తకులకు (ఒకవేళ తాను చిల్లరగా ధాన్యం అమ్మకం జరుపుతున్నట్లయితే తనతోసహా) మాత్రమే విక్రయించాలి. టోకువర్తకుడు ఉత్పత్తి (మిగులు) కేంద్రాలలో వ్యాపారం సాగిస్తున్నట్లయితే, లైసెన్సింగ్ అధికారి మధ్య మధ్య ఈ విషయంలో ఇచ్చేటటువంటి ఆదేశాలననుసరించి వినియోగ కేంద్రాలలోని టోకువర్తకులకుకూడా ధాన్యం అమ్మడానికి అనుమతించబడతాడు. చిల్లర వర్తకుల రిజిస్టరు, ఫారం 'డి'లో వుండాలి.

(బి) చిల్లర వర్తకుడు అతడు రిజిస్టరు చేసుకున్న టోకువర్తకునివద్ద ధాన్యం నిలువ లేకపోయినట్లయితే అతడు రిజిస్టరు చేసుకోని మరోటోకు వర్తకునివద్ద ధాన్యం కొనడానికి అనుమతించబడతాడు ఇందుకు మరేదైనా ఆమోదయోగ్యమైన కారణంకూడా వుండవచ్చు.

(సి) టోకువర్తకుడు, ఒక బస్తానుకానీ అంతకు ఎక్కువకానీ ఏకమొత్తంగా కొనే వినియోగదారుకు నేరుగా టోకుధరకు ధాన్యం

విక్రయించడానికికూడా అనుమతించ బడతాడు. ఇటువంటి వ్యాపారానికి సంబంధించిన అంశాలను ప్రత్యేక రిజిష్టరులో ఫారం 'ఇ'లో వ్రాయాలి.

(2) గోధుమ పదార్థాలను అమ్మడానికీ, నిలువచేయడానికీ లైసెన్సు ఒసగబడిన రోలరు పిండి మిల్లులు లైసెన్సు పొందిన హోల్ సేల్ వర్తకునకు అమ్మేవిషయంలో నిబంధన 9 (ఎ) వర్తించదు.

(4) షెడ్యూలు II, ఫారం సి లో

(ఎ) పద్దు (2)ఎ ఆఖర్లో ఈ దిగువ గమనికను చేర్చవలెను.

*గమనిక* :– మార్కెటు, లేదా మార్కెటులు, ప్రతి మార్కెటునుండి కొనుగోలు చేసిన మొత్తం వివరాలను తెలియజేస్తూ లైసెన్సుదారుడు 'సరఫరా మార్గం' నకు సంబంధించిన సమాచారాన్ని; అందజేయవలసి వుంటుంది. 200 క్వింటాలులు, ఆపైన ఒకేచోటకొంటేనే తప్ప ప్రతి వర్తకుని పేరూ, ఆ వర్తకునివద్ద కొనుగోలు చేసిన ప్రతిసరుకు పరిమాణం మొదలయిన సమాచారాన్ని యివ్వనవసరంలేదు."

(బి) పద్దు 3(ఎ) మరియు (బి) లలో "అమ్మబడిన పరిమాణం" అన్న మాటలు తరువాత యీ దిగువ మాటలను చేర్చవలెను. అవి:

"లైసెన్సుపొందిన యితర హోల్ సేల్ వర్తకులకు, చిల్లరవర్తకులకు, వినియోగదార్లకు"; మరియు

(సి) పద్దు 5 బదులు యీ దిగువభాగాన్ని చేర్చవలెను అది :–

"5. అర్ధసంవత్సరం ఆఖర్లో అమ్మబడిన ప్రతి ఆహారధాన్యాల సరకు విషయంలో సగటు మార్జిను వివరాలు –

*గమనిక* : ప్రతి ఏటా జూన్ 30 తోనూ, డిశంబరు 31 తోనూ ఆఖరయ్యే ప్రతి అర్ధ సంవత్సరానికి పద్దు 2(బి), 3(సి) మరియు 5 ల విషయంలో సమాచారాన్ని లైసెన్సు దారుడు అందచేయవలసి వుంటుంది. ఈ సమాచారాన్ని ప్రతి అర్ధసంవత్సరపు మొదటి పక్షంలోని అమ్మకాలతో బాటు అందచేయవలసి వుంటుంది. ఆ తరువాతి అర్ధసంవత్సరంలోని చివరిపక్షంలో కూడా అలాగే చేయాలి.

గోధుమ పదార్థాల విషయంలో మిల్లుకు పూర్వం వుండవలసిన ధరలు చట్టబద్ధంగా నిర్ణయించబడి వున్నందున పద్దులు 2 (బి), 3(సి), (5) ల విషయంలో సమాచారాన్ని యివ్వడంనుండి పిండిమిల్లులను సడలించడం జరిగింది.

(I) బియ్యం
(ఎ) వాడుక
(బి) రవాణా
(సి) ......
(డి) ......
(ఇ) నికరలాభం
(II) గోధుమ :
(ఎ) వాడుక
(బి) రవాణా
(సి) ......
(డి) ......
(ఇ) నికరలాభం
(III) వరి (ధాన్యం)
(ఎ) వాడుక
(బి) రవాణా
(సి) ......
(డి) ......
(ఇ) నికరలాభం
(IV) జొన్న :
(ఎ) వాడకం
(బి) రవాణా
(సి) ......
(డి) ......
(ఇ) నికరలాభం
(V) సజ్జ :
(ఎ) వాడుక
(బి) రవాణా
(సి)......
(డి)......
(ఇ) నికరలాభం
(VI) మిలో
(ఎ) వాడకం
(బి) రవాణా
(సి) ......
(డి) ......
(ఇ) నికరలాభం

To
1. లైసెన్సు అధికారి జిల్లా
స్థలం.......... సంతకం
తేదీ......... లైసెన్సు నం.

(5) షెడ్యూలు II లో ఫారం 'డి' తరువాత యీ దిగువ యిచ్చిన ఫారంను చేర్చవలెను. అది :–

"ఫారం ఇ

(ఫారం బిలోని 9 (సి) నిబంధనను చూడుడు)

వినియోగ దారుల రిజిష్టరు

(1) వినియోగదారునిపేరు

(2) చిరునామా"



(63 వ పేజీ తరువాయి)

(1) నరసింహుని ఆదిశిల్పాలు. (2) దక్కన్ మధ్యయుగ చరిత్ర (3) సలిహుండంలోని బౌద్ధ అవశేషాలు (4) శాత్రవనాణాలు (5) బహమనీ నాణాలు,

అభివృద్ధి పథకాలు :

మ్యూజియంల అభివృద్ధి పునర్నిర్మాణ పథకం క్రింద ప్రజలకు మంచినీటి సౌకర్యం కలిగించడానికి హైద్రాబాదు మ్యూజియం, అజంతా పెవిలియన్, వేలేశ్వరం పెవిలియన్‌లలో మూడు మంచినీటి శీతల సాధనాలను రు. 5,025–00ల ఖర్చుతో కొనుగోలు చేశారు యీ ఖర్చును పూర్తిగా భారత ప్రభుత్వం భరిస్తుంది. మ్యూజియంలకు వచ్చే ప్రజలకు ఫిల్ముల ద్వారా యీ శాఖ విధి నిర్వహణ అంశాలను తెలియపర్చడానికి వీలుగా యీపథకం క్రింద రు. 3,285–00ల ఖర్చుతో 16 యం. యం. సినిమా ప్రొజెక్టరును కొనుగోలు చేశారు.



అభ్యుదయం

*రహదార్లశాఖ :*

మద్రాసు - కలకత్తా జాతీయరహదారి, విజయవాడవద్ద ప్రకాశం బారేజ్‌మీదుగా కృష్ణానదిని దాటుతుంది. యీ రోడ్డు విజయవాడ పట్టణంగుండా వెళ్తుంది. దీని వెడల్పు చాలా తక్కువగా ఉంది. యీ రోడ్డుపై రాకపోకలు విస్తారంగా జరుగుతుంటాయి. రాకపోకల రద్దీవల్ల నేరుగా ప్రయాణంచేసే శకటాల రవాణాకు ఆలస్యం జరుగకుండా వుండేందుకై "ప్రకాశం బారేజ్" ఉత్తరం భాగం చివరినుంచి ప్రస్తుత జాతీయ రహదారిలో 276/2.3 వ మైలువరకు ఒక మళ్ళింపు రోడ్డును నిర్మిస్తున్నారు. యీ రోడ్డు బందరుకాలువను విజయవాడలో 3/1 మైలువద్ద కృష్ణాబారేజ్ మీదుగా దాటుతుంది.

ఈ రోడ్డులో బందరు కాలువపైన రు. 7.00 లక్షల ఖర్చుతో వర్తులాకారపు వంపురూపంలో ఒక క్రొత్తరకం వంతెనను నిర్మించారు. మన రాష్ట్రంలో ఇదే మొదటి వర్తులాకారపు వంతెన. దీనిని వర్తులాకారపు వంతెనగా వ్యవహరిస్తారు.

ఈ వంతెనకు 160 అడుగుల సెంట్రల్ స్పాన్ (వంపురేఖ పొడవునా) ఉంది. దీనికి రెండువైపులా 40 అడుగుల కాంటిలివర్ స్పానులు — బోలుపెట్టె గిర్డర్‌వంటిసూపర్ స్ట్రక్చర్‌తో ఉన్నాయి. వంతెనపైన రాతి అడుగుల మధ్యలో 26 అడుగుల రోడ్డుదారి ఉంది. రెండువైపుల 5 అడుగుల కాలిబాట కూడా ఉంది. బందరు కాలువలో నడిచే నావలు యీ వంతెనగుండా వెళ్ళేందుకు అవసరమైన నౌకాయానా సౌకర్యాలు కూడా కలిగించారు.

యీ వంతెన జాతీయ రహదారిపై ఉన్నందువల్ల దీని నిర్మాణానికి అయిన మొత్తంఖర్చును భారతప్రభుత్వంభరించింది.

*విద్య :* 1964 ఫిబ్రవరి 20 న తేదీన ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ డైరెక్టరు నాగార్జునసాగర్‌వద్ద "విజ్ఞానశాస్త్ర, గణితశాస్త్రానికి చెందిన పరిశీలక సామాగ్రి"కి సంబంధించిన వర్కుషాపుకు ప్రారంభోత్సవం చేశారు. 4 రోజులపాటు యీ వర్కుషాపును నిర్వహించారు. ఇందులో పాల్గొన్నవారు 14 యూనిట్లను సెలక్టు చేశారు. మొత్తం 450 నుంచి 470 పరీక్షక అంశాలను వారు నిర్మించారు. ఇందులో కొన్ని నిపుణతతోనూ, కొన్ని అనుభవ విజ్ఞానంతోనూ నిర్మించారు.

*మత్స్య పరిశ్రమ :*

మత్స్య వనరులు ఎక్కువగా ఉన్న కోనసీమ ప్రాంతంలో మత్స్య పరిశ్రమను అభివృద్ధి పరచడానికి కోనసీమ జాలర్ల కేంద్ర సహకార సంఘం రు 56.00 లక్షలు ఖర్చుకాగల మాస్టర్ ప్రణాళికను తయారు చేసింది. 84 గ్రామాలలోని జాలరులకు లాభించడానికి యిది ఉద్దేశించబడింది. యీ ప్రాంతంలో మొత్తం 7243 టన్నుల చేపల ఉత్పత్తి జరిగింది. యీ ప్రాంతంలోని రొయ్యచేపల ఉత్పత్తి విలువ దాదాపు రు. 10.00లక్షలకు ఉంటుందని అంచనా.

రాష్ట్రప్రభుత్వం రు 1.50 లక్షలు వాటాధనంగా ఇచ్చింది. యీ పథకం అమలు ద్వారా యీ ప్రాంతంలో అదనంగా 11,000 టన్నుల చేపల ఉత్పత్తి జరుగుతుందని భావించబడుతున్నది. ఐస్ ప్లాంట్లు శీతల గిడ్డంగులు, మొదలైన వాటిని నెలకొల్పుతారు. యీ పథకం క్రింద త్వరిత గతి రవాణా సౌకర్యాలకై మోటారులను కూడా నడుపుతారు. భారత ప్రభుత్వం యీ మాస్టర్ ప్రణాళికను ఆమోదించి 1963-64 సంవత్సరంలో రు. 5 00 లక్షల రుణసహాయాన్ని కూడా మంజూరు చేసింది.

*పరివారారోగ్యం :*

1964 ఫిబ్రవరి మాసంలో రాష్ట్రంలో మొత్తం 237 గ్రామీణ కుటుంబ నియంత్రణ కేంద్రాలు, 63 పట్టణ కుటుంబ నియంత్రణకేంద్రాలు నిర్వహింపబడ్డాయి. భారత ప్రభుత్వం సూచించిన సవరించబడిన నిర్వహణ, సిబ్బందీ నమోనాలో 1964-65 సంవత్సరంకాలంలో అమలుజరిగే బ్లాకుస్థాయి గ్రామీణ కుటుంబ నియంత్రణ కార్యక్రమంలో బాల బాలికల దినోత్సవం మొదలైన పథకాలను ఏకీకరణ చేసి అదనంగా 30 గ్రామీణ కుటుంబ నియంత్రణ కేంద్రాలను నెలకొల్పాలని ప్రతిపాదించారు.

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో నిర్వహింపబడుతున్న 4 సంచారక శస్త్రచికిత్సా యూనిట్లు ఇంతవరకు 749 కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలను చేశాయి. 1964-65 వ సంవత్సరంలో ప్రతిజిల్లాకు ఒకటి చొప్పున ఇటువంటి యూనిట్లను ఏర్పాటు చేసే ప్రతిపాదనలు పరిశీలనలో ఉన్నాయి.

*ఇండియన్ మెడిసిన్ :*

1963-64 వ సంవత్సరంలో ఇండియన్

మెడిసిన్ శాఖకు చెందిన వివిధ ప్రణాళికా పథకాల అమలుకై ప్రారంభంలో మొత్తం రు. 3.25 లక్షలు ప్రణాళికా కేటాయింపులు జరిగాయి. (ఆంధ్రలో రు. 1.34 లక్షలు, తెలంగాణాలో రు. 1.91 లక్షలు) ఆ తర్వాత యీ మొత్తాన్ని రు. 2.64 లక్షలకు సవరించారు. (ఆంధ్ర రు. 0.85 లక్షలు; తెలంగాణా రు. 1.79 లక్షలు). 1964 మార్చి ఆఖరువరకు రు. 2.32లక్షలు ఖర్చుచేశారు. 88 శాతం ఖర్చు జరిగింది. ప్రాంతాలవారీగా ఖర్చు దిగువ పేర్కొన్న విధంగా జరిగింది.

భారత మెడిసిన్‌కు చెందిన ప్రతి ప్రణాళికాపథకం వివరాలను దిగువ పేర్కొనడం జరిగింది.

## ఆంధ్ర ప్రాంతం

*ఆయుర్వేద, యూనాని ఆసుపత్రుల విస్తరణ :*

1963–64 వ సంవత్సరం సవరించబడిన ప్రణాళికా కేటాయింపుల మొత్తం నుండి రు. 0.76 లక్షలు యీ పథకం అమలుకై ఖర్చు చేశారు. మూడవ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాల కాలంలో మంజూరు చేసిన 8 ఆయుర్వేద, యూనాని ఆసుపత్రుల మంజూరీతోడు 1963–64వ సంవత్సరంలో అదనంగా 10 ఆసుపత్రు (ఆయుర్వేద, యూనానీ) లను మంజూరు చేశారు.

1964 మార్చి ఆఖరువరకు యీ విస్తరణ పథకం క్రింద రు. 0.604 లక్షలు ఖర్చు చేశారు. ఖర్చుశాతం 80 ఉంది.

*హోమియోపతి, ప్రకృతి చికిత్స అభివృద్ధి :*

1963–64వ సంవత్సరంలో సవరించబడిన ప్రణాళికా కేటాయింపులలో యీ అభివృద్ధి పథకం అమలుకై రు. 0.09 లక్షలు కేటాయించారు. 1964 మార్చి ఆఖరువరకు యీ మొత్తంలో రు. 0.032 లక్షలు ఖర్చు చేశారు. ఆంధ్ర ప్రాంతంలోని వివిధ క్లినిక్కులకూ, ఆసుపత్రులకు సహాయగ్రాంట్ల చెల్లింపులకు యీ మొత్తాన్ని ఖర్చు చేశారు.

## తెలంగాణా ప్రాంతం

*హైదరాబాద్ లోని ఓషధి నిలయంఅభివృద్ధి:*

1963–64 వ సం॥ లో యీ పథకం అమలుకై రు. 0.11 లక్షలు కేటాయించారు. 1961–62, 1962–63 సంవత్సరాలలో మంజూరుచేయబడి కొనసాగించబడుతున్న పథకాలకుమాత్రమే యీ మొత్తం ఉద్దేశించబడింది. 1964 మార్చి వరకు రు. 0.125 లక్షలు ఖర్చుచేశారు.

*ఆయుర్వేద, యూనానీ ఆసుపత్రుల విస్తరణ:*

ఆయుర్వేద, యూనానీ ఆసుపత్రుల విస్తరణకు, వరంగల్లులోని ప్రభుత్వ ఆయుర్వేద ఆసుపత్రి విస్తరణకు రు. 0 47 లక్షలు కేటాయించారు 1961–62, 1962–63వ 8సంవత్సరాలలో మంజూరు చేయబడి, కొనసాగించబడుతున్న పథకాల అమలుకు యీ మొత్తాన్ని నిర్దేశించారు. 1964 మార్చిఆఖరు వరకు యీ విస్తరణ పథకం అమలుకై రూ. 0.436 లక్షలు ఖర్చుచేయడంజరిగింది. యీ పథకానికి కేటాయించిన మొత్తంలో ఇది 93 శాతం ఉంటుంది.

*హోమియోపతి, ప్రకృతిచికిత్స ఇతర పద్ధతుల అభివృద్ధి :*

యీ అంశంక్రింద 1963–64 వ సం॥ సవరించబడిన ప్రణాళికలో రు. 0.10 లక్షలు కేటాయించారు 1964 మార్చి ఆఖరువరకు వివిధ ఆసుపత్రులకు గ్రాంట్లుగా రు. 0.025 లక్షలు ఖర్చుచేశారు.

*ప్రస్తుతం ఉన్న ఆయుర్వేద, యూనానీ కళాశాలల అభివృద్ధి :*

1963–64 వ సం॥ సవరించబడిన ప్రణాళికలో దిగువ తెల్పినవాటి అభివృద్ధికై రు. 0.59 లక్షలు కేటాయించారు.

(1) నిజామియా జనరల్ ఆసుపత్రి, హైద్రాబాదు, (2) ప్రభుత్వ ఆయుర్వేద ఆసుపత్రి, హైదరాబాదు, (3) ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, హైదరాబాదు, (4) నిజామియాతిబ్బీకళాశాల, హైద్రాబాదు.

నిజామియా జనరల్ ఆసుపత్రిలో అదనపు సిబ్బందిని మంజూరుచేశారు. 1964 మార్చి ఆఖరువరకు కేటాయింపునుండి రు. 0.589 లక్షలు ఖర్చుచేశారు.

*ఆయుర్వేద, యూనానీ ఫార్మసీల విస్తరణ*

1963–64 వ సం॥ సవరించబడిన కేటాయింపులో రు. 0 28 లక్షలు, ఇండియన్ మెడిసిన్ ఫార్మసీ అభివృద్ధికై కేటాయించారు. ఇండియన్ మెడిసిన్ శాఖలో యంత్ర పరికరాల కొనుగోలుకు,ఇదివరకే మంజూరు చేయబడిన సిబ్బందీఖర్చులకై యీ మొత్తాన్ని కేటాయించారు. 1964 మార్చి ఆఖరువరకు రు. 0.302 లక్షలు ఖర్చుచేశారు.

*ఇండియన్ మెడిసిన్ శాఖ అభివృద్ధి :*

1963–64 వ సం॥ సవరించబడిన ప్రణాళిక పథకంలో రు. 0.24 లక్షలు కేటాయించారు. మంజూరు చేయబడి, కొనసాగించబడుతున్న పథకాలు, స్పెషల్ ఆఫీసర్ కార్యాలయంలో అదనపు సిబ్బందీ మంజూరీకై యీ మొత్తాన్ని నిర్దేశించారు. 1964 మార్చి ఆఖరువరకు రు. 0.207 లక్షలు ఖర్చుచేయడం జరిగింది.

*పురావస్తుశాఖ :*

1963–64 వ సంవత్సరంలో దిగువ తెల్పిన వస్తువుల సంరక్షణ కార్యక్రమాలను కొనసాగించారు. దీనికై రు. 7,258.81 నయాపైసలు ఖర్చు చేశారు.

(I) దిచ్చిపల్లి దేవాలయం...రు 1536_86
(II) హైదరాబాదులోని
షేరె _ బాతిల్ కమాన్...రు. 1,417_95
(III) పెద్ద తుంబాలంలోని
రామాలయం...... రు. 1,145_90
(IV) బోధన్‌లోని తుగలక్
మసీదు...... రు. 1,137_97
(V) రాజమండ్రిలోని పురాతన
రాయల్ మసీదు... రు. 2000_00
మొత్తం. రు. 7258_81

ఏలేశ్వరంలో మూడవ క్షేత్ర కాలం త్రవ్వకాలను సకాలంలో 1963 నవంబరు 4వ తేదీనుంచి ప్రారంభించారు. దేవాలయం నిర్మించబడిన స్థలంలో యీ త్రవ్వకాలను ప్రారంభించారు. దీనివల్ల అమూల్యమైన పురాతన వస్తువులు లభించి, 2వ శతాబ్దం ఆరంభం నుండి మూడవశతాబ్దం ఆఖరు వరకు మరియు నేటి కాలంవరకుగల మెగాలిథిక్ సంస్కృతికి సంబంధించి కాలనిర్ణయం చేయడంలో పురావస్తుశాఖకు యివి ఎంతో సహాయకారి అయ్యాయి.

పూర్వ ఇక్ష్వాకుల కాలంనాటి విషయాలకు సంబంధించిన సాక్ష్యాధారాలు నాగార్జున కొండలో చాలా ఎక్కువగా లభించాయి. అయితే ఇక్ష్వాకుల తర్వాత కాలంలోని వివిధ దశలకు చెందిన కట్టడాలు ఏలేశ్వరంలో లభించాయి.

ఇక్ష్వాకుల పరిపాలకుల తర్వాతపల్లవులు యీ ప్రాంతాన్ని పాలించారని పండితులు ఇప్పటివరకు అభిప్రాయపడ్డారు. కాని స్థూపంక్రింద లభించిన క్రీ. శ. 4 శతాబ్దానికి చెందిన అనేక విష్ణుకుండిని నాణాలు, యీ ప్రాంతాన్ని పల్లవులుగాక విష్ణుకుండినులు పాలించారని నిరూపించాయి. ఇది చెప్పుకోదగిన విషయం. దీనివల్ల పండితులతప్పుడు అభిప్రాయాలు మారడమేగాక ఆంధ్రదేశ చరిత్రలో క్రొత్త అధ్యాయాలను చేర్చడం జరిగింది.

ప్రస్తుత త్రవ్వకం కాలంలో దేవాలయ స్థలం సమీపంలోని దిగువ భూములలోనూ పై తెలిపిన స్థలానికి ఫర్లాంగుదూరంలోని మట్టికట్ట వరుసగానూ కందకాల త్రవ్వకాల పనిని చేపట్టడం జరిగింది. స్థల విజ్ఞానప్రాతిపదికగా సాంస్కృతిక అంశాలను కనుగొనడానికి వీలుగా యీ పనిని ప్రారంభించారు.

నిక్షిప్త నిధులనుంచి రాతియుగానికి చెందిన ఆరంభ, మధ్య, తర్వాతి కాలాలకు సంబంధించిన పరికరాలు ఇంతవరకు లభించలేదు. అయితే యీ త్రవ్వకాలఫలితంగా ఆరంభ రాతియుగానికి చెందిన రాతి గొడ్డండ్లు, కత్తులు, కటార్లు, మట్టిబొమ్మలు మొదలైనవి, మధ్యరాతియుగానికి చెందిన పరికరాలు లభించాయి.

భారతప్రభుత్వ పురావస్తుశాఖ డైరెక్టర్ జనరల్ 1964 ఫిబ్రవరి 7వ తేదీన యీ స్థలాన్ని పరిశీలించి యీ త్రవ్వకాల కార్యక్రమాన్ని 1964 మే 31వ తేదీవరకు పొడుగించాలని ఆయన సిఫారసు చేశారు. ఆయన నివేదికను అనుసరించి త్రవ్వకాల కార్యక్రమాన్ని ఆయన తెల్పిన తేదీవరకు కొనసాగిస్తారు. ప్రస్తుత త్రవ్వకాలసమయంలో ప్రతికాలానికి చెందిన సంస్కృతికి సంబంధించిన అనేక పురాతన వస్తువులు, మృణ్మయ పాత్రలు, పాన్పులు, రాతి విగ్రహాలు, రోమన్ లాంతర్లు లభించాయి. వీటికితోడు మల్లగుట్ట క్రిందిభాగంలో ఉన్న కిష్టాపురంలో పెద్దరాతి యుగానికిచెందిన శ్మశాన వాటిక బయటపడింది. ఇందులో ఉక్కుపరికరాలు, మామూలు ఎరుపునలుపు సామ్రాగ్రి లభించాయి.

దేవాలయం స్థలంలోని బాణలింగాలు, దేవతావిగ్రహాలు తరలించినతర్వాత త్రవ్వకాలు ప్రారంభించారు. ఒకటి రెండు ప్రాంతాలలో ఇక్ష్వాకుల అంతస్తులకు సంబంధించిన వివరాల వెల్లడికై యీ పని నిర్దేశించారు. గత సంవత్సరం ఒక మండపం బయటపడింది. దీనికి సంబంధించిన అవశేషాలు దాదాపు అక్కడి అన్ని కందకాలలోనూ లభించాయి. యీ మండపం నిర్మాణ అంతాన్ని కనుకొనడానికి దేవాలయం స్థలం ఆగ్నేయ దశలో వరుసగా మరికొన్ని కందకాలు త్రవ్వారు. దీని తుది ఇక్కడ లభించి అది ఉత్తరదిశ మళ్ళినట్టు బయటపడింది. దీనివల్ల యీ మండపంయొక్క సరిఅయిన కొలత వివరాలు తెలుసుకొనే అవకాశం లభించింది. స్థల విజ్ఞానశాస్త్రం అనుసరించి ఇక్ష్వాకుల కాలానికి పూర్వం క్రీ॥ శ॥ 2వ శతాబ్దంలో యీ మండపాన్ని నిర్మించి ఉండవచ్చు. యిది శాతవాహన కాలానికి సమానమైన కాలం. శాతకర్ణి సకాలానికి చెందిన రెండు నాణాలుకూడా లభించడంవల్ల యీ నిర్ణయాన్ని మరింత ధ్రువపరుస్తుంది.

యీ దేవాలయం స్థలానికి అంటివున్న చిన్నగుట్టకొనలో వర్తులాకారంలో ఉన్న కొన్ని గోతులు, చెక్కనిరాతి గోడలు బయటపడ్డాయి. ఇది ఆదిమానవులు నివసించిన గోతులు అవునేమోననే సందేహంతో ఇక్కడి అంశాలనుపరిశీలిస్తున్నారు. యీవైపు త్రవ్వకాలు అభివృద్ధి దశలో ఉన్నాయి. అనుకున్న గడువులో యీపనులు పూర్తి అవుతాయని భావించబడుతున్నది.

ప్రచురణలు :

1963_64వ సంవత్సరంలో దిగువ తెల్పిన పుస్తకాలను ప్రచురించారు. దీనికై రు. 16,830_29 న. పై. లు ఖర్చుచేశారు.

[మిగతా 60 వ పేజీలో]

# సాహసస్నేహం

—పి. హనుమయ్య

ఘల్లున తెల్లవార నవభాస్కరమూర్తి గులాబి గుత్తులన్
జల్లులుగట్ట రువ్వుచు నవప్రసూనకున్ గిలిగింత వెట్టు నీ
చల్లని వేళలో పడగ చక్కగ విప్పి కళాతపస్వివై
నల్లనికోడెనాగమయ నాట్యముచేయుచునున్న వాడవా!

నిగనిగలాడెడి మేని జిగినిగ్గులు నీల పయోదమాలలై
గగన పథంబులన్ సుడులుగట్ట నటించు ఫణీంద్రరాజ! నీ
సొగసుకుమూలమైన అలసుందరవేణి, యెరుంగమేమొకో,
పొగడుకొనెన్ బడాయి కనబోకుము, నా ప్రియురాలిదే నయా!

నా వగలాడి కీల్జెడను నాయికపాత్రగ నృత్యశిల్పమం
దీవు ధరించుచుండు నటకేశ్వర మూర్తివి; భావుకుండనై
దేవప్రసూనముల్ దురుము ధీరప్రియుండను నేను; నేటితో
దేవులాట మానుకొందము మదిన్ నరనాగ విరోధభావమున్.

కోరలయందు మృత్యువునకున్ బలిపీఠము గట్టితంచు నిన్
దూరి, భయంబుజెంది, కసితో వధియించెడి మానవుండ శే
షీరుడు; ప్రాణరక్షకయి పేశల సుందర సృష్టిరూపమున్
దారుణహత్యసేయుటయె ధర్మముగా తలదాల్చు మూర్ఖుడున్.

ముల్లులసెజ్జపై కుసుమముల్ వికసించు విచిత్ర విశ్వమున్
వల్లభుడౌచు జుట్టుకొన వచ్చును సాహసమున్న వాడు; ని
న్నెల్లపుడున్ భయంబుగ భరించెడి గుండెకు రమ్యభావనో
త్ఫుల్లకళాసుధామధువు భోగ్యము నెట్లగునోయి నేస్తమా!

నాదు ప్రియురాలి జడవోలె నాగమయ్య!
ఉంటి వీవంచు భావించుచుందుగాని
యువిద కీల్జడ నిను బోలియున్నదనుచు
ప్రాతకాలంపు కవివోలె పలుకబోను.

---

## స్వీకారం

*** శంభులింగేశ్వర శతకం :—**

ఇది "శంభులింగేశ్వరా!" అన్నమకుటంతో శార్దూల మత్తేభాలతో కూడిన భక్తిభావ బంధురమైన శతకం. కవిత ధారాశుద్ధి కలది. రచయిత: శ్రీకపిల కృష్ణశర్మ. వెల 30 పైసలు. ప్రతులకు: వేంకటేశ్వర బుక్‌డిపో, మెయిన్ బజార్, కొత్తగూడెం.

*** గీతోపదేశం :—**

భగవద్గీతా భావాన్ని అతిసంగ్రహంగా వచనరూపంలో వివరిస్తున్న చిన్నిపుస్తకం. రచయిత: ధనకుధరం వరదాచార్యులు. వెల :— అమూల్యము. పోష్టుఖర్చుక్రింద పదిపైసల స్టాంపులు పంపితే పుస్తకం ఉచితంగా పంపబడుతుంది. ప్రతులకు: రచయిత పేర లక్ష్మీనారాయణపురం, గుంటూరు —4.

*** శ్రీకృష్ణ స్తవతరంగిణి :—**

*** శ్రీ విశ్వేశస్తుతిమాల :—**

"కృష్ణా" అన్నమకుటంతోనూ 'విశ్వేశా' అన్న సంబోధన భక్తిభావంతో కూడుకొన్న కందపద్యాలతోకూడిన శతకద్వయమిది. ఈ రెండిటి రచయిత్రి శ్రీమతి కొత్తపల్లి లక్ష్మీకామేశ్వరమ్మ. ఒక్కొక్కటి 50. పై. ప్రతులకు కె. వి. ఆర్. యల్. యస్ శర్మ, బాహుబలేంద్రునిగూడెం, వయా గన్నవరం, కృష్ణాజిల్లా.

*** తొలి చిగుళ్ళు :—**

కవిత్వం వ్రాయాలని వుత్సాహం వున్న పదిమంది యువరచయితలు వ్రాసిన చిరుపొత్తం: ప్రతులకు, ప్రసాద్ పబ్లికేషన్స్ జి. యన్. టి. రోడ్, ఏలూరు. వెల 20 పై.

*** పచ్చబూచి :—**

దేశరక్షణను ప్రబోధించే 15 పద్యగేయ రచన లున్న పుస్తకం. ప్రతులకు : నెలవంక ఎంటర్ ప్రైసెస్, ఖమ్మం.

*** శ్రీనివాస లహరి :—**

శ్రీ వేంకటేశ్వరస్వామి చరిత్రను సంగ్రహంగా వివరిస్తున్న 104 పద్యాలున్న చిరుకృతి. కర్త పొన్నాడ కోటేశ్వరరావు. వెల 75 న. పై. ప్రతులకు: రచయిత పేర 16_1_563/21 సైదాబాద్, హైదరాబాద్.

*** కెన్నడీ గీతం :—**

రచన: సి. హెచ్. రాజలింగం. జాతివిద్వేషానికి బలైపోయిన అమెరికా ప్రెసిడెంట్ జాన్ కెనెడీని గురించిన గేయమయమైన చిన్నకృతి. వెల 25 పై. ప్రతులకు: రచయితపేర సిరిసెల్ల, కరీంనగరం జిల్లా.

*** దేశరక్షణ ప్రబోధ పద్యములు :—**

రచయిత : యమ్. వి. యస్. శర్మ. చైనా దురాక్రమణను పురస్కరించుకొని ప్రబోధాత్మకంగా వ్రాసిన 25 పద్యాలున్న పుస్తకం. ప్రతులకు: రచయితపేర ప్రొద్దుటూరు, కడపజిల్లా. వెల లేదు.




మరెవ్వరయినా అయితే ఆ వార్త విని ఆనందించి వుండేవాళ్లేమో గాని "ఆడపిల్ల" అని తన తల్లి చెప్పగానే అప్పటికే ముగ్గురు ఆడ పిల్లలతో సతమతమై ప్రాణం విసిగిపోయిన కొండయ్యమాత్రం కొండంత బరువుతో అలా క్రుంగిపోయాడు.

"హే భగవాన్ నీకెంత పక్ష పాతముందయ్యా! పిల్లలు మొర్రో అని రాయికీ రప్పకీ మ్రొక్కు కుంటున్న మా జమీందారుగారికి యివ్వక ఏమీ లేని నాలాటి దరిద్రుడి కిస్తావా? వాళ్ళు లక్షలకు లక్షలు సంపాదించి కాలుమీద కాలు వేసుకొని హాయిగా మేడ మీద హంసతూలికాతల్పాలమీద కులుకుతూంటే, ఏ పూట గంజి ఆ పూటకు కూడా నోచుకోకుండా పస్తులు పడుకుంటున్న నన్ను చూసి పరిహాస మాడాలనా? ఇట్లా యెన్ని కష్టాలు పడుతున్నా యింకా నా మీద నీకు దయ కలగ లేదా! చిట్ట చివరికి అడుక్కునే బికారిలా తయారవాలన్నా నీ ఉద్దేశం. ధనవంతులకు పిల్లల్ని యిస్తే వాళ్ల ఆస్తి అంతా కరిగిపోయి చివరకు నీకు టెంకాయల మ్రొక్కుబడులు యివ్వరనా నీ భయం." అని యింకా ఏమేమో తలపోస్తున్న కొండయ్యకు పార్వతి పిలుపు వినవచ్చింది.

"ఎందుకూ?" అన్నట్లు కోపంగా పార్వతి గది గుమ్మం దగ్గరికి విసురుగా వెళ్ళాడు.

లోపల నులకమంచంలో పసిగుడ్డును అక్కున చేర్చుకొని పడుకొని వుంది పార్వతి. తను పడ్డ కష్టమంతా ఆ చిన్నారి పాపను చూసి మరచి పోయినట్లు ఆనందం పట్టలేకుండా వుంది.

"దేనికి పిలిచావు?" కోపంగా అడిగాడు కొండయ్య.

పెనిమిటి రాకను గమనించిన పార్వతి నవ్వుతూ "మన చిన్న తల్లిని చూశారా. ఎంత బావుందో" అని ఆ పసిగుడ్డును కొండయ్యకు చూపించబోయింది.

కొండయ్యకు వళ్ళుమండింది. "చాల్లే యిప్పుడు పిల్లలు లేకపోతే ఎవరు ఏడ్చారు" అని అనేసి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

పార్వతి మనసు చివుక్కు మంది.

"వచ్చేటపుడు జయకి మందు, యింట్లోకి బియ్యం తీసికొని రమ్మన మని మీ నాన్నతో చెప్పమ్మా" అంటూ పెద్ద కూతురు సుశీలను పిలిచి చెప్పింది.

"మందు, బియ్యం" గొణుక్కుంటూ రోడ్డు మీద పడ్డాడు కొండయ్య. రోడ్డు వెంబడి అలా నడుస్తున్నాడన్న మాటే గాని జయకి మందు, యింట్లోకి బియ్యం ఎలా తేవాలో ఆలోచిస్తూనే వున్నాడు. తెలిసినవాళ్లను యిద్దరు ముగ్గుర్ని అడిగి చూశాడు, లాభంలేక పోయింది. ఏం

చెయ్యడానికి తోచక కొంచం సేపు పార్కులోకి నడిచాడు.

"ఛ. తనలాంటి దరిద్రుల యింట్లో కాక మరెవ్వరింట్లోనైనా పుడితే వాళ్ళు సుఖపడే వాళ్ళేమో అని తనను తాను తిట్టుకున్నాడు. తను పడుతున్న బాధలు కుక్కలు కూడా పడవు. వచ్చే డెబ్బయి రూపాయలలో తను, తన తల్లీ, భార్య, ముగ్గురు ఆడ పిల్లలు బ్రతకాలి. తన నోట్లో చదువూలేదు. వెనక తాతముత్తాతలు గడించిపారేసిన ఆస్తీలేదు. కుటుంబ ఖర్చులు పోను జీతంలో ఏమైనా నాలుగు రాళ్ళు వెనుకేసుకొని పిల్లల పెళ్ళిళ్ళు చేద్దామన్న ఆశ అంతకన్నా లేదు. అసలు వెనకెయ్యడాని కేముంది. ఆ వచ్చేదే సరిగా సరిపోనపుడు. అక్కడికీ తను జాగ్రత్తగానే ఖర్చు పెడుతున్నాడు. ఇంట్లో పడుకోడానికి ఒక్క నులక మంచంతప్ప మరోటిలేదు. అదైనా తన ముసలితల్లికి. తన భార్యకి కట్టుకోడానికి సరైనవి రెండు మూడు చీరెలున్నాయి. పెద్దపిల్ల సుశీలకి 18 ఏళ్ళు. అప్పుడప్పుడు దానికి ఓ మంచి చీర కొని పెడుతూండేవాడు, ఎక్కడ దాని మనసు కష్ట పెట్టుకుంటుందోనని. రెండోపిల్లకి 12 ఏళ్ళు. మరో రెండు మూడేళ్ళలో పెళ్లి చేసి పంపాలి. మూడోదానికి 10 ఏళ్ళు. మరో నాలుగయిదు సంవత్సరాలలో పెళ్లి చేయాలి. పోనీ ఎట్లాగో అట్లా వాళ్ళకు చేస్తే హాయిగా కాపరాలు చేసుకుంటారుకదా అనుకుంటే ఆమురిపం కాస్తా తీరింది. తల తాకట్టుపెట్టి అప్పు చేసి సుశీలను అప్రక్కఊళ్ళో ఓఫాక్టరీలో పని చేస్తున్న ప్రకాశానికి యిచ్చాడు. సంవత్సరం తిరగ కుండానే ఓ రోజు కట్టు గుడ్డలతో యింటికి వచ్చేసింది ప్రకాశం తాగి అర్ధరాత్రి యింటికి వచ్చి పెళ్ళాన్ని చావ కొడుతూండేవాడట. అయినా సహించి వూరుకుందిట. కాని ఓ రోజు దాని శీలం మంచిది కాదని యింట్లోనించి బయటికి గెంటి దొమ్మరిదాన్ని తెచ్చి యింట్లో పెట్టుకున్నాట్ట. తరువాత తను ఎన్నోసార్లు నచ్చచెప్పాడు. "నీకూతుర్ని ఏలుకోను పో"మ్మన్నాడు. పెద్దదాన్ని బ్రతుకు అట్లా అయింది. ఇక రెండోది జయ. ఎప్పుడు చూసినా రోగాలే. అసలు చిన్నప్పటినుంచి అది అంతే. ఇప్పుడది నాలుగయిదు రోజులనించి మూసిన కన్ను తెరువకుండా పడుకొని వుంది. పెద్ద డాక్టర్ని తీసుకొద్దామంటే అది తన తాహతుకి మించిన పని. ధర్మాసుపత్రిలో చూపించాడు. ఏదో మందు రాసిచ్చాడు డాక్టరు. కొందామంటే చేతిలో చిల్లిగవ్వ లేదు.

సంసారంలో తను పడుతున్న బాధలు చూస్తూంటే ఆత్మహత్య చేసుకొన్న రామశేషయ్య గుర్తుకి వచ్చాడు కొండయ్యకి.

మొట్టమొదటగా తన తల్లి చెప్పినపుడు తన తండ్రి చేసిన పనికి తండ్రిమీద కోపం వచ్చిన మాట నిజమే. కాని యిప్పుడు అనిపిస్తోంది అదే శరణ్యమని. అలాంటి పరిస్థితులలో తన తండ్రికాదు కదా మరెవ్వరైనా సరే ఆ పనే చేసి వుండే వారనుకొన్నాడు కొండయ్య.

తను ముగ్గురు ఆడ పిల్లల తరువాత పుట్టాడట. పుట్టినప్పట్నించీ రోగము, మందులేనట. తండ్రి చనిపోయే సరికి తనకు పట్టుమని పదేళ్ళు కూడా లేవట. అప్పట్లో తన తండ్రి రామశేషయ్య ఓ పెద్ద ఫ్యాక్టరీలో గుమాస్తాగా పని చేసేవాడట. ఆ వచ్చే యాభై రాళ్ళు ఇంటి అద్దె, బియ్యం, వెచ్చాలు, పాలకి, బొగ్గులికి, కూరకీ, గుడ్డలకీ ఎన్నింటి కని వస్తుంది. పైగా యింటినిండా పిల్లలు. ఒకళ్ళకి బట్టలని, మరొకళ్ళకు జ్వరం, మరొకళ్ళకి రొంప అని ఎప్పుడూ యింట్లో ఎవరో ఒకళ్ళు మూలుగుతూనే వుండే వాళ్ళు. సంసారం ఈదుతూ ఆడపిల్లల పెళ్ళిళ్లు చేసి పంపాలి. అర్ధరాత్రి అంతా గాఢంగా నిద్ర పోతున్నారు. "ధఫీ"మని ఏదో పెద్ద చప్పుడయిందని అంతా లేచారు. చూస్తే ఏముంది తన తండ్రి రామశేషయ్య పడుకునే మంచం కాళీగా వుంది. దొడ్డితలుపు తీసివుంది. దొడ్డి అంతా నాలుగు మూలలా గాలించారు. ఎక్కడా ఏమీ కనపడలేదు. ఈ లోగా నూతిలోనుంచి ఏదో చప్పుడు వినిపించింది. అక్కడ వచ్చి చూస్తే ఏముంది ? బుడగలు వస్తున్నాయి. వారినీ వీరినీ కేకలు వేస్తే ఓ పెద్దమోకు తెచ్చి నూతిలోకి వేసి రామశేషయ్యని పట్టుకోమని కేకేశారు. మరి ఆ కేక అతనికి వినిపించిందో లేదోకాని తాడు మాత్రం తేలిగ్గా పైకి వస్తోందట. ఇక యిది కాదు పని, ఎవరైనా నూతులోకి దిగాలి అన్నారు. ఎవ్వరుదిగుతారు! ఒకళ్ల మొహాలొకళ్ళు చూసుకున్నారు. ఎవరి మటుకు వాళ్లకి తమ ప్రాణాల మీద తీపే. అందులో గుంటూరు బావిలో దిగడమంటే అందరికీ భయమే. ఎంత సేపటికి ఎవరూ ముందుకు రాకపోయేసరికి అందులో ఎవరో అన్నారు. వెళ్ళి పున్నయ్యని పిలుచుకొని రండర్రా అని. ఆ పేటలో పున్నయ్య అంటే అందరికీ బాగా తెలుసు. ఎవరి నూతిలో ఏది పడినా సరే అది పున్నయ్య వచ్చి తీయాల్సిందే. అంత పెద్ద బావిలోను అతను చూస్తుండగా

యిట్టే దిగి పోతాడు. ఆ పున్నయ్యకి కబురందీ అతను వచ్చి రామశేషయ్యను పైకి తీసికొచ్చేసరికి అంతా అయిపోయింది. "నట్టి పిరికివాడు." "నట్టి తెలివి తక్కువవాడు; చచ్చి సాధించే దేమిటి?" "చాలా అదృష్టవంతుడు ఎప్పుడైనా పోయేదేగా!" అని అంతా తలోక విధంగా అనుకున్నారు. అలా అనుకున్నదే పైకి చెప్పేశారు. ఎవరేమనుకున్నా తన తండ్రి ఎలాటి పరిస్థితులలో చనిపోయిందీ తలుచుకునే సరికి కొండయ్య కనుకొలకులనుండి ఓ వేడి కన్నీటిబొట్టు రాలింది.

తన తండ్రి పోయినప్పటికీ కష్టాలు యింకా ఆకుటుంబాన్ని వెన్నంటుతూనే వున్నాయి ఒకే విస్తరి కోసం పది కుక్కలు కాట్లాడుకున్నట్లు. తన తండ్రి పోగానే బాకీలుకోసం అప్పుల వాళ్ళు కొండయ్య తల్లిని చుట్టు ముట్టారు. ఇంట్లోవున్న చెంబూ, తప్పేలా రెండు మూడు మంచాలు అన్నీ అమ్మేశాడు తను. మూడువందల పైచిలుకు వచ్చింది డబ్బు దాదాపు రెండువందలు తండ్రి చేసిన బాకీలు తీర్చాడు. ఇక మిగిలిన దాంతో కట్నకానుకలు లేకుండా రెండో పెళ్ళివాడికి యిచ్చి పెద్దక్కయ్య కన్నె చెర విడిపించాడు. అంతకంటే సరైన సంబంధం తీసుకురాలేక పోయినందుకు ఎంతగానో బాధపడ్డాడు తను. పెద్దక్కయ్యను సాగనంపిన తరువాత మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. చేతిలో చిల్లిగవ్వలేదు. ఎవరేం చెప్పినా వినకుండా హోటలులో సర్వరుగా చేరాడు. అక్కడ వాళ్ళు కాఫీ, టిఫిను భోజనం పెట్టి నెలకు ఓ పది రూపాయలు యిచ్చేవారు. తను అక్కడ అన్నం తినకుండా కారియర్‌లో పెట్టించి యింటికి తెచ్చేవాడు. ఆ తెచ్చినదితనూ, తన తల్లీ, అక్కలిద్దరూ ఎలాగో సర్దుకొని తినేవాళ్ళు. ఒక్కోసారి తను హోటలులోవాళ్ళిచ్చే కాఫీటిఫిన్‌తోపొట్ట నింపుకొని హోటలులోనే భోజనం చేశానని బొంకి, యింట్లోవాళ్ళనే తినమనేవాడు. తను పడుతున్న బాధ చూసి తల్లి, అక్కయ్యలు తాముకూడా ఎక్కడైనా పాచిపని చేస్తా మనేవారు. కాని తన బొందిలో ప్రాణం వుండగా అట్లా చేయడానికి వీల్లేదన్నాడు. ప్రతినెల వాళ్ళు యిచ్చే జీతం నిలవేస్తూ రెండు సంవత్సరాలలో అక్కయ్య లిద్దరికి తనలాంటి సంబంధాలు చేశాడు.

ఇక ఎక్కువ బాదర బందీ లేదు. కొద్దిగా వెన్నెత్తుకో వచ్చు ననుకున్నాడు. అక్కడే తను పెద్ద పొరపాటు పడ్డాడు. మనజీవితంలో సౌఖ్యాలు అంకుబాటులో వున్నట్లుండి దూరమౌతాయి. అదే కాలంలో వున్న గొప్పతనం.

ఓ రోజు హోటలు ప్రొప్రయిటరుకి తనకీ మాటా మాటా వచ్చి హోటలులో పని కాస్తా వూడిపోయింది. విచారంతో యింటికి తిరిగివచ్చిన తనని చూసి జరిగినది తెలుసుకొని "పోన్లే నా యినా పోతే పోయింది; మరేదైనా చూడు" అంది తల్లి. అన్నదే కాని రెక్కలు రాని తన కొడుకు సంపాదన మీద ఆధారపడ వలసి వచ్చిందే అని కుమిలి కుమిలి ఏడ్చేది.

ఆ మర్నాడు యింటిముందు తను రిక్షా ఆపినపుడు, ఏదో వాకిట్లో అలికిడయింది. ఎవరో వచ్చారనుకొని వచ్చిన తనతల్లి నోట మాటరాక దిగ్భ్రాంతి చెందింది. తను యింట్లోకి వెడుతూ కారియర్ తల్లికి అందిస్తూ "అమ్మా! త్వరగా వడ్డించమ్మా కిరాయి పోతుంది" అని తను అన్నపుడు ఆమె గుండె చెరువై "ఏంనాయనా రిక్షా లాగవలసిందేనా?" అని కళ్లనీళ్ళు పెట్టుకుంటూ అడిగింది.

అప్పుడు తను చెప్పిన సమాధానం యిప్పుడు తలుచుకుంటే ఎంత మొరటుగా వుంది! "నేను చదువుకున్న చదువుకి యింతకంటే ఏంపని దొరుకుతుందమ్మా." దాన్లో అర్థం అప్పుడు అంతగా స్ఫురించలేదు కాని తల్లి మట్టుకు "అయ్యో చదువు చెప్పించలేని హీనమైన స్థితిలో వున్నాంకదా" అని ఎంతగానో విలపించింది. తను కిరాయి పోతుందనే తొందర్లో తల్లి బాధను గమనించకుండా రిక్షా బర బర ఈడ్చుకొని వెళ్ళిపోయాడు. అప్పట్నించీ రోజూ ఎండనక వాననక రిక్షా లాగుతూనేవచ్చాడు. ఓ రోజు సాయంత్రానికల్లా వచ్చేవాడు. మరో రోజు రాత్రి 10 గం॥కి వచ్చేవాడు. మరోరోజు తెల్లవారితేనే కాని వచ్చేవాడుకాదు. ఇదేమిటని అడిగితే "కిరాయి" అని సమాధానం చెప్పేవాడు. ఆ విధంగా రిక్షా లాగితే రిక్షా అద్దె డబ్బులుపోను 2, 3 రూపాయ మిగిలేవి. ఓరోజు రిక్షాఅద్దె డబ్బులుకూడా వచ్చేవికావు. అలా వచ్చిన డబ్బులో మూడు పావలాలు పెట్టి కారియర్ భోజనం తెచ్చేవాడు. అదే యిద్దరూ తినేవాళ్ళు. "ఇదెందుకు వంట చేసుకుందాం" అనితనతల్లి చెప్పినపుడు "వంట అయితే మళ్ళీ గిన్నెలు, బియ్యం, వుప్పు, పప్పు, నూనె, కూరలు లాంటివి కావాలి. ఈ కారియర్ భోజనం అయితే హాయిగా ఏ చీకూ చింతా లేకుండా తినొచ్చు. తినడానికి బొచ్చెలు కూడా లేకుండాహాయిగా విస్తళ్లలో కానివ్వచ్చు.

నీకు నంటూ అదీ తప్పుతుంది కూడాను;'' అని తను విడమర్చి చెప్పినపుడు ఆ వయసులో తన తెలివితేటలకు తన తల్లి మెచ్చుకొంది. ఆ విధంగా ముప్పై, నలభై రూపాయలు కూడబెట్టాడు. కొడుకు కష్టాలు చూసి కరిగిపోయి తను వున్నంత కాలమూ ఫరవాలేదు, తను పోతే వీడి మంచీ చెడూ చూసేది ఎవరు అని ఆలోచించి తనను పెళ్ళి చేసుకోమని బలవంత పెట్టింది. తను ఎంతో కాలం ఏదో ఒక సాకు చెప్పి చిట్టచివరకి కాదనలేక పోయాడు. కాపరానికి వచ్చిన క్రొత్తలోనే పార్వతి భర్తను సరిగా అర్థం చేసుకొని అందుకు తగినట్లుగానే నడుచుకొనేది. తను రిక్షా త్రొక్కుతూనే వున్నాడు. ఇట్లా ఎన్నో కొన్ని సంవత్సరాలు గడచిపోయాయి.

ఈలోగా ఎలక్షన్లు వచ్చాయి కిరాయి బాగా గిట్టుతుందని తను ఓ వారం, పది రోజులు పాటు వూళ్ళో వుండనని చెప్పాడు. రెండు వారాలయిన తరువాత ఓ రోజు యింటికి వస్తూనే ముసుగు పెట్టి పడుకున్నాడు. ఆ పడక పది రోజులుపాటు మంచంలో వుంచింది. కూడబెట్టినదంతా మందులికీ, మాకులకి కర్చయిపోయింది. జ్వరం తగ్గిన తరువాత ఓ రోజు మళ్ళీ రిక్షా త్రొక్కడం ప్రారంభించాడు. తల్లి, భార్య వద్దని కళ్ల నీళ్ళు పెట్టుకొని ఎంతగానో బ్రతిమాలారు. కాని తను వినలేదు. పది గజాలు తొక్కాడో లేదో కాళ్ళు పీకటం, కళ్ళు తిరగటం మొదలు పెట్టాయి. ఇక లాభం లేదని ఆ ప్రయత్నం కాస్తా విరమించాడు. ఏంచెయ్యడానికి తోచలేదు. తను ఏదైనా తెస్తేనే యింట్లో గడిచేది. రెక్కాడితేనేగాని డొక్కాడని బ్రతుకు. ఏదైనా పని దొరుకుతుందేమోనని ఊరంతా తిరగ్గా, తిరగ్గా ఎవరో ఓ పుణ్యాత్ముడు దయ తలచి ఊరిబయట వున్న తన చేలోకి పంట కాలవకి అడ్డీ వేసి నీరు పెడితే మూడు పావలాలు యిస్తానన్నాడు. అంటే రాత్రంతా నిద్ర పోకుండా మేలుకొని వుండాలి. జ్వరం పడిలేచిన మనిషికి అది అసాధ్యమే. ఐనా సరే నన్నాడు. అప్పటికే రెండు మూడు రోజుల్నించి యింట్లో వాళ్ళు పస్తులు పడుకోవడం చూశాడు కాబట్టి.

పంచె ఎగ కట్టి చేత్తో కర్ర పుచ్చుకొని పొలంకేసి బయలుదేరాడు తను. కాలవకి అడ్డే వేసి చేలోకి గండికొట్టి చేను ప్రక్కనే వున్న చెరువు గట్టుమీద కూర్చున్నాడు. పైన పిండార బోసినట్లుంది వెన్నెల. జీవితంలో ఓ క్షణం సేపు కూర్చోడానికి వీలుచిక్కిన తను, చందమామని చూస్తూ వెన్నెట్లో అన్నిటికీ మించిన హాయివుందే అనుకున్నాడు.

ఇంతలోనే గుంటూరునించి, బెజవాడ వైపుకు ఓ చిన్న కారు పోతూంది. ఎవరో వస్తున్న చిన్నకారు కడ్డంగా రోడ్డు మీద పడుకున్నాడు చూస్తూండగానే. ఆ దృశ్యం చూసిన తను ఎవరో తనలాంటి అభాగ్యుడే ననుకున్నాడు. కారు ఆగిపోయింది. అందులోనించి ఓ శేట్ క్రిందికి దిగాడు. అదేసమయమనుకొని రోడ్డు మీద అడ్డంగా పడుకున్న వాడల్లా తటాలున లేచి బాకుతీసి శేట్‌ని సమీపించి అతని మెడచుట్టూ వేసుకున్న కండువా పట్టుకొని ఏదో అంటున్నాడు బాకు చూపిస్తూ. అప్పటికి గాని తనకి అర్థం కాలేదు వాడి ఉద్దేశం ఏమిటో. ఇక ఆలస్యం చేయకుండా చేతికందిన కర్ర పుచ్చుకొని ఒక్క పరుగులో అక్కడికి వెళ్ళి ఆ కర్రతో వాడి తల మీద కొడదామనుకుంటే గురి తప్పి అతని వీపు మీద తగిలింది. వెన్నుపూస జారిన వాడిలా కుప్పగా కూలిపోయాడు నేల మీద. తన తలపాగా తీసివాడి కాళ్ళు, చేతులు కట్టి పారేసి శేట్ కేసి తిరిగి —

''ఇక మీకేమీ ఫరవాలేదు, మీరు వెళ్ళండి'' అన్నాడు. తన డబ్బుని, ప్రాణాన్ని కాపాడినందుకు శేట్ కొన్ని లక్షలు లాటరీలో గెలుచుకున్న వాడిలా సంతోషించి ''యిలాటివాడు నా యింటికి కాపలావుంటే మంచి'' దనుకొని తన వివరాలన్నీ అడిగి తనతోపాటుగా తనని రమ్మని చెప్పాడు. అనడమే తడవుగా తనూ, తన తల్లీ, పార్వతి, నాలుగేళ్ళ సుశీల అదేకార్లో బయలుదేరి శేట్ వూరు వెళ్ళిపోయారు. అప్పటినుంచీ శేట్ యింట్లో తోటమాలిగా వుంటూ వచ్చాడు. కాలం మాత్రం జెర్రి పోతులా సాగిపోతూనే వుంది.

శేట్‌కి రెండు పెద్ద మిల్లులు కూడా వున్నాయి. తరచు వ్యాపారం మీద ఆ వూరు, ఈ ఊరు తిరుగుతూంటాడు శేట్. క్రిందటిసారి జరిగిన సంఘటన తరువాత తనతోపాటు ఎప్పుడూ ఓ మనిషి వుండడం మంచిదని ఎంచి అప్పుడు తనకు తీరిక వేళల్లో కారు డ్రైవింగు నేర్పడం మొదలుపెట్టాడు.

అసలు డబ్బున్న వాళ్ళకే మరీ పీనాసితనం వుంటుందంటారు. అట్లాగే ఆ శేట్‌కి అంత డబ్బున్నా కారు డ్రైవర్ని పెట్టుకోలేదు. ఓ సంవత్సరములోగానే తనకి స్వంతగా కారు డ్రైవ్ చేయడం వచ్చింది. లైసెన్సు కూడా త్వరలోనే వచ్చేసింది. ఈ లోగా జయ పుట్టింది.

తను యిప్పుడు తోట మా లి గా గాక డ్రైవరుగా చలామణీ అవుతున్నాడు. మరి రెండేళ్ళకి కాసులు పుట్టింది. జీతం పెరిగింది. ఎన్నోసంవత్సరాలు కాలగర్భంలో కలిసిపోయాయి. తను క్రిందా, మీదా పడుతూనే వచ్చాడు. ఎప్పుడు చూసినా ముసలితల్లి చాదస్తపు వాగుడు, చిరిగిన చీరపీలికలలో పార్వతి, మొగుడు వదలి పెట్టిన పెద్ద కూతురు సుశీల, మందూ, మాకూ, రోగాలుతో జయ, కాసులు.... ప్రాణం విసిగి పోయింది. వీళ్ళు చాలరన్నట్లు యిప్పుడు మరో ఆడ పిల్ల, ఛీ .... జీవితం అంటే యింతేగా అనుకున్నాడు. తన గత జీవిత మంతా కళ్ళముందు పుస్తకంలో పేజీలలా తిరిగి పోయింది తనప్రక్కనేవున్న ''ఫౌంటెన్'' చుట్టూ వున్న నీటికుండులోకి ఎవరో కుర్రాడు ఆడుకుంటున్న బంతి వచ్చి పడటంతో నీళ్ళు చింది మొహానపడ్డాయి. అంతటితో అతని ఆలోచనకి అంతరాయం కలిగింది. చుట్టూ కలియ చూశాడు, దీపాల వేళ అవుతోంది. రేడియోలో ఏదో వినవస్తోంది. అప్పటికి గాని తనకి తెలియలేదు అక్కడ చాలాసేపు కూర్చున్నట్లు లేచి నిలిబడ్డాడు. కొండయ్య పార్కు బయటకు రాబోతుంటే ఎవరో పార్కులోకి వస్తున్నారు చక చకా. ఓ క్షణం సేపు అతనికేసి చూశాడు. ఉల్లి పొరలాంటి తెల్లటి లాల్చీ ప్రక్కజేబు లోంచి నోట్ల కట్టలు కొండయ్యను కవ్వించినట్లయింది.

జయకి మందు, యింట్లోకి తేవాలన్న సంగతి గుర్తుకొచ్చింది కొండయ్యకి. ఛ.... అలాటి పాడుపని చేయకూడదను కున్నాడు కాబోలు తల దించుకొని మౌనంగా బయటకు నడిచాడు. చీకటి పడబోతోంది. అయినా ఆరోజు జయ మందు, యింట్లోకి బియ్యం వచ్చేఅదృష్టం కనపడలేదు. తనఖర్మ కాకపోతే ఆశేట్ ఆయన భార్యకూడా ఊళ్లో లేకుండా పోవాలా, పెద్ద తిరుపతి మ్రొక్కుబడి కంటూ వెళ్ళినవాళ్ళు యిప్పుడప్పుడే రారు. ఎలాగ ఏంచెయ్యాలి! చివరికి ఏ గతీ తోచక తన అధోగతికి చింతించి యింటికి అడ్డదారి పట్టాడు.

కొండయ్య ఎన్ని కష్టాలు పడుతున్నా తనకేమీ సంబంధం లేనట్లుగా కాలం మాత్రం, గడియారంలోని గంటల ముల్లు లాగా తనపని తాను చేసుకు పోతూ గోడ నున్న కాలెండరులో ఎన్నో నెలల కాగితాలు చింపి వేసింది.

శేట్ యింటినించి కొండయ్య మిట్ట మధ్యాహ్నం క్రింద కాళ్ళు మాడుతున్నా, పైన నెత్తి మాడుతున్నా యింటికి వచ్చాడు అంబలికోసం. కొండయ్య రాగానే పసిపాప గౌరిని అందించింది పార్వతి. అసలే పుట్టెడు ఆకలితో వచ్చాడేమో ''అలా మంచంలో కూలెయ్యరాదూ'' అంటూ గట్టిగా గదిమాడు.

అంబలిగిన్నె అందించి భర్తకు మరింత దగ్గరగావచ్చి ''అదేమిటండీ యిన్నాళ్లూ మీరు దాని మొహంకేసి అయినా చూడనే లేదు. అదేంపాపం చేసుకుందీ చూడండి నా బంగారుతల్లి ఎంత అమాయకంగా నవ్వుతోందో!" అంది గౌరిని ముద్దు పెట్టుకుంటూ.

మనసులో వద్దనుకుంటూనే అప్రయత్నంగా చూశాడు. పసుపుపచ్చని శరీరం, ముద్దుగా చక్కగా బారెడుపిల్ల, కోల మొహం, చక్రాల్లాంటికళ్లు, కోటేరేసిన ముక్కు, మొహంలో కొట్టవచ్చే కళా కాంతులూ — యివన్నీ చూస్తే నిజంగా పార్వతి చెప్పినదాంట్లో ఏమీ అబద్ధం లేదనిపించింది. ఇంతకాలం యిలాటి పిల్లను చూడకుండా ఎట్లా వున్నానా అనిపించింది. ఇంత అందమైనది కాబట్టే యిరుగుపొరుగు వాళ్ళంతా తరచు తన యింటికి వస్తున్నారన్నమాట. తనకి తెలియకుండానే తన రెండు చేతులూ చాచాడు. పార్వతి ఆనందంతో తన్మయురాలైపోయి పిల్లను భర్తకు అందిస్తూ:

"చూడండి మన పెళ్ళికి యింకా మీరు రిక్షా తొక్కుతూనే వున్నారు. సుశీల పుట్టిన తరువాత మీకు తోటమాలిగా పనిదొరికింది. జయపుట్టిన తరువాత మీ ముప్పైజీతం కాస్తా నలభై అయింది. కాసులు పుట్టిన తరువాత మరో ఇరవై పెరగడమే కాకుండా ఆ తోటమాలి పని వదలిపోయి హాయిగా మీరు కార్లో తిరిగే అదృష్టం పట్టింది. అట్లాగే గౌరి మన యింటికి వచ్చినప్పటినించీ మనకు ఏదో అదృష్టంకలిసివస్తుందనుకుంటున్నాను..'' పార్వతిమాట పూర్తిగాకుండానే.

''అదృష్టంమాట దేవుడెరుగు.ముందు జయకి పెళ్ళి చెయ్యాలి. మరోరెండు మూడేళ్ళలో కాసులుకి చేయాలి. డబ్బు ఎట్లా సర్దుబాటు అవుతుందా అని నేనాలోచిస్తూంటే'' అన్నాడు.

"మీరట్లా దిగులు పడబోకండి. నారు బోసినవాడే నీరు పోస్తాడు" అని ధైర్య వచనాలు పలికింది.

''ఎంత హీనమైన సంబంధాలు చూసినా ఓ నాలుగయిదు వందలయినా అయేటట్లుంది. ఊళ్ళోకొచ్చిన వాళ్ళు సుశీల కాపరం సంగతి తెలిసి తిరిగివెళ్ళి పోతున్నారు. ఏం చెయాలో పాలుపోవడం లేదు.''

''పోనీ శేట్‌ని అడగండి, ప్రతినెల మనకి వచ్చే జీతంలో మినహాయించుకో మని'' సలహా యిచ్చింది పార్వతి.

ఈపద్ధతి బాగానే వుందనుకొని భోజనంచేసి బయలుదేరాడు జమీందారు గారింటికి.

అలా గుమ్మంలో అడుగుపెట్టాడో లేదో ఒక్కసారిగా లోపలినించి ఏడ్పులు వినిపించాయి. గుండెపోటుతో హాఠాత్తుగా కాలంచేశాడు శేట్.

అప్పు కాదుకదా వుద్యోగానికి కూడా నీళ్ళు వదలుకోవాల్సి వచ్చే రోజులు దగ్గర పడుతున్నై, అన్నుకుంటూ వచ్చేశాడు యింటికి.

అది జరిగిన పదిహేను రోజులకి శేట్ భార్య పొరుగూరు పనిమీద వెళ్ళి రమ్మన మని చెప్పింది. వెళ్ళి వస్తూండగా కర్మ వశాత్తూ కారు ఓ చెట్టుకి ఢీకొంది. తత్ఫలితంగా 'లైసెన్సు' పోయింది. అదృష్ట వశాత్తూ తను 'ప్రాణాల్తో' బ్రతికి బయట పడ్డాడు.

''చూశావా పార్వతీ! నీ ముద్దుల కూతురు పుట్టిన వేళావిశేషం. లైసెన్సు, పోయింది'' అన్నాడు యింటికి వచ్చి పార్వతితో.

ఏమీ అర్థంకాక ''అంటే'' అన్నట్లు చూసింది.

''నా ఉద్యోగం యివ్వాళ్టితో ఊడి పోయింది. ఇదంతా గౌరి తెచ్చిన అదృష్టం కదూ'' అన్నాడు వెక్కిరిస్తున్నట్లుగా.

పార్వతి దిగ్భ్రాంతి చెందింది ఒక్కొక్క పిల్ల పుడితే, ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా కలిసి వచ్చిందని తను విన్నది. కాని యిదేమిటి! అయినా భగవంతుడి మీద విశ్వాసం లేశమైనా తగ్గలేదు. కొండయ్యకి మాత్రం పూర్తిగా నమ్మకం పోయింది.

మర్నాటి నించి కొండయ్య యిల్లు నరకంలా తయారయింది. ప్రతిచిన్న విషయానికి యింటిల్లి పాదినీ తిట్టడం, మాటలురాని గౌరిని నానా మాటలూ అనడం పార్వతి భరించలేక పోయింది. అయినా ఏం చేస్తుంది ఆడది.

అసలు కష్టాలు వచ్చినప్పుడు కూడ గట్టుకొని వస్తాయంటారు యిదేకాబోలు కాకబోతే మరేమిటి? తన ముసలితల్లి అంతవరకూ బాగున్నదల్లా కొడుకు ఉద్యోగం పోయి చేతిలో చిల్లిగవ్వలేని సమయంలో చచ్చిపోవాలా? ఇరుగు వాళ్ళు, పొరుగువాళ్ళు చేసిన సహాయంతో శ్రాద్ధకర్మలు ముగించాడు. గోరుచుట్టుపై రోకటి పోటన్నట్లు— ఓరోజు ప్రక్కగ్రామంలో పనిచేస్తున్న తన అల్లుడు ప్రకాశం వచ్చి ఓ యాభై రూపాయలిస్తే తన కూతుర్ని తీసుకొని వెడతానన్నాడు. డబ్బిస్తే సుశీల శీలం బాగుపడుతుందా అని అడుగుదా మనుకున్నాడు, కాని యిప్పటికైనా తీసుకొని వెడతానన్నాడు కదా, అదేచాలు ననుకొని సరేనన్నాడే కాని తరువాత ఆలోచనలో పడ్డాడు. ఇప్పుడు 50రూపాయలు ఎక్కడ్నించి తెచ్చియిచ్చేటట్లు, అని తల్లి, తండ్రి మధన పడుతూంటే సుశీల చాటునించి విని తండ్రి ఎదురుగా వచ్చి.

''నాన్న! నేను వెళ్ళను'' అంది.

''ఛ. అదేమిటి'' అన్నాడు.

''ఇప్పుడు ఆయనగారికి డబ్బుతో ఏదో అవసరం ఏర్పడి వుంటుంది. అందుకని ఈ పన్నాగం పన్నారు. అక్కడికి వెళ్ళగానే మళ్ళీ యథాప్రకారంగానే వుంటుందినాన్నా'' అంది కంటతడి పెడుతూ.

తల్లిదండ్రులు ఎలాగో నచ్చచెప్పి కూతుర్ని ఆసాయంత్రం అల్లుడితో పంపారు. ఇకనైనా మిగతా యిద్దరు పిల్లలికి పెళ్ళిళ్లు అవుతాయనే ఉద్దేశంతో. కాని కొండయ్య భార్య బోసిచెవులు చూసినప్పుడల్లా బాధపడుతూనే వున్నాడు. తను చేయించేది లేకపోగా వున్నవి కాస్తా ఈరూపేణా పోయాయే అని.

కొండయ్య ఏదైనాపని దొరకుతుం దేమోనని అడ్డమైన వాళ్ళందర్నీ అడిగాడు. ఎవ్వరూ ఏ పని చూపించలేక పోయారు. అలా తిరగ్గా తిరగ్గా ఓ ఆఫీసులో ప్యూన్‌పోస్టుకి కాళీ వుందని తెలిసింది. సంతోషంతో వెళ్ళాడు.

''ఏంలాభం లేదయ్యా యింతకు ముందే ఎవరోవచ్చి వెళ్ళారు'' అన్నాడు ఆఫీసరు.

కొండయ్య తనకథఅంతా చెప్పి ''బాబూ పిల్లలు కలవాడ్ని, నాలుగు రోజులబట్టి పస్తులు పడుకుటున్నాం'' అని చెప్పి కాళ్ళావేళ్లా పడ్డాడు.

ఆఫీసరు జాలితలచి ''సరే రేపు గురువారం 8 గం॥కి వచ్చిచేరు. అప్పటికి నువ్వు రాకపోతే అతనికి యిచ్చేస్తా''నన్నాడు.

కొండయ్యకి మేరువును ఎక్కినట్లయింది. త్వరగా యింటికివచ్చి ఆవార్త భార్యచెవులో వేసేదాకా అతనికి ఏమీ తోచలేదు. ఆ గురువారం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూశాడు.

ఆరోజు బుధవారం రాత్రి కొండయ్య సంతోషానికి మేరలేదు. తెల్లవారితే గురువారం. తనూ ఓ ఉద్యోగస్తుడవుతాడు.

ఆరోజు గురువారం మామూలుగానే తెల్లవారింది అందరికీ. కాని కొండయ్యకి మాత్రం అట్లా కాలేదు. ఆరోజు వుదయం గౌరికి పెద్దజబ్బు చేసింది వున్నట్లుండి. కాళ్ళూ చేతులూ చల్లబడుతున్నాయి.

పార్వతి శోకాలు పెడుతూ "వెళ్ళి తొందరగా డాక్టర్ని తీసుకొని రండి" అంది.

కంగారుగా పరుగెత్తాడు కొండయ్య. మళ్ళీ వెనక్కి వచ్చాడు.

"ఏం?" అన్నట్లు చూసింది భర్త వంక.

"మన దగ్గర డబ్బేముందని యిప్పుడు పెద్ద డాక్టర్ని తెచ్చేది" అన్నాడు.

"ధర్మాసు పత్రికి పోదాం" అంది.

గౌరిని బుజాన వేసుకొని ముందు కొండయ్య. వెనుక పార్వతి పరుగెత్తారు ఆ రెండు ఫర్లాంగులూను.

డాక్టరు వచ్చి రెండు మూడు యింజక్షన్లు యిచ్చాడు. ఏదో ముక్కు దగ్గర పెట్టాడు. గంట గంటకీ టెంపరేచరు చూస్తున్నాడు. నర్సులు కూడా హడావిడిగా అటూ, యిటూ పరిగెత్తుతున్నారు. ఏ క్షణంలో ఏ మాట వినాల్సి వస్తుందో అని పార్వతి, కొండయ్యలు ప్రాణాలు వుగ్గపట్టుకొని కూర్చున్నారు. మధ్యమధ్య పార్వతి ముక్కు చీదుకుంటూనే వుంది.

అలా ఎన్నో కొన్ని గంటలు గడిచేసరికి గౌరి కళ్ళు విప్పింది. డాక్టరు యింక ఫరవాలేదన్నాడు. గోడ గడియారం ఈ లోగా 10 గంటలు కొట్టింది. కొండయ్య వెన్ను మీద ఎవరో చరిచినట్లయింది.

"డాక్టర్ యిప్పుడే వస్తా"నని చెప్పి కొండయ్య ఆఫీసరు దగ్గరికి పరిగెత్తాడు. ఆఫీసరు గది గుమ్మం దగ్గర ఎవరో ముక్కు మొహం తెలియనివాడు తను వుండవలసిన స్థానంలో వుండటంచూసి నిరాశగా వెనక్కి తిరిగాడు. వెనుకనుంచి వాడు "ఏయ్! ఎవరునువ్వు? ఎవరు కావాలి?" అని అడుగుతున్నా వినిపించుకోకుండా వచ్చేశాడు.

ఇంటికి వస్తూనే గౌరిని ఛడా, మడా తిట్టాడు. చేతి కందిన వుద్యోగం కాస్తా దానివల్లే జారిపోయిందన్నాడు. అది పుట్టడంతో తన యింటికి శని పట్టుకుందన్నాడు. ఇంకా ఏమేమో అన్నాడు.

"ఉద్యోగం పోతే పోయింది నా బిడ్డ బ్రతికి బయట పడింది, అంతేచాలు"ననుకుంది పార్వతి. కొండయ్య చేతికందిన ఉద్యోగం పోయేసరికి యింక తనకి పని దొరికే అదృష్ట మేలేదనుకొని బెంగతో మంచం పట్టాడు.

ఓ రోజు పార్వతి యింటి ప్రక్క డాబాలో వుంటున్న శాంత వచ్చింది పార్వతి దగ్గరికి.

పార్వతమ్మా! మీ గౌరి ఏది? పట్నం నించి మా అన్నయ్య వచ్చాడు. వాడు, వాడి స్నేహితుడు కలిసి ఏదో సినిమా తీస్తున్నారట. అందులో చిన్న పిల్ల పోర్షన్ వుందట. మీ అమ్మాయిని గురించి చెప్పాను. ఏదీ గౌరి ఎక్కడుంది? తీసుకురా చూపిద్దాం" అని పార్వతమ్మతో చెప్పి వెళ్ళింది శాంత.

ఆ అందాల గౌరిని చూసి "ఈ అమ్మాయి మీ పిల్లేనా?" అని అడిగారు పార్వతి నుద్దేశించి, అవునన్నట్లు తలూపింది పార్వతి.

"చూడమ్మా! మేము యిప్పుడు ఓ సినిమా తీస్తున్నాం. సరిగా మాకు యిలాటి పిల్ల దొరక్క యాతన పడుతున్నాం. మీకు యిష్టమైతే తెలియచెయ్యండి. ఇప్పుడు ఓ వెయ్యిరూపాయిలు యిస్తాం. పిక్చరు పూర్తికాగానే మరో వేయి రూపాయలిస్తాం. ఇష్టమేనా? ఏమంటారు" అన్నట్లు చూశాడు.

అంతకంటేనా అన్నట్లు ఆమె మొఖం ఆనందంతో విప్పారింది.

వెంటనే శాంత అన్నయ్య వేయి రూపాయలికి చెక్కు రాసిచ్చి "రేపట్నించే షూటింగు ప్రారంభిస్తాం. రేపు కారు పంపుతాం. పిల్లను తీసుకొని రండని" చెప్పి యింత తేలికగా బేరం కొట్టేసినందుకు లోపల ఎంతగానో సంతోషించాడు. ఎదుకంటే కథలో ఎక్కువ భాగం చిన్నపిల్లలను గురించే కాబట్టి. పాపం అది పార్వతి కేం తెలుసు!!

ఇంటికి వచ్చి "చూశారా! నా తల్లి అదృష్టం" అన్నట్లు భర్తవైపు చూసింది. భార్యా భర్తలు యిక ఆ రోజుతో తమ కష్టాలు గట్టెక్క బోతున్నాయి కదా అని సంతోషించారు.

ఆ మర్నాడుదయం హైదరాబాద్ వెళ్ళడానికి కారు వచ్చి కొండయ్య యింటిముందు ఆగింది. కూతురి అదృష్టానికి తబ్బిబ్బవుతూ గౌరిని తీసుకొని పార్వతి కారు ఎక్కింది.

ఆరోజు అర్థరాత్రి. తలుపులు ఎవరో బాదటంతో మెళకువ వచ్చి తలుపులు తీశాడు కొండయ్య. ఇంటిముందు చిన్న కారు ఆగివుంది. కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తోందిపార్వతి, రెండు చేతుల్లోను పిల్లను పట్టుకొని. కొండయ్యకి ఏమీ అర్థం "కాక అడిగాడు ఏంజరిగిందని, పార్వతి జవాబు చెప్పలేక పోయింది. వెక్కి వెక్కి ఏడుస్తోంది. కారుడ్రైవరు చెప్పాడు "సాయంత్రం షూటింగు ప్రారంభమైంది. ఒక్కసారి బల్బులన్నీ వెలిగేసరికి పాప కెవ్వున కేక వేసి పడిపోయింది. చూస్తే కళ్ళు పోయాయి. నష్టపరిహారం క్రింద బాబుగారు యిది యిచ్చిరమ్మన్నారు." అంటూ రెండు వేలకు చెక్కు అందించాడు కొండయ్యకి. గౌరినిఅందుకోపోయాడు భార్య చేతుల్లోంచి. కాళ్ళూ చేతులూ మంచులా చల్లగా తగిలాయి. రెండువేల చెక్కు కొండయ్య దంపతులను చూసి వెక్కిరించి నట్లుంది.



# ప్రశ్నోత్తరావళి

శ్రీ బి. బాలసిద్ది రెడ్డి, సోమరెడ్డిపల్లి, కడపజిల్లా.

ప్ర. కడపజిల్లా బద్వేల్ తాలూకా లోని మాదేరు ఆనకట్ట నిర్మాణ కార్యక్రమం ఎప్పుడు ప్రారంభ మవుతుంది ?

స : మాదేరు ఆనకట్టకు సంబంధించిన ప్రణాళికలు, అంచనాలు పూర్తయ్యాయి. ప్రస్తుతం యిది పరిశీలనలో వుంది. ఈ అంచనాలకు ప్రభుత్వ అనుమతి లభించడంతోనే దీని నిర్మాణం ప్రారంభ మవుతుంది.

శ్రీ కె మధుసూధన్. సికింద్రాబాదు.

ప్ర : కరివేపాకుచెట్టు చిగురు తొడగడంతోనే పచ్చరంగు తెగులు ఏదో తగిలి, ఆకుల్ని తినేస్తున్నది. ఇంచుమించు అన్ని ఆకులకు, రెమ్మలకు యీ జబ్బు సోకుతుందని అనిపిస్తుంది. దయచేసి దీనికి నివారణోపాయాన్ని తెలియజేయండి.

స : 50 శాతం మాల్తియన్ ఇ. సి. ద్రావణాన్ని ఒక ఔన్సును, ½ ఔన్సు టీపోల్ ను రెండుగేలన్ల నీళ్ళలో కలగలిపి, ఆ ద్రావణాన్ని మొక్కపై చల్లాలి. మూడవరోజున మొక్కను పరిశీలించి, అవసరమైతే మరోసారికూడా ద్రావణం చల్లాలి. ఒకసారి కలిపిన ద్రావణం రెండుగంటలకన్న ఎక్కువసేపు వుంచకూడదు. ఈ పదార్థాలు విషకరమైనవి. అందుచేత పిల్లలు, ఇళ్ళలోని పెంపుడు జంతువులు మొదలయినవి వీటిని ముట్టుకోకుండా జాగ్రత్తపడాలి. ఆఖరిసారి ద్రావణం చల్లిన కనీసం పదిహేను రోజులవరకు మొక్కనుండి ఆకుల్ని కోసి వాడకుండా చూడవలసిన అవసరం ఎంతయినా వుంది.

శ్రీ ఆర్. చెన్నబసవయ్య స్వామి, పాతపాలెం, గద్వాల్ తాలూకా

ప్ర : గద్వాల్ తాలూకా పాతపాలెందగ్గర వాగుమీద ఆనకట్ట నిర్మించబడుతుందని తెలిసింది. పరిశీలనలు మాత్రమే జరిగాయి. నిర్మాణ కార్యక్రమం ఎప్పుడు ప్రారంభమవుతుంది ? దీనివల్ల ఎంత నేలకు నీటి సౌకర్యం లభిస్తుంది ?

స : రిజర్వాయరు కొరకు పాతపాలెం గ్రామంవద్ద స్థలాన్ని ఎన్నుకోవడం, పరిశీలించడం జరిగింది. 783 ఎకరాల ఆయకట్టుకు సంబంధించిన రు. 5.20 లక్షల అంచనా రూపొందించ బడింది. కాని సాంకేతికంగా యీనిర్మాణ సాధ్యం కాదని తేలింది. ఇక్కడి మట్టిగట్లను లేవదీయడానికి తగినదికాదు. పార్శ్వాలు ఆట్టే ఎత్తుగాలేవు. అందుచేత ఎగువ ప్రవాహానికి 2½ మైళ్ళ దూరంలో గంగన్నపల్లి గ్రామంవద్ద స్థలం ఎన్నిక చేయబడింది. రు. 9-10 లక్షలతో 937 ఎకరాల ఆయకట్టును ఉద్దేశిస్తూ రిజర్వాయరు నిర్మాణానికి అంచనాలు వేయబడ్డాయి. దీనిపై అభివృద్ధిపన్ను లేకుండా 1.37 శాతము అభివృద్ధి పన్నుతో 1.72 శాతము ప్రతిఫలం వస్తుంది.

శ్రీ ఎ. రామారావు, విజయనగరం.

ప్ర : ప్రభుత్వం ప్రకటించిన సెలవులు - ఆదివారాలు, రెండవ శనివారం కలుపుకుని - వాడకానికి ఫీల్డు సర్వేయర్లు, డిప్యూటీ సర్వేయర్లు (నిర్వహణసిబ్బంది) అర్హులుకారని సర్వే, భూమి రికార్డుల శాఖ అధికారులు చెప్తున్నారు. పబ్లిక్ సెలవులకు వీరుఎందుకు అర్హులుకారో దయచేసి తెలియజేయండి.

స : ఫీల్డు సర్వేయర్లతోసహా సర్వే. భూమి రికార్డుల శాఖకు సంబంధించిన అధికారులందరూ సెలవులు వాడకానికి అర్హులే. నియమాలప్రకారం పబ్లిక్ సెలవులను– ఆదివారాలు, రెండవ శనివారం కలుపుకుని – యథాప్రకారం వాడుకోవచ్చు. నిర్ణయింపబడిన విధంగా నెలకు 20 రోజులపాటు ఫీల్డు సర్వేయర్లు, డిప్యూటీ సర్వేయర్లు చేసే పర్యటనను బట్టి వారి జీతం నిర్ణయింపబడుతుంది. మిగిలిన పదిరోజుల్లోనూ వీరు సెలవులు వాడుకోవచ్చు. సెంటర్ చెక్ వంటి రికార్డుపనులు, యితరపనులు చేసుకోవచ్చు.

శ్రీ జి. సీతారామయ్య. ఉల్లిపాలెం.

ప్ర : పట్టభద్రులయిన ఉపాధ్యాయుల కొరకు తక్కువవ్యవధి సర్టిఫికెట్టు కోర్సు యీ ఏడాదికూడా నిర్వహించబడుతుందా ?

ప్రధానోపాధ్యాయుల విషయంలోవలె ఉపాధ్యాయుల విషయంలోకూడా, యీ సరిఫికెట్టు కోర్సు ప్రవేశానికి ప్రాథమికపరీక్ష నుండి సడలింపు వుంటుందా ?

1964-65 లో కొత్తగా హయ్యర్ సెకండరీ పాఠశాలల్ని ప్రారంభించే ప్రతిపాదన ఏమైనా వున్నదా ?

స : 1964 సం. వేసవి సెలవుల్లో పట్టభద్రులకు తక్కువవ్యవధి సర్టిఫికెట్టుకోర్సును నిర్వహించే అవకాశంలేదు.

21-2-1963 వ తేదీన విద్యాశాఖ జారీచేసిన జి. ఒ. ఎమ్. ఎస్. నం. 427 లో యీ దిగువ వర్గానికి చెందిన ఉపాధ్యాయులనుకూడా, తక్కువవ్యవధి సర్టిఫికెట్టు కోర్సులో ప్రవేశానికై చేసే ప్రాథమిక పరీక్షనుండి ప్రభుత్వం సడలించింది.

(ఎ) హయ్యర్ సెకండరీ పాఠశాలల్లోగాని, బహుళార్థసాధక పాఠశాలల్లోగాని, లేదా హయ్యర్ సెకండరీగా, లేక బహుళార్థ సాధక పాఠశాలగా మార్పుచేయడానికి ఎంపిక చేయబడిన ఉన్నత పాఠశాలల్లోని ఉపాధ్యాయులు 50 ఏళ్ళవయసు పూర్తి చేసి వున్నట్లయితే.

(బి) పైన 'ఎ'లో పేర్కొన్న పాఠశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయులు పదిహేనేళ్ళ సర్వీసు కలిగివుండి- వీటిలో అయిదేళ్ళు ఉన్నత పాఠశాలలో (క్లాసు IX ఆపై తరగతులకుపాఠాలుచెప్పివుండవలెను). హయ్యర్ సెకండరీ లేక బహుళార్థ సాధక పాఠశాలల్లో, లేక హయ్యర్ సెకండరీగాగాని, బహుళార్థ సాధకపాఠశాలగా గాని మార్పుచేయడానికి ఎంపిక చేయబడిన ఉన్నత పాఠశాలలో గాని ఉపాధ్యాయుడుగా పనిచేయవలెను- యీ దిగువయోగ్యతలనుకలిగివుండవలెను:-

(I) బి. ఇడి అసిస్టెంట్ల విషయంలోనయితే, వారు హైస్కూలు తరగతులలోబోధించడానికి యోగ్యతపొందిన సబ్జెక్టులో మొదటిశ్రేణిగాని, ద్వితీయ శ్రేణిగాని కలిగివుండవలెను(బి ఎ;బి.ఎస్‌సి.మొ॥)

(II) ప్రాచ్యభాషల పండితుల విషయంలో నయితే, వారు 7-12-1959 వ తేదీ విద్యాశాఖ జి. ఒ. ఎమ్.ఎస్.నం.3879 లోని 2 వ పేరాలో 1 నుండి 5 పద్దులో వ్యక్తం చేయబడిన యోగ్యతలు గలిగి వుండినా. లేదా బి.ఇడి.గాని బి. టి. గాని ఎల్. టి.గాని డిప్లమోఇన్ ఎడ్యుకేషన్ (ఉస్మానియా విశ్వవిద్యాలయం) గాని పండితుల శిక్షణగాని సెకండరీగ్రేడు శిక్షణ యోగ్యతగాని కలిగివుండి, ప్రత్యేక సబ్జెక్టుగా చెప్పే భాషలో మొదటి శ్రేణి, లేదా ద్వితీయశ్రేణి డిగ్రీ కలిగి వుండవలెను. మామూలు ఉన్నత పాఠశాలలను హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా 1964-65 సం. లో మార్పు చేసే ఉద్దేశమేమీలేదు.

హయ్యర్ సెకండరీ కోర్సులోని ఆఖరి రెండేళ్ళలోనూ హయ్యర్ సెకండరీ క్లాసుల్లో బోధించే ఉపాధ్యాయుల యోగ్యతలు, ఇంటర్ మీడియెట్ కోర్సులో బోధించే ఉపాధ్యాయుల విషయంలో విశ్వవిద్యాలయం నిర్ణయించిన యోగ్యతలకు సమానంగా వుండాలని సెకండరీ విద్య కమీషను సూచించింది. ప్రాచ్యభాష సర్టిఫికెట్టుగల తెలుగు పండితులు తాము తక్కువవ్యవధి సర్టిఫికెట్టు కోర్సు శిక్షణ పొందకుండానే XI,XII తరగతులకు వెళ్ళడానికి అనుమతించవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తులను పంపించారు. విద్యాశాఖడైరెక్టరు ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలతో సంప్రదించి, యీ విజ్ఞప్తులను పరిశీలించి, ఈ ఉపాధ్యాయుల జీతాలు, యోగ్యతలకు సంబంధించిన కొన్ని సూచనలను అందజేశారు. ప్రభుత్వం యీ సూచనలను పరిశీలించి, బహుళార్థ సాధక పాఠశాలల్లో గాని హయ్యర్ సెకండరీ పాఠశాలల్లో గాని పై తరగతులలో బోధించడానికి ప్రాచ్య భాషల్లోని పండితులు యీదిగువ యోగ్యతలను కలిగివుండాలని తెలియజేసింది.

(ఎ) ఎమ్. ఎ. లేదా ఎమ్. ఒ. ఎల్. (ఉపాధ్యాయుడు బోధించేభాషలో) మరియు (II) బి ఇడి. లేదా బి.టి లేదా ఎల్.టి, లేదా డిప్లమో ఇన్ ఎడ్యుకేషన్ (ఉస్మానియా), లేదా సెకండరీ గ్రేడు ట్రయినింగ్, లేదా పండిట్స్ ట్రయినింగ్.

(బి) బి. ఎ; లేదా బి. ఒ ఎల్. (ఉపాధ్యాయుడు బోధించేభాష ప్రత్యేక సబ్జెక్టుగా) మరియు (II) బి. ఇడి. లేదా బి. టి. లేదా ఎల్. టి, లేదా డిప్లమో ఇన్ఎడ్యుకేషన్ (ఉస్మానియా), లేదా సెకండరీ గ్రేడు ట్రయినింగ్, లేదా పండిట్స్ ట్రయినింగ్ మరియు తక్కువ వ్యవధి సర్టిఫికెట్టుకోర్సుడిప్లమో. అలాకానప్పుడు యీ దిగువ యోగ్యతలనైనా కలిగి వుండాలి:-

తెలుగు పండితులు

1. (ఎ) ఆంధ్ర విశ్వవిద్యాలయపు మొదటి శ్రేణిగాని, లేదా ద్వితీయశ్రేణిగాని ఉభయభాషాప్రవీణ;

(బి) ఆంధ్ర విశ్వవిద్యాలయపు భాషాప్రవీణ (మొదటిశ్రేణిగాని, లేదా ద్వితీయశ్రేణి గాని) లేదా (సి) మద్రాసు విశ్వవిద్యాలయపు విద్వాన్ (మొదటిశ్రేణి, లేక ద్వితీయశ్రేణి)

(2) ఎస్. ఎస్. ఎల్. సి. లేదా దానికి సమానమైన సాధారణ విద్య

మరియు

(3) పండిట్స్ ట్రయినింగ్ లేదా సెకండరీ గ్రేడు ఉపాధ్యాయుల శిక్షణ.

ప్రాచ్యభాషల్లో తృతీయశ్రేణివచ్చిన మామూలు ఉన్నత పాఠశాలల్లోనితెలుగు పండితులు, నిర్ణయించబడిన సాధారణ విద్య యోగ్యతలతో వృత్తి విద్య యోగ్యత కలిగివున్న తెలుగు పండితులు కూడా హయ్యర్ సెకండరీ పాఠశాలల్లోనూ, బహుళార్ధ సాధక పాఠశాలల్లోనూ పై తరగతులలో బోధించేందుకు తక్కువవ్యవధి సర్టిఫికెట్టుకోర్సు శిక్షణ పొందవలసి వుంటుంది.

II సంస్కృత పండితులు :

ఎ) ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి మొదటి శ్రేణి, లేదా ద్వితీయశ్రేణి విద్యాప్రవీణ; లేదా

(బి) మద్రాసు విశ్వవిద్యాలయంవారిమొదటి శ్రేణి, లేదా ద్వితీయశ్రేణి శిరోమణి; లేదా దానికి సమానమైన సిండికేట్ నిర్ణయించిన యోగ్యత; లేదా

ఎస్. ఎస్. ఎల్. సి గాని, దానికి సమానమైన మరి ఏ యితర సాధారణ విద్యగాని; మరియు ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి పండిట్స్ ట్రయినింగ్‌గాని, సెకండరీ గ్రేడు ఉపాధ్యాయుల శిక్షణగాని

III ఒరియా పండితులు :

(1) ఉత్కళభాషా ప్రవీణలో మొదటిశ్రేణి, లేదా ద్వితీయశ్రేణి.

(2) ఎస్ ఎస్. ఎల్. సి.గాని, దానికిసమానమైన సాధారణవిద్య.

(3) పండిట్స్ ట్రయినింగ్‌గాని సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయుల శిక్షణ.

VI హిందీ పండితులు :

(1) మెట్రిక్యులేషనుగాని, దానికి సమానమైన యోగ్యత; మరియు

(2) హిందీలో పండిట్స్ ట్రయినింగ్ గాని దానికి సమానమైనదిగాని; మరియు

(3) ఈ దిగువ యోగ్యతలలో ఏ ఒక్కటైనా సరే :

(ఎ) అలహాబాదు హిందీసాహిత్య సమ్మేళన వారి సాహిత్యరత్న మొదటిశ్రేణి, లేదా ద్వితీయశ్రేణి.

(బి) మద్రాసు విశ్వవిద్యాలయంవారి 'విద్వాన్'లో మొదటిశ్రేణి, లేదా ద్వితీయశ్రేణి.

(సి) ఆంధ్రవిశ్వ విద్యాలయంవారి 'భాషా ప్రవీణ'లో మొదటిశ్రేణి, లేదా ద్వితీయ శ్రేణి.

V అరవం, కన్నడం, ఉరదూ ఉపాధ్యాయులు :

(1) గుర్తింపబడిన విశ్వవిద్యాలయంనుండి అరవంలోగాని, కన్నడంలోగాని, ఉరదూలోగాని మొదటిశ్రేణి, లేదా ద్వితీయ శ్రేణి ప్రాచ్యభాష సర్టిఫికెట్టు.

(2) ఎస్ ఎస్ ఎల్. సి. గాని దానికిసమానమైన సాధారణ విద్య; మరియు

(3) పండిట్స్, లేదా మున్షీల శిక్షణ, లేదా సెకండరీగ్రేడు ఉపాధ్యాయుల యోగ్యతలు.

పై యోగ్యతలులేని ప్రస్తుతపు పండితులు, మున్షీలు హయ్యర్ సెకండరీ పాఠశాలల్లోగాని, బహుళార్ధ సాధక పాఠశాలల్లోగాని బోధించే అర్హత కలిగి వుండాలంటే, వారు తమ భాషలో తక్కువ వ్యవధి సర్టిఫికెట్టు కోర్సులో శిక్షణ పొందవలసి వుంటుంది, సంస్కృతం,ఒరియా, హిందీ,కన్నడం, అరవంలలో తక్కువ వ్యవధి సర్టిఫికెట్టు కోర్సులు నిర్వహించే వరకూ; యీ కోర్సును (కోర్సులను) నిర్వహించడంలో యిబ్బందులు వున్నచోట్ల యీ సబ్జెక్టులను బోధిస్తున్న ప్రస్తుతపు ఉపాధ్యాయులు పైన నిర్ణయించబడినయోగ్యతలనుండి సడలించబడతారు. వీరికి ప్రత్యేక అలవెన్సులు లేకుండా వారి వారి స్కేళ్ళలో జీతం పొందుతుంటారు.

(4) ఎమ్ ఎ, డిగ్రీ కలిగివుండి, హయ్యర్ సెకండరీ పాఠశాలలుగాని, బహుళార్ధ సాధక పాఠశాలలుగాని రూపొందించబడిన పాఠశాలల్లోచివరి రెండుతరగతులలోనూ బోధించే పండితులకు; తక్కువ వ్యవధి సర్టిఫికెట్టుకోర్సు, ప్రాచ్యభాషా యోగ్యతగల ఉపాధ్యాయులు, పండితులకు జీతాల స్కేళ్ళను అనుమతించే ఉత్తరువులు విడివిడిగా జారీ చేయబడతాయి.



# పరిపాలనా సంస్కరణల సంఘం

ప్రస్తుతంవున్న ప్రభుత్వ యంత్రాంగాన్ని మెరుగు పరచడానికి తీసుకోవలసిన చర్యలను సలహా రూపంలో యివ్వడానికి గాను ఒక పరిపాలనా సంస్కరణల సంఘాన్ని ఏర్పాటు చేయాలనే ప్రభుత్వం ఉద్దేశాన్ని బడ్జెటు సాధారణ చర్చపై ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి తెలియజేశారు. స్వాతంత్ర్యం, సంక్షేమ రాజ్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఒకకొత్త విధానానికి కారణమయ్యే అనేక బాధ్యతలను, కార్యక్రమాలను చేపట్టాలని రాష్ట్రప్రభుత్వం తలంచింది. పెద్ద మొత్తాలు వెచ్చింపబడే నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులవంటి పథకాలు మొదలుకొని విద్య, సాంఘిక, ఆరోగ్య పథకాలవంటి చిన్న చిన్న వాటి వరకు వున్న అన్ని రకాల పథకాలూ గల మూడు పంచవర్ష ప్రణాళికలను అమలు పరచడంవల్ల ఆఫీసుపనులు పెరిగిపోయాయి. దీనికితోడు ప్రభుత్వ యంత్రాంగం అంతటా బాధ్యతలు పెచ్చు పెరిగాయి. అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన రంగాలను గ్రామ స్థాయిల్లోని ప్రజల చేతుల్లోనే వుంచవలసినందువల్లా, పంచాయతీ రాజ్ స్వరూపంవల్లా కూడా ప్రభుత్వ విధానాల్లో కొన్ని కొన్ని మార్పులు జరగవలసి వున్నాయి.

1956 సం లో రాష్ట్రావతరణ జరిగినప్పటినుండి మారుతున్న పరిస్థితుల్లో ఏర్పడ్డ యీ సమస్యలను గుర్తించి, ప్రభుత్వం 1957 సం. లో ఒక ఆర్థిక సంఘాన్ని, 1960 సం లో ఒక పరిపాలనా సంస్కరణల సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఇవి చేసిన సిఫారసులను చాలవరకు అమలు పరచడం జరిగింది. ప్రభుత్వ యంత్రాంగ నిర్వహణకు సంబంధించిన వివిధశాఖలబాధ్యతలు, ఈ బాధ్యతలను ప్రభుత్వం పంచే తీరు, ఈ విధమైన బాధ్యతలను నెరవేర్చడంలో ఏ విధంగా ప్రజలకు ప్రభుత్వోద్యోగులు సహాయపడుతున్నదీ మొదలయిన విషయాలలో ఉన్నత స్థాయిని కొత్తగా పరిశీలించవలసిన అవసరం కలిగింది. ఈ కారణాలన్నీ పురస్కరించుకుని యీ దిగువ సభ్యులతో, గడువుతో ఒక పరిపాలనా సంస్కరణల సంఘాన్ని ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది :—

అధ్యక్షుడు

1. శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి, రెవెన్యూ శాఖమంత్రి.

సభ్యులు

2. శ్రీ ఎస్ బి పి. పట్టాభిరామారావు, ఎమ్ ఎల్. ఎ.
3 శ్రీ వి. బి. రాజు.
4. శ్రీ టి. విశ్వనాథం, ఎమ్. ఎల్. ఎ.
5. శ్రీ పి. సుందరయ్య, ఎమ్ ఎల్. ఎ.
6. శ్రీ గులాం హైదర్, ఐ ఎ. ఎస్. (రిటైర్డ్) ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషను ఛైర్మను.
7. శ్రీ ఆర్. ఎల్. గుప్తా, ఐ. సి ఎస్. (రిటైర్డ్) హైదరాబాదులోని అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజి ప్రిన్సిపాలు.
8. శ్రీ వి. కె. రావు, ఐ సి. ఎస్. పరిశ్రమల శాఖ ప్రత్యేక కార్యదర్శి

శ్రీ వి. వెంకట్రాయుడు, ఐ. ఎ. ఎస్ (రిటైర్డ్) యీ సంఘానికి కార్యదర్శిగా వ్యవహరిస్తారు.

పరిశీలనాంశాలు

*ఈ సంఘం పరిశీలనాంశాలివి :*

1. ప్రస్తుతంవున్న స్వరూపంలో పరిపాలనా యంత్రాంగం పనిచేస్తున్న విధానాన్ని పరిశీలించి, సంక్షేమ రాజ్యంలోని ప్రజాస్వామ్య ప్రభుత్వానికి యిది ఎంతవరకు తగివున్నదనే విషయాన్ని సేకరించి పొదుపుతో కూడిన సమర్థతను మెరుగు పరచడానికి చర్యల్ని సూచించడం.

2. సచివాలయం బాధ్యతలను, వివిధ ప్రభుత్వ శాఖలను పరిశీలించి, ఏ విధంగా ప్రభుత్వ బాధ్యతల నిర్వహణ, పంపిణీలను మెరుగుపరచవచ్చో సూచించడం.

3. ప్రభుత్వవ్యవహారాలకు సంబంధించిన ఫైళ్ళను త్వరత్వరగా నడిపించేటట్టు చూడడం, అన్ని స్థాయిల్లో గౌరవ. బాధ్యతలను ప్రోత్సహించే ఉద్దేశ్యంతో అధికార వికేంద్రీకరణకు, అప్పగింతకు చర్యలను సూచించడం.

4. జిల్లా స్థాయిల్లో వివిధ శాఖల కార్యకలాపాలను సమన్వయ పరిచడానికి, ముఖ్యంగా రాష్ట్ర ప్రభుత్వాధికారుల మధ్య స్థానిక పరిపాలనాసంస్థ యూనిట్ల మధ్య సమన్వయానికితగుచర్యలను సూచించడం.

5 ప్రభుత్వ కార్యాలయాలలో ప్రజా సంబంధాలు ఎంతవరకు తగినట్టున్నాయో పరిశీలించి, ప్రభుత్వాధికారుల మధ్య

(మిగతా 76 వ పేజీలో)

# ప్రణాళిక

— కొలకలూరి

భరతమాత హృదయబంధాలు తెగిపోవ,
ప్రజల గుండె నిలచె విజయముద్ర.
భావి భాగ్యరేఖ పరిపూర్ణ లక్ష్యమ్ము
కాంచినది ప్రణాళికా పతాక.

అది ప్రణాళిక కాదనంత సౌభాగ్య సౌ
జన్య సౌభ్రాత్ర పుంజాల దీపి!
అది ప్రణాళిక కాదు, ఆనంద జనతా స
మాలోకన నిరీక్ష మమతగీతి!
ఇది ప్రణాళిక కాదు, ముదితాంతరంగ డో
లాయమాన జిగీష రక్షరేఖ!
ఇది ప్రణాళిక కాదు, హృదయ మంజులభావ
నవ నవోన్మేష విజ్ఞాన లేఖ!

అవియు నిదియు ప్రణాళిక లసలె కావు!
పుణ్య స్వాతంత్ర్య భారతీ పుత్రభావి
భాగ్య సంపత్ సమారాధ్య యోగ్యదివ్య
కాంతి కళికలు సృజియించు కల్పలతలు!!

ఒక ఆనకట్ట, ఒక్కొక్క భూమికే కాదు,
తారుణ్య పుష్ప సంతతికి పాట!

ఒక జలవిద్యుత్తు, ఒక గృహాలకె కాదు,
హృదయాలయాల సంపదకు దివ్వె!
ఒక పరిశ్రమశాల, ఉత్పత్తికే కాదు,
ప్రజకోటి బలశౌర్యరమకు గుండె!
ఒక కళాశాల, విద్యకలనకే కాదు,
వరసృష్టి భాగ్యభావనకు జ్యోత్స్న!

పంచవర్ష ప్రణాళికా భావ్య నూత్న
సృష్టి; భారతదేశ సంతుష్టి జనిత
నవనవానంద సందోహ నాట్యహేల,
తన్మయీ భావమందు అందాలజల్లు.

జీవనధాతలై, అమృత చింతనలో నవజీవనమ్ములై,
పావన వీచులై, అమల పాలనలోన పరీమళమ్ములై,
జీవికలై మనోహర విశిష్ట కళా నిపుణ ప్రజామనో
భావనలై, సుమించె నవభంగి ప్రణాళిక పుష్పగుచ్ఛముల్.

వెన్నెలవానలో, వెలుగు వేకువజాడల మేలుకొల్పులో,
వన్నెల కాంతులో, వలపు వంకల వాగుల పల్కరింపులో,
వెన్నెల తాకులో, వెలది వెచ్చని కౌగిలి పూలపాన్పులో,
అన్నటులన్ ప్రణాళికలు హాయినొసంగు విధిన్ చెలంగుతన్.

---

(70 వ పేజీ తరువాయి)

ప్రజల మధ్య అవగాహనను, సంబంధాలను మెరుగుపరచడానికి చర్యలను సూచించడం.

6. ప్రజలనుండి సమాచారార్థం వచ్చే ఫిర్యాదులు, ఎంక్వయిరీలు, అభ్యర్థనలపైన శ్రద్ధ చూపించే సౌకర్యాలను పరిశీలించి తగు చర్యలను సూచించడం.

7. అన్ని స్థాయిల్లోనూ, ముఖ్యంగా కార్యాలయాల్లో మామూలుగా అక్కడ జరిగే పనిస్వభావంవల్ల తల ఎత్తే అవినీతిని, నిర్మూలించడానికి చర్యలను సూచించడం.

8. ఇవికాక ఈ సంఘం పరిపాలనలో అభివృద్ధికి యింకేమైనా సిఫారసులను చెయ్యొచ్చు. ప్రజలకు మరింతగా శీఘ్రగతిని సమర్థవంతంగా సేవచేయడానికి తగిన సిఫారసులను చెయ్యొచ్చు.

9. ఈ సంఘం హైదరాబాదులో పని చేస్తుంది.

10. కరువు భత్యం, ప్రయాణపు ఖర్చులు పొందే ప్రభుత్వ సేవకులవలెనే ప్రభుత్వ సేవకులుకానియితర సభ్యులకు వీటినియిచ్చే విషయంలో యీ సంఘాన్ని మొదటి తరగతి సంఘంగా గుర్తించడం జరుగుతుంది.

11. ఏదయినా ఒక ప్రత్యేక స్వభావంకల నిర్దిష్టమైన అంశాన్ని పరిశీలించడానికిగాను ఒక శాఖాధిపతినిగాని, లేదా ఎవరైనా అధికారినిగాని చేర్చుకోవడానికి వారి విచక్షణను బట్టి యీ సంఘానికి అధికారం ఒసగబడింది.

12. ఆరు నెలల్లోగా యీ సంఘం తన పనిని పూర్తిచేయాలని దీనిని కోరడం జరిగింది.



మన చరిత్ర-సంస్కృతి

# ఆంధ్రప్రదేశ్‌లో మతోద్యమాలు

—కె. సి. వరదాచారి

భారతావని పెక్కు మతాలకు పుట్టినిల్లు. ఎన్నో మతాలు ఇక్కడ ఉద్భవించాయి. మరెన్నో ఇతర మతాలు ఈ దేశంలో ప్రవేశించాయి. ఈనాడు భారతదేశం సర్వమతాలకు నిలయమనీ, సంగమ స్థానమనీ సగర్వంగా చెప్పుకోవచ్చు. ఈ పరిస్థితి కలతలకు, కార్పణ్యాలకు, అయోమయస్థితికి దారి తీయలేదు. కాని పరస్పర గౌరవానికీ, సహనానికీ సంబంధించిన సమస్యలు రేకెత్తించింది.

భారతదేశంలోని వివిధ రాష్ట్రాలలోనూ ఇదే విధమైన సమస్యలు ఉద్భవించాయి. ప్రతి రాష్ట్రంమీద అనేకక్రొత్త, పాతమతాల ప్రభావం పడింది. ఆంధ్రప్రదేశ్‌లో కూడా యిదే పరిస్థితి. ఇక్కడ మతాలన్నీ కూడా ఇంచుమించుగా ఒకదానితో ఒకటి కలసి పోయిన మిశ్రమరూపంలో వున్నాయి.

ఆంధ్రదేశ చరిత్ర అతి పురాతనమైనది. ఈ ప్రాంతప్రజలు ఆదిలో బహుశా అనాగరికమైన అలవాట్లూ, నమ్మకాలూ గల ఆటవిక ప్రజలు. కాని దరిమిలా ఈ పరిస్థితిని అధిగమించిన పౌరాణిక పరిధిలో వీరుకూడా చేరిపోయారు. శ్రీకృష్ణుని నిర్యాణానంతరం ద్వారక నీటమునిగిన పిమ్మట అంధకులనే ఒకానొక యాదవ తెగ ప్రజలు గుజరాత్ నుంచి వలస వచ్చారు. పురాణాలలో ఉల్లేఖించిన అంశాలనుబట్టి మహాభారతకాలంలో కలియుగారంభంలో ఇది జరిగి వుండాలి. ఏమైనా ఈ కాలం సుమారుగా క్రీ. పూ. 1,000 సం. నాటిది.

వీరు తూర్పు, పశ్చిమ మార్గాలద్వారా గోదావరి, కృష్ణానదుల లోయప్రాంతాల వరకు వచ్చినట్లు కనిపిస్తుంది. ఆది ఆంధ్ర నృపాలురు ఆంధ్ర విష్ణువంశానికి చెందినట్లు ప్రతీతి. ఈ విధంగా కృష్ణ సంప్రదాయము యీ ప్రాంతానికి వచ్చింది. శ్రీకాకుళంవద్ద కృష్ణానదితీరంలో విష్ణు ఆలయం నిర్మించబడింది. దీనిని ఆంధ్రరాజులు ముఖ్యపట్టణంగా చేసుకున్నారు. దేవాలయాలు మతకేంద్రాలుగా రూపొంది, విగ్రహారాధన ప్రాముఖ్యత వహించిందనే విషయం సుస్పష్టమే. శ్రీకృష్ణుడు స్థాపించిన శత్వత (పంచరాత్ర) మతానికీ, దీనికీ సంబంధంవుంది. మహాభారతం తదితర ఆగమములలో ఇది ఉదహరించబడింది. వేదకాలంలో బలివేదికప్రధాన పూజాపీఠమైనట్లు ఆలయాలలోనూ, గృహాలలోనూ విగ్రహారాధన ఆగమముల ముఖ్యాంశాలలో ఒకటి. మహాభారత కాలంలో ఈ రెండుకూడా ఏకకాలంలో ఆచరణలో వున్నాయి. మతానికి సంబంధించిన చెప్పుకోదగిన ఏ అంశం విషయంలోకూడా వేదం ఆగమములుపరస్పరం భేదించవనిశ్రీకృష్ణుడు గ్రహించినందువల్ల ఆ కాలంలోని మేధావులలో ఆయన్ను ఆదిఋషితుల్యుడని పేర్కొనవచ్చు. మరోకారణం ఏమంటే, యీఉద్యమం దక్షిణాన ఆంధ్రప్రాంతానికి దిగువనగల పాండ్య తదితర రాజ్యాలకుకూడా విస్తరించింది. ఆంధ్రుల తొలిరోజులలో మతం అభివృద్ధిజెందిన రీతిని పరిశీలిస్తే, వారికిగల కృష్ణతత్వాభిమానము, వైదిక పరిజ్ఞానం గోచరిస్తాయి. ఈ విధంగా దక్షిణాపథంలోని మతోద్యమాలు వైదిక ఆగమ మతాలకు చాలావరకు ఋణపడి వున్నాయి. ఆళ్వార్లు ఏకాలంవారో సరిగ్గా నిర్ధారణ కాలేదు. క్రీ.శ. 2 వ శతాబ్దం మొదలు 9 వ శతాబ్దం వరకు వీరు ప్రవర్ధిల్లినట్లు ఆధునిక పండితుల అభిప్రాయం. అయితే ఆగమముల ప్రభావం అంతకుపూర్వంనుంచే వున్నట్లు మాత్రం సుస్పష్టమవుతుంది.

కృష్ణతత్వం తరువాత, లేక దానితోబాటే శైవ ఆగమములుకూడా వ్యాప్తిలోకి వచ్చాయి. ఇవికూడా మహాభారతంలో ఉదహరించబడినవి. ఈ విధంగా అనాది కాలంనుంచీకూడా కృష్ణ (విష్ణు), శైవ ఆగమములు — రెండూ వ్యాప్తిలో వున్నాయి. ఇంతేకాక వేదములయొక్క శ్రౌత—స్మార్త సంప్రదాయంకూడా ప్రచారంలో వుంది. పూర్వపు దాఖలాలనుబట్టి కూడా దైవారాధనకు సంబంధించిన వైఖానస సంప్రదాయం వైదిక సంప్రదాయంగానే వ్యవహరించబడినట్లు చెప్పవచ్చు వైఖానసుడుకూడా వైదిక ఋషులలోనివాడే.

ఆంధ్రదేశంమీద యితరరాజుల దాడులు విపరీతంగాజరిగాయి. వీటికిప్రతిగాఆంధ్రులు

కూడా పరాయివారిపై దాడులు జరిపారు. తమ సామ్రాజ్యాన్ని ఉత్తరంలో మగధ వరకు, కళింగ, నాసిక, మాల్వావరకుకూడా విస్తరింపజేశారు. ఈ విధంగా ఆ ప్రజల మత, సాంస్కృతిక విధానాలు కూడా ఆంధ్ర సామ్రాజ్యంలో వ్యాపించ ప్రారంభించాయి.

ఔత్తరాహ బౌద్ధమతోద్యమం ఆంధ్ర రాజ్యపు తూర్పుభాగంలో తీరప్రాంతం పొడవునా వ్యాపించింది. పశ్చిమభాగంద్వారా ఆగ మముల ప్రభావం సోకింది ఈ విధంగా తన జన్మస్థానంలో ప్రాభవాన్ని కోల్పోయిన బౌద్ధమతం, కృష్ణానది తీరంలో మహాయాన అనబడే ఆగమరీతికి చెందిన బౌద్ధమతంగా అభివృద్ధి జెందింది. ఆధ్యాత్మిక జీవితపు సుశీలమైన పునాదులపై బౌద్ధమతోద్యమాన్ని తీర్చిదిద్దిన మహావ్యక్తులలో నాగార్జునుడు ముఖ్యుడు.

వైదిక మతం కఠినమైనదై దాని ఆచరణకూ, ఆధ్యాత్మికమైన విచారణకూ వేదాలపై ఆధార పడివుండగా, ఆగమములు ఇతోధికంగా నిగూఢమైనవై, విభిన్న స్థాయిలలో సామాన్యులకు కూడా ఆరాధనకు, అభ్యాసానికి అవకాశం కలుగజేశాయి. కర్మమార్గం, జ్ఞానమార్గాలు వేద సంబంధమైనవి. భక్తిమార్గం సాధారణ ప్రజానీకానికి సంబంధించినది.

ఆరామ ప్రాధాన్యమైన బౌద్ధ జీవితములో కంటే దేవాలయం కేంద్రంగా గల జీవిత విధానంలోనే సాంస్కృతిక పునరుజ్జీవనం అధికంగా ద్యోతకమైంది. కృష్ణ (విష్ణు) శివ మందిరాలలో శిల్పం, కళలు అభివృద్ధి జెందినంతగా ఆరామాలు, విహారాలలో వికాసం పొందలేదు. మానవుడు దుఃఖం, దైన్యం నుంచి విముక్తి పొందడానికి ఆరామాలు, విహారాలు పూర్తిగా అవకాశం కలిగించ లేకపోయాయి. అంతేకాక ధర్మ కార్యానికి విఘ్నం కలుగకుండా సృజనాత్మకమైన వ్యక్తీకరణలకు సహజసిద్ధమైన మార్గాన్ని కూడా అవి కల్పించలేదు. శైవ, కృష్ణ మతాలు పుంజుకోవడంతో బౌద్ధమత ప్రభావం (4 వ శతాబ్దంలో) ఆకస్మాత్తుగా క్షీణించిపోయింది బౌద్ధమతం క్షీణించిపోవడానికి దారితీసిన ముఖ్యకారణాలలో తరువాతి బౌద్ధులు నైతికంగా దిగజారి పోవడాన్నీ, మత విషయకంగా నాస్తికవాదం ప్రబలడాన్నీ, మేధావులలో కలిగిన అచేతనత్వాన్ని పేర్కొనవచ్చు. తరువాతి బౌద్ధులు తాంత్రిక సిద్ధాంతానుగుణమైన మంత్ర తంత్రాలకు, యితర శక్తి ప్రదర్శనలకు పూనుకొని వుండవచ్చు. వీటివల్ల జనులు విముఖత జెందారు. ఫలితంగా బౌద్ధమతం క్రమేపి క్షీణించిపోయింది.

బౌద్ధ మతంలోని మంచి లక్షణాలు హిందూ సంస్కృతిలో అప్పటికే జీర్ణించుకొని పోయాయి. నీచమైన, నింద్యమైన లక్షణాలు విసర్జించబడినవి. తరువాత కాలంలో శ్రీ శంకరాచార్యులు పొందిన సఫలతను మనం సులువుగా అవగాహనం చేసుకోగలుగుతాము. అలాగే కుమారిల భట్టు, ప్రభాకరునివంటి మీమాంసకులు ప్రతిపాదించినట్టి ప్రాచీన ప్రవర్తనా విధానాలు, అలవాట్ల పట్లగల విముఖతను కూడా మనం అర్థం చేసుకోగలం.

ఎట్టి నిర్బంధం లేకుండా అవలంబించబడుతున్న వామచారుల పంచమకర చర్యలవంటి నీచమైన అలవాట్ల పట్ల జన సామాన్యంలో వైముఖ్యం ఏర్పడింది. హిందూ సంస్కృతి, చరిత్రలో మత పునరుద్ధరణకు సంబంధించి పదే పదే తటస్థించిన ముఖ్య సంఘటనలలో ఇదొకటి. శివునికి చిహ్నంగా రూపొందించిన లింగాన్ని పరిగణించడంలో అపోహల ఫలితంగా ఆలస్యం జరిగింది. శివ, శక్తి రూపాల లింగ భేద చిహ్నాలకు యివి దగ్గరగా వున్నందున మర్మవాదుల ఆలోచనలను రేకెత్తించాయి. విష్ణువు విషయంలో అలా జరగలేదు. నిర్గుణ బ్రహ్మ పదార్థ తత్త్వము అంతిమ సత్యానికి సంకేతమైంది. శంకర సిద్ధాంత విజయానికి కేవలం ప్రజలలోని మర్మవాద లక్షణమే కారణంకాదు. ఈ విధంగా ఆంధ్ర దేశంలో బౌద్ధమతం ప్రవేశించి, క్షీణించి పోయేవరకుగల 500 సంవత్సరాలలోకూడా శ్రౌత, స్మార్త, ధర్మ శాస్త్రాలు, కల్ప శాస్త్రాలతో సహా వైదిక మతం మెల్ల మెల్లగా వ్యాప్తినొందింది. అంతేగాక ఇది సాంఘిక విధులను విభజించే వర్ణ వ్యవస్థను కూడా శాశ్వతం చేసింది.

బౌద్ధ, జైన మతాలవలె వర్ణవ్యవస్థతో సంబంధంలేని ఆగమ విధానాలు పంచరాత్ర (సత్వత) వైఖానస, పాశుపత పద్ధతులు కూడా ఆచరించబడేవి. ఈ మత సిద్ధాంతానికి చెందిన అనేక పురాణాలకు సంబంధించిన విజ్ఞానాన్ని ప్రజలు ఆర్జించారు. ఇవి పాక్షికంగా మత సంబంధమైనవి. చాలా వరకు మర్మవాద సంబంధమైనవి. వైదిక మతంలో వలే పరిమితులు, మినహాయింపులు లేకుండా, యివి సర్వజనుల కొరకు ఉద్దేశించ బడినవి. ఇప్పటి మత సంక్లిష్టతలను గ్రహించడానికి భిన్న మతాలను గురించి సంక్షిప్తంగా తెలుసుకోవడం అవసరం. వైదిక మతం మూడు రకాల దేవుళ్లను పరిగణించింది (1) భూలోకపు దేవుళ్లు. వీరిలో అగ్ని దేవుడుచాలా ముఖ్యుడు (2) మధ్యలోకపు దేవుళ్లు వీరిలో ముఖ్యమైన దేవుడు వాయువు (3) స్వర్గలోకపు దేవుళ్లు. వీరిలో ప్రధానదేవత ఇంద్రుడు. ప్రతిమతానికీ వేరు వేరుగా దేవుళ్లు వున్నారు. దేవుళ్ళ సంఖ్య సుమారు 33,000, వుంటుంది. ఈ మూడు లోకాలకూ అతీతులైన దేవతలు రుద్రుడు, వరుణుడు, విష్ణువు. అయితే విష్ణువు తరువాతి పురాణాలలో చాలా ముఖ్యుడయ్యాడు. ఆయన

త్రివిక్రముడు కావడమే దీనికి కారణం. అయితే ఈ దేవతలందరూ కాక చివరకు ఒకే ఒక దేవుడుగా బ్రహ్మ పరిగణించ బడుతున్నాడు. ఆయనను ఋషీశ్వరులు వివిధ నామాలతో పిలిచారు. 'ఏకం సత్ విప్రాః, బహుధావదంతి' ఈ అంశాన్ని జ్ఞప్తికుంచుకోవడం చాలా అవసరం. ఒకే ఒక్క దేవుడు–పరమాత్మ – బ్రహ్మ ఆయన తనలో దేవుళ్ళందరినీ మూర్తీభవింప జేసుకున్నాడు. ఈశ్వరు డొక్కడే నన్న వాదాన్ని ఉపనిషత్తులు నొక్కి వక్కాణిస్తున్నాయి. అద్వైతంకూడా ఆత్మలన్నీ ఒకటే నన్నది. సృష్టిఅంతా ఒకే పరమాత్మ జనిత మన్నది. ఒక విధంగా ఈ జీవజాలమంతా కూడా తమ మనుగడకై ఆ పరమాత్మపై ఆధార పడాల్సి వుంటుంది. సర్వస్వతంత్రు డైనవాడు ఒకే ఒక్క డున్నాడు.

సృష్టిలోని యితరమంతా ఆయనపైననే ఆధారపడి వుంది; పరమాత్మ ఒక్కడే. మిగిలినవన్నీ ఆయనశరీరాలే; అవతారాలే; చైతన్యం ఒక్కటే. దానికంటె స్వతంత్ర మైనదిఏదీలేదు పురాతన వేదాంత తత్వంలో పరమ సత్యాన్ని గురించి ప్రతిపాదించబడిన మూడు మార్గాలు యివే. శంకరాచార్యులు (7 వ శతాబ్ది) రామానుజాచార్యులు (11 వ శతాబ్ది) మధ్వాచార్యుల (13 వ శతాబ్ది) కాలాలలో యీ మూడు మార్గాలు స్పష్టంగా పేర్కొనబడినవి.

బ్రహ్మాద్వైతం ఒక్కటేనన్న సిద్ధాంతాన్ని ఆమోదించినంత మాత్రాన ఇతర దేవతలను కొలవడం మానివేయలేదు. దేవతలకు ప్రకృతిశక్తులు, దానికి అతీతమైన శక్తులు కూడా వున్నాయి. ఈ శక్తులు లేదా దేవతలను యజ్ఞాలద్వారా శాంతిపరిచేవారు. క్రతువులకు సంబంధించిన ఖచ్చితమైన పరిజ్ఞానం వుండాలి. దేవతలను సక్రమంగా గౌరవించాలి. ఇంద్రుడు, వాయువు, వరుణుడు, ప్రజాపతి, విష్ణువు, రుద్రుడు, అగ్ని, సోముడు, సూర్యుడు చాలా ఎక్కువగా పూజింపబడేవారు. శ్రాద్ధ, శ్రౌత కల్పంలో పూర్వీకులు వసు, రుద్ర, ఆదిత్యరూపాలలో వరుసగా మూడులోకాలకు చెందినట్లు ఆరాధించ బడతారు. సూర్యమండలం ద్వారా ఆదిత్య లోకాన్ని దాటివెళ్ళిన ఆత్మ ఈ ప్రపంచంలోకి తిరిగి ప్రవేశించదు. త్రిలోకాలకూ అతీతుడైన బ్రహ్మను ఎరుగనివారు, ఈయనను శాంతిపరచడానికై క్రతువులు చేయనటువంటివారి ఆత్మలు చంద్రలోకానికి మాత్రమే వెళ్ళి భూలోకంలో మళ్ళీ మళ్ళీ ప్రవేశిస్తూ వుంటాయి. సృష్టికి మూలకారకుడైన సర్వేశ్వరుడినీ, త్రిలోకాలలోని ఇతర దేవతలనూ, ఇతర అధః, ఊర్ధ్వ లోకాల దేవతలనుకూడా శాంతిపరచాలనే ఈ సిద్ధాంతమే వైదికజ్ఞాన, కర్మలకు ఆలంబనం. వారు నిత్య నైమిత్తిక కర్మ కాండలను ఆచరించేవారు. ఈ రెండు విధములైన కర్మ కాండలుకూడా ఇహలోకం, పరలోకంలో కూడా పరమేశ్వరుని అనుగ్రహం బడయడానికి తప్పనిసరిగా ఆచరించవలసినవి. ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవిక అనే త్రివిధములైన కర్మకాండస్వభావానికిసంబంధించిన భావనకూడా వారికి వుంది. మనలోనిచెడు ఈ మూడింటిలోనుంచీ రావచ్చు. ఇదే విధంగా మనలోని మంచి దేవతల సహాయంతో ఈ మూడు మార్గాలను పరిశుద్ధం చేయడంద్వారా వస్తుంది. దైవరక్షితమైన జీవితమే వైదికునియొక్క పరమలక్ష్యం. ఏకోబ్రహ్మఅనే శాశ్వతసత్యంలో జీవించడానికే అతను అభిలాషపడతాడు.

పౌరాణిక మతం మరింత విశదంగా గోచరమవుతుంది. పురాణాలకు వైదిక సాహిత్యం ఆలంబనం అనడంలో సందేహం లేదు. చరిత్రలనుకానీ పౌరాణిక కథలనుకానీ కఈ రెండుకూడిన వాటిని కా పురాణాలు వీలే వర్ణించాయి. సృష్టికి సంబంధించి పురాణాలలో కొన్ని సిద్ధాంతాలు, ప్రతిపాదించబడినవి. అయితే ఇవి వైదిక సిద్ధాంతాలతో పూర్తిగాభేదించవు. వీటిలో పౌరాణిక, చారిత్రక పాత్రలు వున్నప్పటికీ ఆయా కథలలోని వేదాంత భావనగ్రాహ్యమవుతూనే వుంటుంది ఋషులు, రాజులు, వారిరాజ్యపాలనగాధలు ఎంతోసమాచారం అందించాయి. పురాణాలు విభిన్న కాలాలలో వ్రాయబడ్డట్లు ప్రతీతి. ఇవన్నీ దాదాపు తొలి శతాబ్దాలకు చెందినవని ప్రొఫెసర్ హజ్రా అభిప్రాయ పడ్డారు. అయితే వీటిలో చెప్పబడిన సంఘటనలు అంతకు చాలాపూర్వకాలానికి చెందిన వనడంలోసందేహంలేదు. శంకరుడు–రామానుజుడు వీరుభయులూకూడా వేదాంతచర్చలలోవిష్ణుపురాణం, మహాభారతం, భగవద్గీతలపైఆధారపడ్డారనే విషయంమనకుతెలిసిందే కాగా ఇతరులు భాగవతం, దేవీ భాగవతం, మార్కండేయ,అగ్ని మొదలైనపురాణాల(18 పురాణాలు,18ఉపపురాణాలుకలవు)పైఆధారపడ్డారు. మహాభారతం పంచమవేదం గానూ, వాల్మీకి విరచితమైన రామాయణం ఇతిహాసం గానూ పరిగణించ బడుతున్నాయి. ఈ విధంగా సమృద్ధమైనటువంటి ఈ పౌరాణిక, ఐతిహాసిక కథాసామగ్రి ప్రజలందరిలోనూ శ్రద్ధాశక్తులు పెంపొందించడానికి చాలా తోడ్పడుతుంది. దేవాలయాలు పురాణాలు ఇతిహాసగాధల శిలారూపాలకు నిలయాలుగా రూపొందాయి. ఈ నీతిబోధకమైన, చారిత్రకమైన సామగ్రిద్వారా ప్రజానీకం జ్ఞానార్జన చేశారు. ప్రజలు యోధులు, దేవతలతో కూడిన వాతావరణంలో నివసిస్తూ ఆరాధన తదితర కార్యాచరణ లన్నింటిలో నోమన్నతిని అనుభవించారు.

ఆంధ్రలో బౌద్ధమతం క్షీణించిపోయిన పిమ్మట వైదికధర్మం పునరుత్థానం జెందడం,

సమాజంలోని అన్నివర్గాలవారిలోనూ పురాణాలకు సంబంధించిన అంశాలను ప్రచారం లోకి తీసుకొనిరావడంద్వారా జరిగింది. సాంఘిక వ్యవస్థ చాతుర్వర్ణ విధానాన్ని అవలంబించసాగింది. ఇది దాదాపుగా పూర్వ పద్ధతి పునరుద్ధరణే. మానవుడు అదుపులో పెట్టశక్యంకానటువంటి అనేకమైన సాంఘిక, రాజకీయ కారణాలమూలంగా ధర్మ పాలన లోపించడంవల్లనే సాంఘికంగా గొప్ప దుస్థితి ఏర్పడుతుందని గీత చెబుతున్నది. తాత్సారం జరిగినపుడు, అలసత్వం వహించినప్పుడు క్రియాశీలత విఫలమవుతుంది. ఈ విధంగా యుగధర్మం మార్పు జెందుతుంది. బౌద్ధమతం క్షీణించిన పిమ్మట ఆంధ్ర దేశంలో పురా వైభవాన్ని పునః ప్రతిష్ఠింప జేయడానికి ప్రధాన కృషి జరిగింది. ఆ తరువాత 500 సంవత్సరాల వరకు ఇది సఫలత నొందింది.

తంత్రికలు లేక ఆగమములు ఎల్లపుడూ కూడా మంత్రాలుగా వేదాలకు, ఉపనిషత్తులకు గౌరవస్థానం యిచ్చినవి. వైదిక మంత్రాలకు అర్హులుకానటు వంటివారు ఇతర మంత్రాలను ఉపయోగించవచ్చని భావించ బడింది. వాటిలో, సృష్టికి సంబంధించిన స్వంత సిద్ధాంతాలు కూడా వున్నాయి. భగవంతుడు ఒక్కడే ననీ, ఆయనలోనే శక్తి ఉన్నదనీ, దాని నుండి జగత్తులన్నీ సృష్టించ బడుతున్నాయని పంచరాత్ర ఆగమం ఉల్లేఖిస్తున్నది. భగవంతుడు పరతత్వము. ఆయన వాసుదేవుడు, సంకర్షనుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడుఅనే నాలుగురూపాలలో (వ్యూహాలు) ప్రకాశమానం చెందుతాడు. మూల ప్రకృతి జీవం, అహంకారం, బుద్ధి అనే నాల్గింటికీ వారు అధిదైవతాలైనట్లు కనిపిస్తుంది. అనిరుద్ధుని తరువాతనుంచి ప్రపంచం, ప్రాణుల సృష్టి ప్రారంభ మవుతుంది. మనం నివసిస్తున్న ఈ జగత్తును బ్రహ్మ సృష్టించాడు. పరమాత్ముడు ప్రతిజీవి హృదయంలోనూ ప్రవేశించి అంతర్యామిగా రూపొందుతాడు. శాశ్వతమైనదిగా పరిగణించ బడుతున్న ఆత్మకు శాశ్వత సహ చరుడవుతాడు. అన్ని జగత్తులు, జీవుల సృష్టి జరిగాక ఆయన విశ్రమిస్తాడు. కాని ఈ ప్రపంచానికి దేవునితో ఎంతో అవసరం వుంది. బ్రహ్మ సృష్టించిన ఈ ప్రపంచం లోని దుఃఖం, వ్యాకులతలనుంచి విముక్తి పొందే నిమిత్తమై భగవంతుని తెలుసుకునే జ్ఞానం కూడా కావాలి. భక్త వత్సలుడు, దయామయుడైన పరమాత్ముడు మానవ కోటికి విమోచన మార్గాన్ని చూపడానికి ఏదోఒక రూపంలో అవతరించి ప్రబోధాలు చేస్తాడు. కపిలుడు, వ్యాసుని వంటి గొప్ప ఋషి పుంగవులు, భగవంతుని అవతారాలు. ఇటువంటి మహా ప్రబోధకులు దేవాలయాలలో ఆరాధించ బడటానికై ఆయన అచ్చట విగ్రహాల రూపంలో కూడా అవతరించాడు. ఈ చివరి రెండింటిని దేవుని యొక్క విభావ, అర్క రూపాలనవచ్చు. ఈ విధంగా మానవుడు పంచవిధములైన దైవశక్తి సమక్షంలో వున్నాడు. పరమాత్ముడు అతనిజీవితపు పంచరాత్రులను అంటే జగజ్జనుని గుర్తించ లేని అంధకారం లేక అజ్ఞానాన్నీ, తన ఆత్మకు సంబంధించిన అజ్ఞానాన్నీ, మానవాళికి విమోచనం కలిగించే గొప్ప ప్రవక్తలను తెలుసుకోలేని అజ్ఞానాన్నీ, జగత్ సృష్టిని గూర్చి తెలుసుకోలేని అజ్ఞానాన్నీ, దేవుని అపారమైన దయా వాత్సల్యాలను గ్రహించలేని అజ్ఞానాన్నీ తొలగిస్తాడు. ఆధ్యాత్మిక ఉపదేశానికి మొదటి మూడు వర్ణాలైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలలో కేవలం దేనికో ఒక దానికి చెందడం కన్న మరో భిన్నమైన అర్హత ప్రమాణాన్ని ఆగమములు ఏర్పర చాయి. ఈ ప్రపంచ మంతా దుఃఖ భూయిష్ఠ మనే బౌద్ధ సూత్రంవలె దుఃఖభాజితులైన వారందరికీ ఆధ్యాత్మిక ఉపదేశానికి అర్హత కల్పించబడింది. ఈ విధంగా జాతి, వర్ణ, లింగ భేదాలు లేకుండా మనుష్యులందరూ ఆగమ మార్గాన్ని అనుసరించ డానికి అర్హులయ్యారు. దీక్ష, కార్య, క్రియ గురువుల పరిగణనను వారుకోరారు.

భక్తిమార్గానికీఆత్మార్పణం (శరణాగతి) ప్రత్యేక ప్రాతిపదిక అయింది. గురువే దైవంగా పరిగణింపబడ్డాడు. భగవంతుని చిహ్నాన్ని ధరించడం ముఖ్యం. భగవంతుని పంచరూపాలూకూడా ఒక్కటేననే ప్రగాఢ విశ్వాసంతో ఆయన అయిదు రూపాలను పూజించడం యోగశాస్త్రానికి ప్రాతిపదికగా రూపొందింది. ఈ విధంగా సర్వోత్కృష్టుడైన భగవంతుడు జగత్ సృష్టి, పరిపోషణ, వినాశనం — ఈ మూడింటికీ కారకుడు. ఆయన సర్వాంతర్యామి. సకల చరాచర జీవ జాలంలోనూ వున్నాడు. దుష్టశిక్షణార్థం, శిష్టరక్షణార్థం ఆయన అవతారాలు దాల్చుతాడు. రాతితోకానీ, పంచలోహాలతోకానీ, చేసిన విగ్రహాల రూపాలలో గృహాలలోనూ నగరాలలోని మందిరాలలోనూ దర్శన మిస్తాడు.

వైఖానస ఆగమము మరో వైదిక ఆగమము. ఇది అతి పురాతనమైనది. దీని ప్రవక్తలు ముఖ్యంగా అగ్నిదేవుని ఆరాధించేవారు. పంచరాత్ర పద్ధతిలోనే వారు భగవంతునియొక్క పంచవిధములైన రూపాలను ప్రచారంలోకి తెచ్చారు. వీరు వైష్ణవులుకూడా. ఈ వైష్ణవులు విష్ణువు వేద ప్రోక్తదైవమన్న సిద్ధాంతాన్ని వ్యాప్తిలోకి తెచ్చారు. ఈ విష్ణువే పురుష, సత్య,

అచ్యుత, అనిరుద్ధుల రూపాలు ధరించారు. వైఖానస సిద్ధాంతం పంచరాత్ర సిద్ధాంతం వలె బాగా అభివృద్ధి జెందలేదు. పంచరాత్ర సిద్ధాంతం పరిపూర్ణమైన మతసిద్ధాంతాలలో ఒకటి. ఇది దైవసంబంధంలో మానవుని మనస్తత్వం, నీతి నియమాలు, వివేచన, శ్రుతులను సంబంధించిన అంశాలను పరిష్కరిస్తుంది.

శైవమతంకూడా షట్ స్థల సిద్ధాంతాన్ని స్వీకరించింది. ఈ విధానం, పరమాత్ముడివి అతని అయిదు రూపాలలోనూ అంటే సర్వ శక్తిసంపన్నుడుగా, ఈశ్వరుడుగా, అంతర్యామిగా, దైవికమైనధ్యానానికిసంబంధించిన బాహ్యస్వరూపంగా, భక్తుని జీవితంలో జోక్యంపెట్టుకునిరక్షించే ప్రభువుగ(లీలలు) తెలుసుకోవాలని ఆత్మచేసే ప్రయత్నాలమధ్య గల అవినాభావసంబంధాన్ని నిరూపిస్తుంది. ఈఅయిదురూపాలుకూడాఅపేక్షించదగినవి. ఈ రూపాలన్నీ ఆత్మార్పణం చేసినవారిని ఆపదలలో ఆదుకునే శక్తిగలిగినవే. ఆరవది దేవుడు, ఆత్మ, ప్రకృతియొక్క అనిర్వచనీయమైన సంలీనం. అమూర్త రూపాలు 3, మూర్తరూపాలు రెండుమాత్రమేననిఅయిదు రూపాల సిద్ధాంతం వెల్లడిస్తున్నప్పటికీ దేవాలయాలలో మూడు అమూర్తరూపాలకు చిహ్నప్రాయమైన ప్రాతినిధ్యం లభించింది. ఈ విధంగా, కేవలం సురలకు లేక నిత్యసూరులకు దృగ్గోచరమయ్యే మహనీయమైన అమృత రూపం ఒక ప్రత్యేక ఆకృతిలో వున్నట్లు వర్ణించబడింది. ఆ ఉత్కృష్ట రూపానికి దేవాలయపు మూలస్థానం—గర్భగృహంలో స్థానం కల్పించడానికి లక్షింపబడింది. త్రివిధములైన విధుల అమూర్త స్వరూపాలకుకూడా కొన్ని ఆకృతులలో ప్రాతినిధ్యం కల్పించడానికి యత్నించారు. అమూర్తస్వరూపమైనహర్ద(అంతర్యామి)కు హృదయంలో తేజోరూపముగా ప్రాతినిధ్యం కల్పించబడింది. గీత (సర్వభూతానాం హృద్దేశ...తిష్ఠతి) అంతర్యామిని ఈశ్వరునితో సమీకరింపజేయడంవల్ల, అంతర్యామి ఈశ్వరుని రూపం సకలచరాచర హృదయాలలోనూ సాక్షాత్కరించడానికి సాధ్యపడిందనడంలో సందేహంలేదు. వాస్తవంగా ఏర్పడిన రూపాలు, చారిత్రక ప్రసిద్ధిగల అవతారాలు: మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, కల్కి మొదలైన ముఖ్య అవతారాలు. తరువాత బుద్ధుడుకూడా ఒక అవతారంగా పరిగణించబడ్డాడు. ఇది 13 వ శతాబ్దిలో కానీ లేక 14వశతాబ్దిలో కానీ జరిగివుంటుంది. వేంగడం (తిరుపతి), కంచి, శ్రీరంగం – ఇవి విగ్రహ ప్రాతినిధ్యం కలిగినటువంటి ప్రముఖక్షేత్రాలు. శైవ ప్రాతినిధ్యానికి సంబంధించిన అయిదు మూర్తులు పంచభూతములకు చెందినవి.

పృథ్విలింగం, ఆపోలింగం, తేజోలింగం, వాయులింగం, ఆకాశలింగంగా ఇవి వ్యవహరించబడుతున్నాయి. అవతార స్వరూపాలు ఆరాధ్యదేవులుగా చాలావరకు ఉపయోగించబడతాయి. యోగాభ్యాసాలకై నరసింహావతారం చాలా ముఖ్యమైనది. రాముడు, కృష్ణుడు ఎక్కువగా కొలవబడతారు. వారి అద్భుత కృత్యాలను, లీలలను తలపోస్తూ మనం ధ్యానముద్రలో వుండిపోగలగడమే దీనికి కారణం.

బేరాలు[1] – దేవాలయ కర్మకాండలోని దేవుని రూపాలు – సిద్ధాంతం, ఐదు దేవతా స్వరూపాల సమైక్యతను గుర్తించవలసిన అవసరంవల్ల ఉద్భవించింది. ఈ విధంగా మూలబేర, కౌతుక, బలి, ఉత్సవ, ఉగ్ర– తిరుమలై తిరుపతి శ్రీనివాస మందిరంలోని ఈ విగ్రహాలు పరమాత్మని పంచవిధ రూపాలను సాక్షాత్కరింప జేస్తాయి. ఇవి ఒకటికొకటి ఏ విధంగాకూడా భిన్నమైనవని అనుకోరాదు. ఈశావాస్యోపనిషత్తులోని శాంతిశ్లోకం జ్ఞప్తికుంచుకోదగింది.

పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమదయపూర్ణ
మేవావశిష్యతే

అది పరిపూర్ణమైనది. ఇదికూడా పరిపూర్ణమే.

ఆ పూర్ణత్వంలోనుండి యీ పూర్ణత్వం తీయగా (ఉదయించగా) సంపూర్ణత్వమే మిగులుతుంది.

మూడురకాల ఆగమముల ప్రవేశం ప్రభావం మొదట్నించీ వున్నప్పటికీ జనులకు పురాణాలలో గల ఆసక్తివల్ల సమైక్యతా భావన సాధ్యమైంది. తొలి వైదిక ఆస్తిక వాదం వ్యాప్తిలోవుంది. దేవతలు వారి వారి మండలాలలో సర్వాధికారులు. ఆ మండలాలలో వారు పరమాత్మునికి నేరుగా ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ప్రజలు ఆ ప్రాంతాలకు సంబంధించిన పేర్లద్వారా ఆయా విధుల ద్వారా ఒకే భగవంతుని ప్రార్థించారు. ఇది సహజమే. కాని తరువాతి వైఖరి ముఖ్యంగా పౌరాణిక కాలంలో క్రమేపీ విధుల వైవిధ్యం పెంపొందింది. దీని ననుసరించి విభిన్న విధులు నిర్వర్తించేవారికి వివిధ హోదాలు లభింప

---

1. నా వ్యాసాలు

వ్యూహాల సిద్ధాంతం : న్యూ ఇండియన్ యాంటిక్విటీ - 1943.

థియెరీ ఆఫ్ ఫల్గురేషన్స్ : కల్యాణ కల్పతరువు సం. 9. నెం. 2.

పంచరాత్ర : ఆరాధన, ఫిబ్రవరి 1955.

డాక్ట్రిన్ ఆఫ్ సిక్స్ ప్లేసెస్: కల్యాణ కల్పతరువు సం. 9. నెం. 7.

ఫైవ్‌ఫోర్మ్స్ ఆఫ్ శ్రీనివాస : టి.టి.డి. బులెటిన్.

జేయబడుతుండేవి. దీని ఫలితంగా కలహాలు చెలరేగాయి.

*ఉపనిషత్తులలో ఒక కథ చెప్పబడింది*

వివిధ అంగాలకూ ప్రాణానికీ మధ్య ఘర్షణ ఏర్పడిందట. ప్రతి ఒక్కటి తనకు తాను ముఖ్యమైనదని వాదించడమే గాక తాను లేకుండా మిగితా అంగాలు పనిచేయడం కష్టమేగాక క్షీణిస్తాయని వాదన. అప్పుడు జీవి యే వాదనలేకుండానే శరీరం నుండి తనకు తాను ఉపసంహరించుకుంటుంది. అంటే అన్ని అవయవాలు తమకు తాము నిరుపయోగమైనవిగా భావించడం ప్రారంభించాయి. అంతేగాక (ప్రాణం) అన్నిటికన్నా ముఖ్యమయిందని గుర్తించాయని ఉపనిషత్తు అంటుంది. ఇదేవిధంగా అనేక మంది దైవాలలో ఏ దేవుడు ముఖ్యమైన వాడనే విషయానికి కూడా యిది వర్తిస్తుంది. కస్మై దేవాయ హవిసా విధేమా ? తక్కువ స్థాయి అంగాలకు వివాదం ఏర్పడితే వాదన జరుపుకోవచ్చు. కాని అత్యున్నతిమైన దైవం తన ఉనికిని గుర్తింప జేస్తూ, ఉపసంహరణ ద్వారా తన అవసరాన్ని తలపింప జేస్తే, దైవాలలోని ప్రతిఒకటి తన స్థానాన్ని గుర్తిస్తాయి. దేవతల విషయంలో అగ్ని, వాయు, ఇంద్ర మూడు ముఖ్యమైన దేవుళ్ళు, నాలుగవది, అతిముఖ్యమైన యక్షుల గూర్చిన సత్యాన్ని కేనోపనిషత్తులోని అంశాలు వివరిస్తాయి.

యెవరు అధికులు అనే విషయంలో విష్ణు, శివ, బ్రహ్మల మధ్య ఏర్పడిన వివాదం ఆధిక్యతపై జరిగిన పరిష్కారం గూర్చిన విషయాలు దక్షిణాదిలో క్రీస్తు తర్వాతి కాలంలో చాలా ప్రచారంలో ఉన్నాయి. మత విషయకంగా అనేక వర్గాలు ఏర్పాడ్డాయి. వారి ఆధిక్యతల గూర్చిన అనేక పురాణ కథలు వ్యాప్తిలో ఉన్నాయి. వివిధ సందర్భాలలో ఒకరి ఆధిక్యతను ఒకరు గుర్తించి పరిష్కరించుకున్నట్టు గూడా అవే పురాణాలలో వ్రాశారు.

అయితే విభేదాల అఘాతాలను పూర్వ దంలో వేదాంతిక పరిష్కారాలు తోడ్ప డ్డాయి. ముగ్గురు దేవుళ్ళు కూడా అకే ఒక దేవుని వ్యూహాలుగాను, శక్తిగాను చూపారు. నిజంకూడా అంతే. యీ విధంగా మహా-విష్ణు, మహాశివ, మహేశ్వర, బ్రహ్మానంద మొదలైన పేర్లతో పిలువబడ్డారు. దక్షిణ భారతంలో ద్రావిడ భాషల అభివృద్ధికి చాళుక్యుల కాలం దోహదంచేసింది. తూర్పు చాళుక్యుల రాజ్య కాలం చాల ముఖ్యమైంది రాజరాజ నరేంద్రుని రాజ్యపాలన ముఖ్యాతి ముఖ్యమైంది. నన్నయభట్టు మహాకవి తెలుగులో భారతం రచించారు. వ్యాసరచిత భారతానికి యిదిచాలా సన్నిహితంగా ఉంది. అంతేగాక భండార్కార్ ప్రాచ్యభాషా పరిశోధన సంస్థ ఇటీవల ప్రచురించిన విమర్శణాత్మక సంపుటి మహాభారత మూల చరిత్రలోని సహేతుకమైన విభాగాలను పరిశీలించడానికి, ముఖ్యపాత్ర వహిస్తుంది. సాధారణ పరిభాషలో యిది భారత అనువాదం అని అనుకోరాదు.

"ధర్మశాస్త్రజ్ఞులకు ధర్మ శాస్త్రంగానూ, ఆధ్యాత్మవిదులకు వేదాంతంగానూ, నీతికోవిదులకు నీతి శాస్త్రంగానూ, కవులకు ఉత్తమకావ్యంగానూ. లాక్షణికులకు లక్షణ శాస్త్రంగానూ, చరిత్ర కారులకు ఇతిహాసం గానూ, పౌరాణికులకు పురాణంగానూ" యీ భారతం ఉపయోగపడుతుందని నన్నయ భట్టు ప్రకటించారు. యీ మహాభారత సందేశం సంపూర్ణమైనదీ, ఉన్నతిమైనదీ కావడం వల్ల దీనిని భారత ధర్మంగా అభివర్ణించారు. హిందూ సంస్కృతీ, ఒక విధంగా ఆంధ్ర మత, సంస్కృతులు ఇందులో నన్నయభట్టు దృష్టిలో సమగ్ర సంపూర్ణ హిందూ సంస్కృతీ వర్ణనే మహా భారతానికి ప్రాతిపదిక అయితే, తిక్కన దృష్టిలో దేవదేవుని అభివర్ణనిల్చింది; ఆదేహరిహరుడు.తిక్కన సోమయాజులు—సోమయజ్ఞము చేసినవాడు. అందువల్ల వేదమంత్రాలను మరచి పోలేదు. రెండవ శతాబ్దంలోని మొదటి సంవత్సరాలలో వాటికవే వచ్చాయి. అయితే నన్నయ భట్టు తిక్కనల మధ్యకాలంలో శైవ మతం ఉచ్ఛస్థితి అయి వీరశైవం శివ రూపంలో ఉన్న ఒకే ఒక దేవుని పూజించే వ్యవస్థ వ్యాప్తిలో ఉండేది. ఆదేకాలంలో వైష్ణవ మతం ఉచ్ఛస్థితిలో ఉంకి విష్ణువు ఏకైక దేవుడుగా పూజించేకాలంలో బహుశా యీ విధంగా జరిగి ఉండవచ్చు యీరెండు విధానాలు తీవ్రస్థాయికిచేరడం కారణంగా దేవుణ్ణి గూర్చిన అధునిక నామాన్ని వాడడంలో స్వంత నిశ్చయం ఉండాలని తిక్కన సోమయాజి అభిప్రాయ పడ్డారు. దీనిని ఆయన మహాభారతంలో కనుగొన్నారు. అదే హరిహర నామం. యీ అంతర్దృష్టి శైవ వైష్ణవమతాల ఆత్మహత్యా సదృశమైన విపరీత ధోరుణుల నరికట్టి సమరస ధోరణిని కల్పించడంలో సహాయ పడింది. తురుష్కుల తుపాకులు అప్పుడే సోమనాథ్ లోని శివాలయాలను, వైష్ణవాలయాలను ధ్వంసం చేసి, ఎదురు లేకుండా దిగువ ప్రాంతాలకు వస్తున్నాయి. తిక్కనయొక్క హరిహర దృష్టివల్ల మత విషయకంగా ఉన్న వ్యతిరేక శక్తులు తలొగ్గే అవకాశం కల్గింది.

అద్వైతంలోని బ్రహ్మ—ఈశ్వర సంబంధానికిగల ప్రాముఖ్యాన్ని బలపరచే శివశక్తిని "అర్ధనారి", శ్రీనివాసఆస్తికత్వం మాదిరిదే యీ హరిహర ఆస్తికత్వం. యివి చాలా ముఖ్యమైనరోజులు. నిరాశా

వాదమతంతనదృష్టి. అనుభవాల విషయంలో క్లిష్టదశలో ఉంది. నిరాశా వాదమతాలన్నిం టిలో అనుభవం చాలా బలీయమైన అంశం.

ఆంధ్రలో వైష్ణవమత విస్తరణ (రామానుజాచార్యులు ఆంధ్రదేశపు దక్షిణసరిహద్దూ, తమిళనాడు ఉత్తర సరిహద్దూ అయిన ప్రాంతానికి సంబంధించినందువల్ల యీ మతం ఆంధ్రలో ఉద్భవించినదే ననవచ్చు) 12 వ శతాబ్దంలో ప్రారంభమై. 18 వ శతాబ్దంవరకు నిరాటంకంగా విస్తరిల్లుతూ వచ్చింది దీనిమతాధిపతులుమతవిషయంలో, ధ్యానం విషయంలో, దేవాలయాల నిర్వహణలో, సాంఘిక అభివృద్ధిలో తమిళ, ఆంధ్ర ప్రాంతాలకు ఒక సమ్మిశ్రిత విధానాన్ని అప్పుడే రూపొందించడం మొదలెట్టారు. అహోబిలం (కర్నూలుజిల్లా, నంద్యాల తాలూకా)లోని శ్రీ నరసింహుని ఆదేశానుసారం అదివోం శఠకోపాచార్యుల వారు అహోబిల మఠాన్ని స్థాపించడంతో యీమతం 15, 16 శతాబ్దాలలో బహుధా విస్తరించింది. శ్రీ వైష్ణవమతం యొక్క ధ్యానయోగ సాంప్రదాయాన్ని పునరుద్ధరించిన మతం యిది. శ్రీ వైష్ణవ మతం ఎప్పుడూ నేరుగా తన్నుతాను తెలుసుకొనే టట్టు చేస్తుంది. అయితే యీ సిద్ధాంతంమీదే యీమతం, తర్వాత తర్వాత నామమాత్రాలైన సిద్ధాంతాల ధోరణికి దిగజారిపోయింది. అచ్చమైన భక్తులు నేరుగా దేవుణ్ణి తెలుసుకోవడానికి గృహాలలో విగ్రహారాధన అవకాశం కల్పించింది. అలా శ్రీ వైష్ణవ సాంప్రదాయంలోని కుటుంబాలకు అనునిత్యం ధ్యానయోగ మతానుభవాలు వుంటూనే వుండేవి. మతానికి, సాంఘిక ధర్మాలకు సర్వ సాధారణంగా కట్టుబడి వున్నప్పటికీ, అదే సమయంలో వీరు ధ్యానయోగ అనుభవాల్లో శిక్షణ పొందుతుండేవారు.

అదేవిధంగా శైవమత ధ్యానయోగం కూడా తమతమ గృహాల్లో, ఆరాధనల్లో పరిపోషింపబడిందని ఆగమం వ్యక్తం చేస్తున్నది. శైవ మతంలో ధ్యానయోగానికి సంబంధించిన అంశాలు విస్తరించడానికి, కొనసాగించడానికి యివి తోడ్పడ్డాయి. విదేశ మతాల తాకిడికి నిలువగలిగే ఒక గొప్ప ఆధ్యాత్మిక వాతావరణాన్ని తమ రచనల ద్వారా యీ యిరువర్గాల కవులు (జ్ఞానులు) కల్పించారు. వీటిలో చాలా వాటిని మామూలు బోధనల ద్వారా కాక ఉన్నతమైన మార్గాల్లో తెలివిగా విలీనం కావడానికి తోడ్పడ్డారు.

మాధవుని వైష్ణవ మత సాంప్రదాయం కూడా ఆ ప్రదేశంలో విపరీతమైన వేగంతో విస్తరించింది. ఈ మతం ఆంధ్రదేశానికి వచ్చి, భగవదాలంబనా ధ్యానయోగంలో ద్వి మార్గాన్ని విస్తరింప జేసింది. కన్నడంలో దీనికిసంబంధించిన దశలు అనేకంవున్నాయి. ఇవి ఆంధ్రదేశానికి భక్తి ప్రపత్తులుగల ఆరాధనా వెల్లువను ఒకదానిని తీసుకొచ్చాయి దీనితో ఇస్లాముమత వెల్లువ కూడా సాటిరాదు. ఈ సమయంలోనే ఇస్లాముమతం వెల్లువలా ఆంధ్రదేశాన్ని ముంచివేసింది (14 శతాబ్ది) ప్రజలలో మతానికి సంబంధించిన జీవన విధానాలు పూర్వపు పద్ధతులను విడిచి కొన్ని కొత్త మార్గాల్లో అభివృద్ధి చెందాయి. కాశ్మీరు నుండి కన్యాకుమారివరకు భారత దేశమంతటా పుణ్య ప్రదేశాలు వ్యాపించి వున్నాయి. హిందూ భక్తుడు తన జీవిత కాలంలో యీ అన్ని పుణ్యక్షేత్రాలనూ ఒక్కసారైనా సందర్శించాలి. పైగా, దీక్ష పుచ్చుకునే టప్పుడు, వివాహ సందర్భంలోనూ, యింకా యిటువంటి యితర సమయాలలో సందర్శించవలసిన కొన్ని దేవాలయాలు

వున్నాయి. అంటే ప్రజలు ఆంధ్రదేశం మీదుగా దక్షిణాదికి, ఉత్తర భారతదేశానికి వెళ్ళాల్సి వుంటుంది. మార్గమధ్యంలో దారి పొడువునా వున్న పవిత్ర దేవాలయాలను, పుణ్యక్షేత్రాలను సందర్శించవలసివుంటుంది. శ్రీశైలం, అహోబిళం, కాళహస్తి, తిరుపతి, మంగళగిరి, శ్రీ కూర్మం — ఈ పుణ్యక్షేత్రాలన్నింటికీ అనాదిగా యాత్రికులు వస్తూనే వున్నారు. బలరాముడు, అర్జునుడు సందర్శించిన యాత్రాస్థలాలను మహాభారతమే వివరిస్తున్నది. పవిత్రస్థలాలను శ్రీరాముడు కొంతకాలం బసచేసిన కారణంగా పవిత్రమైన స్థలాలనూ రామాయణం ప్రస్తావించింది. భక్తులు భగవంతుడిని సందర్శించిన స్థలాల్లో నిర్మింపబడిన దేవాలయాలు కూడా యాత్రాస్థలాలుగా వినుతికెక్కుతాయి. యాత్రలు చేయడం అనేది సర్వత్రా అమలులో వుండనే వున్నది. ప్రజలు ఒక దేవాలయంనుండి మరొక దేవాలయానికి కదులుతూ, ఆప్రాంతాలలోని సాధుపుంగవుల ఆశీర్వాదాలు అందుకుంటుండేవారు. అంతేకాదు యీ ప్రాంతాలు యోగవిద్యా ప్రదర్శనలకు ఆలవాలాలుగా వుండేవి వేదాంత విజ్ఞానానికి ఆటపట్టులుగా వుండేవి. దీక్ష పూనడానికై ప్రజలు యీ ప్రాంతాలకు వెళ్ళుతూ వుండేవారు. దేవాలయాల్లో జరిగేఉత్సవాలకు, జాతరలకు అన్ని వర్గాల ప్రజలు వెళ్తుండేవారు. తమతమ భక్తిదాహాన్ని తీర్చుకుంటుండేవారు.

ఈ విధంగా వివిధ శాఖలకు చెందిన సద్వర్తనులు తరచుగా కలుసుకోవడం వల్ల మతాల సమ్మేళనానికి తావేర్పడింది. అంటే మతానికి సంబంధించిన కొన్ని కరుడుకట్టిన విధానాలు, వివిధ శాఖలకు చెందినప్రజలు ఒకరికొకరు సన్నిహితంగా రావడంవలన, యితరుల వత్తిడికి తలవంచి, తద్వారా

ప్రజలందరినీ ఏకత్రాటిమీదకు తేవడానికి, పరమత సహనం వారిలో కలిగించడానికి తోడ్పడ్డాయి. ఈ ప్రకృతీ, యీ జీవుడూ— ఇవన్నీ సర్వకాల సర్వావస్థల్లోనూ యధార్థమైన పరమాత్మ అనబడే వానిలోంచి విడివడ్డ శరీరాలేతప్ప మరేమీ కావనే దృక్పథాన్ని విస్తరింపజేసిన అక్షయ వాదాన్ని శివ, వైష్ణవులిరువురూ అంగీకరించారు వీరే విశిష్టాద్వైతులు. సృష్టిమిథ్య అనే అద్వైత దృక్పథానికీ, సృష్టి అక్షయమైనది అనే అద్వైతదృక్పథానికీ మధ్యగల వ్యతిరేకతలను సమసిపోయేటట్టు చేసి, యీ సృష్టి భగవంతుని లీలావిశేషానికి చిహ్నంగా చూపించబడింది.

సాంస్కృతిక, మతవిషయక కార్యకలాపాలను అభివృద్ధి పరచడానికి విజయనగర సామ్రాజ్యం ఎంతగానో కారణభూతమైంది అందువల్లనే యీ కాలంకూడా చాలా ప్రసిద్ధమైనది. ఇతర మతశాఖలు అదినుండీ వుంటున్నప్పటికీ యీ సామ్రాజ్యంలో తాతాచార్యులు భగవత్ కృషిలో శక్తివంతుడైన వాడుగా తయారయ్యాడు కృష్ణదేవరాయలు భగవద్భక్తి గల ప్రభువు. తిరుపతిలో ఆరాధిస్తుండేవాడు. స్వయంగా తాను ఆళ్వారులమీద ఆముక్తమాల్యద అనే ప్రసిద్ధ గ్రంథాన్ని రచించాడు. కృష్ణదేవరాయల ఆస్థానంలో ప్రసిద్ధ కవిపండిత ప్రకాండులు వుండేవారు. పురాణాలకు, మహాభారతానికి సంబంధించిన కథలు ఆధారంగా స్వంత రచనలు, అనువాదాలు ప్రోత్సహించబడ్డాయి అనాడు.

కవిత్వంలో అద్వితీయమైన ఆరాధనా విధానాన్ని ప్రకటించినవాడు పోతన. ఇతని భాగవతం ఆరాధనకు సంబంధించిన కావ్యం అయింది. ఒంటిమిట్ట (కడప జిల్లా)లో యీయన నివసించినప్పటికీ యీయన ఆరాధనా విధానం విష్ణ్వావతారాలన్నిటికీ ఒకే తీరు ఆరాధనను ప్రకటిస్తూ దూరదూర తీరాలలోకి కూడా వ్యాపించింది. ఈయన, భక్తుని,దర్శనాన్నిగొప్పదియైనఅనుభవంతో జోడించాడు. నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ — యీ కవి త్రయం రచించిన భారతమూ, పోతన భాగవతమూ — యీ రెండు గ్రంథాలు పండితులకే కాక పామరులకు కూడా మానసికోల్లాసాన్నిస్తాయని చెప్పొచ్చు రామాయణానికి వివిధ కవులు చేసిన అనువాదాలు అనేకం వున్నాయి. రామాయణకథ భారతదేశమంతటా అందరికి సుపరిచితమే.

అన్నమాచార్యుని పాటలు వున్నప్పటికీ చాలా ఏళ్ళపాటవి వెలుతుర్లోకి రాలేదు, అచ్చుకెక్కలేదు. తిరుమల తిరుపతి దేవస్థానంవారు వాటిని అచ్చువేసి నలుగురి మధ్యకూ తెచ్చారు. కడపటి శతాబ్దంలో మహాభక్తురాలు తరిగొండ వెంకమ్మ పలుమార్లు భగవంతుని దర్శించింది. యోగవిద్యను ప్రదర్శిస్తుండేది. వీరబ్రహ్మం గొప్పప్రవక్త. వీరశైవులకు, వీర వైష్ణవులకు వ్యతిరేకంగా వీరబ్రహ్మం అని పిలువబడడమే తనకు ఇష్టమని యీయనే చెప్పుకున్నాడు. ఈయన భగవంతుని సృష్టి లీలా విశేషాలను ఆరాధించాడు ఈయనగొప్పయోగసిద్ధుడుకూడాను. వీరు ధ్యానయోగులుతప్ప మతాధిపతులు మాత్రంకారు. అదే విధంగా నారాయణ వనంలో ఒక మౌని వుండేవాడు. తనజీవిత కాలంలో భగవంతునిదర్శించాడాయన. సొరక్కాయల స్వామిగా యీయన ప్రసిద్ధుడు. అతి సామాన్యమైన ధ్యానయోగులైన అధ్యాపకులుగా అనేకమంది ఋషులు వున్నారు. ఎర్పేడువద్ద ఆశ్రమాన్ని ఒక సాధువు (మళయాళస్వామి) నిర్వహిస్తుండేవాడు.

అదేవిధంగా యీనాడు, అనేకమంది భక్తుల భావన ప్రకారం, పుట్టపర్తిలో సాయిబాబా అవతారంవుంది. ఇవన్నీ ధ్యానయోగానికి సంబంధించినవి. మతాన్ని వీరు స్వేచ్ఛగా వుపయోగించుకున్నప్పటికీ వీరు ఏ సిద్ధాంతానికి కట్టుబడి వుండలేదనేది స్పష్టపడుతున్నది. ఒకచోటినుండి మరోచోటికి పరిభ్రమిస్తుండే ఈశ్వరవాదులు, జంగములు, సన్యాసులు, దాసరులు, భాగవతులు నిర్మాణాత్మకమైన సంఘపు కట్టుబాట్ల కరుడుకట్టిన సూత్రాలను పరిచ్ఛేదంగావించి మతానికి జీవం పోసినప్పటికీ. విదేశీయ మతాల వత్తిడికి నిర్వాహణ ధోరణిలో మతసంస్థలు తలెత్తినపుడు ప్రజలకు అండగా నిలిచిన ఘనత వీరికి దక్కింది. క్రీ. శ. 2వ శతాబ్దంనుండి కూడా ఇస్లాము ప్రభువుల దండయాత్రల వల్ల క్రమబద్ధంగా నిర్వహించబడుతున్న మత సంస్థలు ఎంతగానో నష్టపోయాయి. పదిహేనవ శతాబ్దంనాటికి యివి పరాకాష్ఠ నందుకున్నాయి ఇస్లాము మత నమ్మకమయిన విగ్రహారాధన వ్యతిరేక విధానం క్రింద ఎన్నో అరాజక చర్యలు జరిగాయి. దేవాలయాల రాళ్ళతో మసీదులు లేచాయి. బలవంతంగా మతంలోకి మార్పిడి చేయడం జరుగుతుండేది. ఈ పని చాల నిర్దయగా, క్రూరంగా అమలుపరచ బడుతుండేది. కాని యీ అగాధంమధ్య వారధిని కట్టే ప్రవక్తలు యిరుమతాలలోనూ ఉద్భవించారు. ఏ మతానికి చెందినవారైనా దేవుని బిడ్డలను విడదీసేది మతదురభిమానమే నని వీరు గుర్తించారు. మహమ్మదు అనుయాయు లయిన సూఫీలు, హిందువులలో యోగులు ఆరాధనలో యించుమించు దగ్గరిపోలికలుగల విధానాన్ని కనుగొన్నారు. పైకి ఎన్ని వ్యతిరేకతలు వున్నప్పటికీ లోలోపల యీ రెండింటికి పొందిక కుదిరింది.

వివిధమత సిద్ధాంతాలమీద ఆధారపడిన ఒక సాముదాయక మతాన్ని కనిపెట్టాలనే అక్బరు తీవ్రకృషి. ఈ విధమైన సర్వ మానవ మతాన్ని అంగీకరించే ప్రజలు వున్న ప్పటికీ దురదృష్టవశాత్తు ఒక స్వరూపాన్ని ఏర్పరచుకోలేదు.

రోజుకు అయిదు పర్యాయాలు దైవ ప్రార్థనలు చేసే నియమాలకు, భగవంతు నికి అంకిత మొనర్చుకున్న నియమబద్ధ మైన జీవితాలకు గల ఆకర్షణ ఉత్తమ మైనది. దీనికీ పంచరాత్రానికి మధ్య చాలా వరకు సామ్యం వుంది. ఎందుచేతనంటే పంచరాత్రం కూడా రోజుకు అయిదు సార్లు ప్రార్థనలు జరపడాన్ని, ఆత్మార్పణ మొనర్చ డాన్నే నిర్దేశిస్తున్నది. అయితే దీని మర్మవాద సంబంధమైన చిహ్నం ఒక విధంగా సంపన్నమైనది జీవితానికి సంబంధించింది.

కాని సంస్థాగతమైన వైరుధ్యం ఎప్పుడూ కూడా మర్మసంబంధమైన దర్శనాలను అణచి వుంచుతుంది. ఇస్లామ్ తరువాత క్రీ. శ. సుమారు 1600వ సంవత్సరంలో భారత దేశంలోకి క్రైస్తవ మతం ప్రవేశించింది. పిమ్మట రెండు శతాబ్దాలలో దేశంలో క్రైస్త వుల పరిపాలన ప్రారంభమైంది. ఈవిధంగా మన దేశంలోని ప్రతి ముఖ్యమైన నగరం లోనూ, గ్రామంలోనూ మసీదులు, మంది రాలతో పాటుగా చర్చీలు కూడా ఏర్ప డ్డాయి. క్రైస్తవ మత బోధనకై విద్యా సంస్థలుకూడా స్థాపించబడ్డాయి. సాధ్యమై నంత ఎక్కువమంది హిందువులను క్రైస్త వులుగా మార్చే కార్యక్రమాన్ని శ్రీఘ్రత రంగా నిర్వహించడానికి కూడా ఇవి ఉద్దే శించబడినవి. దీని ప్రభావం హిందూ సమాజంపై రెండు విధాల పడింది. (1) పాశ్చాత్య మత విషయాల అధ్యయనాన్ని ఇది పెంపొందించింది. మేధావివర్గాలు యథేచ్ఛగా ఆలోచించడానికి వీలు కలిగిం చింది. (2) హిందూ సమాజంలోని ఉపే క్షించబడిన, అణచబడినటువంటి దిగువ వర్గాల వారి మతం మార్పిడిని పెంపొందిం చింది. వర్ణ వ్యవస్థతో కూడిన హిందూ మతంలో పరమాత్మని కరుణా కటాక్షాలకు నోచుకోలేకపోయిన ఈ వర్గాలవారికి ఈ మార్పువల్ల ఆ అవకాశం చేకూరగలిగింది.

అయితే మతం, మర్మవాదానికి సంబం ధించిన అంశాలలో హిందూమతానికి అపార మైన అనుభవం వుందనే విషయాన్ని ఆధ్యా త్మిక జీవితానికి సంబంధించిన మర్మవాదపు హేతువులలో ముఖ్యమైన దొకటి హిందూ మతంలో వున్నట్లు పాశ్చాత్య పండితులు గ్రహించారు. హిందూమతానికి మానవుని ఆధ్యాత్మిక అనుభవమే ప్రాతిపదిక. ఇది వ్యక్తి యొక్క ఆత్మకు, అంతిమ లక్ష్యానికి సంబంధించిన హేతువాదబద్ధమైన ప్రత్యక్ష జ్ఞానపద్ధతి.

వివేకి అయిన హిందువుకు ఇస్లామ్, క్రైస్తవమతంరెండింటిలోనూ కులాలమధ్య వుండేటటువంటి తీవ్రమైన వైరుధ్యాలే అంతర్గతంగా వున్నట్లు గోచరించింది. ఈ మతాలలో విభిన్న ఉపతెగలు వుండేవి. ఈ విధంగా మతాలన్నీకూడా ప్రత్యక్ష అనుభ వానికై అంతఃకలహాలు, వైరుధ్యాలతో కూడిన ఒకే విధమైన సమస్యలు గలవే. గురువు ప్రవక్త — మినహా మధ్యవర్తు లెవరూ లేరు.

సంక్లిష్టంగా వున్న ఈ పరిస్థితికి శాస్త్ర విజ్ఞానం, టెక్నాలజీ వెల్లివిరుస్తున్న ఆధు నిక యుగం తోడైంది. ఈయుగపు గమనం అత్యద్భుత మైనది. శాస్త్ర విజ్ఞానం, సాంకే తిక పరిజ్ఞానం వ్యాప్తి జెందినంత శీఘ్రంగా విస్తారంగా ఏ మతంకూడా వ్యాపించలేదు. భౌతికవాదం, ఆర్థికాభివృద్ధి, విప్లవం — ఇవి ఈనాడు మతాన్ని సవాలు చేస్తున్నాయి. శాస్త్రవిజ్ఞానమనే ఈ మతానికి హేతువాదమే ప్రాతిపదిక. అంతేకాని మానవాతీతమైన శక్తి గాదని అంటారు. యుగాల తరబడిగా మతాలు ప్రబోధిస్తున్న దైవసిద్ధాంతం నుంచే బహుశా శాస్త్రవిజ్ఞానపు నాస్తికవాదం పుట్టి వుంటుంది. కనుక మతాలన్నీ శాస్త్రవిజ్ఞానం నుంచి దాని భౌతికవాదం నుంచి గట్టి సవాలు ఎదుర్కొంటున్నాయి. వీరు చర్చీ, మసీదు లేక దేవాలయంలోని దేవుడిని కాక యంత్రాన్ని కానీ, స్పుత్నిక్‌ను కానీ ఎక్కువ ఆరాధిస్తారు.

అయితే మతానికి శాస్త్రవిజ్ఞానం నెరవే ర్చలేనటువంటి లక్ష్యం ఒకటుంది. ఎంతటి అద్భుతమైన సాధనాలను కనుగొన్నప్పటికి అందువల్ల పరమాత్మ, ఆత్మసందర్శనానికై వలసిన మానవావసరాలు తీరవు. ఈవిధంగా గాంధీ మహాత్ముడు నైతిక మత సిద్ధాంతం ద్వారా మతం, శాస్త్రవిజ్ఞానం రెండింటికి కూడా సత్యం, అహింస అనే పేర్లతో పిలువ బడే దైవం వున్నాడని నిరూపించాడు.

ఏ మతం కూడా పరమాత్ముని యొక్క ఈ రెండు గుణాలను విసర్జించజాలవు. ఈ రెండు అంశాల విషయంలో తగు విధంగా ప్రమత్తతతో వుండక పోవడం వల్లనే మతాలు పతనమై పోయాయి. మానవునిఆత్మ సర్వశక్తులు, భగవంతునిపై కూడా తిరుగు బాటు చేయవచ్చుకానీ సత్యం, అహింసపై తిరుగుబాటుచేయలేదు. అద్భుతమైన శక్తి గల ఈ మతాన్ని గాంధీ మనకు ఇచ్చారు. భగవంతుడు ఒక్కడే. ఆయన అనేక నామాలతో వ్యవహరించబడతాడు. ప్రపంచమంతటా మానవాళిని రక్షించడానికి, ప్రబోధించడానికి, మార్గదర్శి కావడానికి ఆయన మళ్ళీ మళ్ళీ అవతారాలు ఎత్తుతాడు. ఉపనిషత్తులు, గీత, ఖురాన్, మ్యాథ్యూ

మెంట్, ధర్మపథం కూడా ఇదే సత్యాన్ని ఉల్లేఖిస్తున్నాయని గాంధీజీ అన్నారు. సత్యమే దైవము. దైవమే సత్యము. మానవుడు తన ప్రతి చర్యలోనూ, ఆలోచనలోనూ భగవంతుని, సన్నిధానం అనుభవిస్తాడు.

ఈ దివ్య సందేశం పండితపామర జనంపై కూడా అద్భుతమైన ప్రభావం కలిగించింది. భారతదేశంలో జనులు భయ భ్రాంతులు, ఆశామోహాల నుంచి విముక్తి పొందారు. మతం, సాంఘిక తత్వశాస్త్రిలకు సాంఘికంగా అపారమైన అవకాశం వున్నప్పటికీ మతం, మర్మవాదాలు సాంఘిక లేక రాజకీయ అంశాలకంటే ఉన్నతమైన పాత్ర వహిస్తున్నాయి. దేవాలయ ప్రధానమైన నగరం కళలు, శాస్త్ర విజ్ఞానాల అభివృద్ధికి దోహదంచేసింది. సమాజంలో విభిన్న వర్గాలు, తెగల వారిలో సామరస్యం ఏర్పరిచింది. చర్చి, మసీదుల మధ్య కాలపునాటి విధులు కూడా ఇంటువంటివే

నేటి ఆధునిక కాలంలో ప్రపంచం, మానవాళి అంతా ఒకటిగా రూపొందుతున్నవి. కాబట్టి, ప్రపంచ మతం ఒకటి ఏర్పడవలసి వుంది. పాత మతమేదీ అవి చెప్పుకున్నట్లు ప్రపంచ మతంగా రూపొందే అవకాశం ఇప్పుడు లేనేలేదు. మానవుని మేధస్సు, ఇంద్రియ జ్ఞానం, మనోవాంఛల వైపుకు అతని హృదయాన్ని విశాల దృక్పథంతో అవగాహనం చేసుకోవడమే ప్రస్తుతం కావలసింది. మానవ వ్యక్తిత్వం కంటే అతీత స్థితి కల్పించగల మతాలకే భవిష్యత్తువుంది.

శ్రీ అరవిందుడు ప్రతిపాదించిన దివ్య పరిణామ వాదాన్ని అనుసరించేవారు ఆంధ్రప్రదేశ్‌లో అనేకమంది వున్నారు. వారు ఉన్నత పరిణామ స్థితి సాధనకు అంకితమయ్యారు. ఈ పరిణామాన్ని దివ్య అనంత శక్తి — ప్రతి వ్యక్తిలోనూ దివ్యవ్యక్తిత్వపు నూతన అవతారం — సాధించగలుగుతుంది. పురాతన మతసిద్ధాంతాల చైతన్యపు మార్పు వలె ఇది మానవునికి నూత్న బాధ్యతలు, విశ్వాసాలు కలిగించగల వినూత్నమైన శక్తి. భూతలం మీద దైవరాజ్యాన్ని ప్రతిష్ఠించడం అరవిందుల లక్ష్యం. నిత్యము, సత్యము అయిన భగవత్ తత్వాన్ని మిధ్యామార్గంలో సందర్శించడానికి ఆయన ఈ లక్ష్యాన్ని ప్రతిపాదించారు. ఆధునిక యుగంలో మనం అనుకునే రామరాజ్యం దాదాపు ఇటువంటిదే.

ఈ శతాబ్దిలో మతాలు నశించి పోవడం లేదా కనీసం విచ్ఛిత్తి నొందడం జరుగుతున్నది. దీనినే మృదువుగా చెప్పాలంటే అతి విశాలంగా ఆలోచన ప్రారంభమైనదనాలి. యుగాల నాటి బూజుపటిన భావాలు తొలగిపోతున్నాయి. నూతనమైన క్రాంతి, కొంగ్రొత్త ఆశలతో ప్రవేశించింది. ఇవి మానవులకు స్వేచ్ఛా సమానత్వం సౌభ్రాతృత్వాలను ప్రసాదించగలుగుతాయి. అంతేకాక ఆధ్యాత్మిక పరిణామంలోని ఉన్నత సోపానాలకు మానవుని చేర్చే ప్రయత్నం ప్రారంభమైంది. మన విద్యా విజ్ఞాన పద్ధతులు గతంలోని అనుభవ సంపదనంతా పరిగణనలోకి తీసుకోవాలి. అలాగే భవిష్యత్తులో మానవుని ఆధ్యాత్మిక వైభవానికి సంబంధించిన విధానాలనుకూడా గుర్తించాలి.



అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే
# టీ

సాటిలేని టీ!

టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైనదేముంది! ఇందుకు కారణాలు:—

## తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

## పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

## ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** *టీ త్రాగండి; ఆనందము అందుకోండి!*



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్-నారింజ రంగు ప్యాకెట్
షాన్—నీలి రంగు ప్యాకెట్






# ✲ వీరవనితల శంఖారావం ✲

కె. లక్ష్మీ రఘురామ్

ప్రపంచమంతటా మానవ సహజ లక్షణములు ఒక్కటే. సుఖాన్ని పొంది సంతోషిస్తారు. దుఃఖములో బడి విచారిస్తారు. పురుషులు స్వార్థముతో స్త్రీ జాతినంతా అణచి వేశారు. నిరంకుశముగా అసహాయులైన స్త్రీలను ఆటబొమ్మలుగా వుపయోగించుకున్నారు. స్త్రీలకు తెలివి తేటలు, ఆత్మ, ఆత్మ గౌరవము, అహంభావము, ఆశలు, ఆశయాలుంటవని మరచిపోయారు. కాని స్త్రీ మేల్కొంది. పురుషులు పెట్టే బాధలు మితిమీరి భరింపరానివైనవి. వారి ప్రేమలలో ఉపేక్ష, వారి ఔదార్యములోని స్వార్థము, వారి ఉదారతలోని అపేక్ష, వారి జీవిత విధానములోని నిరంకుశత్వము. వారి అధికారములోని అహంకారము, వారి హక్కులవలన బానిసత్వము స్త్రీలు గ్రహించారు.

దేశ దేశాలలో విప్లవ జ్వాలలు వేగంగా ముట్టడిస్తున్నవి. ఫ్రాన్సు దేశములో స్వాతంత్ర్యము సమానత్వము నినాదాలు మిన్ను ముట్టుచున్నవి. ఇంతలో యింగ్లాండులో పారిశ్రామిక (Industrial revolution) విప్లవ మంటుకున్నది. ఈ రెండు విప్లవాల కారణంగా వుద్భవించినది స్త్రీల తిరుగుబాటు. కాని తరువాత చాలాకాలానికి స్త్రీ స్వాతంత్ర్యోద్యమము కలలు ఫలించాయి. యితర దేశాలలో జరిగిన వివిధ మహిళాభ్యుదయ విప్లవాల దృష్ట్యా మన భారత మహిళలోకూడా నేర్చుకోవలసిన ఆదర్శప్రాయంగా నిలుపుకొన వలసిన విషయాలనేకం ఉన్నాయి. అందువల్ల బ్రిటన్‌లో వచ్చిన మహిళా విప్లవాన్ని గురించి సంగ్రహంగా వివరిస్తున్నాను. యింగ్లండులో నిజంగా స్త్రీల తిరుగుబాటు 1792 లో అవతరించింది. శ్రీమతి వాల్‌స్టోను క్రాఫ్టు (Mrs. Mary Woollstone Craft) అనే ఆవిడ "స్త్రీల హక్కు"లనే చక్కని పుస్తకము రచించింది. కాని శతాబ్దాలుగా కలము స్త్రీల చేతిలో వారి అభ్యుదయ సంప్రాప్తికి వజ్రాయుధముగా వుపయోగపడ్డది.

ఆ "స్త్రీలహక్కు"లనే పుస్తకము వ్రాసిన కాలముతో పెద్దగా వ్యక్తులను ఆకర్షించలేదు. కాని తరువాత ఆ గ్రంథము స్త్రీల తిరుగుబాటు వుద్యమముకు అధికార గ్రంథమైంది.

మహిళాభ్యుదయమునకు తోడ్పడిన మరియొక్క ఆయుధము-మతప్రచారము - అది బ్రహ్మాస్త్రమువలే పని చేసినది. మతప్రచార ఆశయముతో ఆదివారపు స్కూళ్ళు (Sunday Schools)ను ఏర్పాటు చేసిన (Miss Hannah More) కుమారి హెన్నా మోర్, (Miss Trimmer) శ్రీమతి ట్రిమ్మెర్ కలలో కూడా స్త్రీల విప్లవానికి పునాదులు వేస్తున్నామని అనుకోలేదు. మారుమూలలో గ్రామాలలోపిల్లలకు, స్త్రీలకు విద్య నేర్పించిన కారణంగా వీరంతా తరువాత స్త్రీల విప్లవానికి సహాయ కారులైనారు.

జేను ఆస్టిన్ (Jane Austin) మేరీ బెర్రీ (Mary Bary), ఫానీ బర్నీ (Fanny Burney) కారొలైను చెస్హోల్మం (Caroline Cheshilm), మారియా ఎడ్జవర్తు (Maria Edge Worth), (Elizabcth Fry) ఎలిజబత్ ఫ్రై, జేను మార్సట్ (Jane Marcet), హెరియట్ మార్టిమన్ (Harriet Martman), మేరి సోమరివిల్లీ (Mary Somervele) చాలా ప్రఖ్యాత స్త్రీలలో కొందరు. వీరు ఏ సంఘాన్నిగాని, సంస్థనుగాని, నడుపలేదు. జీవితములో స్త్రీలకు పురుషులతో సమానంగా హక్కులుండాలి.

నిగ్రహించి అది ధైర్యముగా అందరికిచెప్పి బహు సాహసముతో పురుషుల ఫీంకారము

లను ఎదురించి వారికి వ్యక్తిగతముగా చేత నైనంతవరకు స్త్రీలలో చైతన్యము కలిగించుటకు ప్రయత్నించి వారి ధనమును, జీవితమును త్యాగముచేసిన వీరవనితామ తల్లులు. వీరికి బిరుదులు లభించలేదు. అధికారాలు వుద్యోగాలు అనుగ్రహింపబడలేదు. కాని, వారి పేర్లు మహిళాభ్యుదయ చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖింపబడియున్నవి.

ఇంగ్లండులోని స్త్రీల తిరుగుబాటు వుద్యమము చరిత్ర వ్రాయాలంటే భారతమంత గ్రంథ మవుతుంది. కాని ఆ వుద్యమము కబుర్లు చెప్పుకునేటప్పుడు కొన్ని రసవత్తర ఘట్టాలు, మరుపురాని వీరవనితల దృశ్యాలు చెప్పుకోకుండా వుండలేము.

ఫ్లారెన్సు నైటింగేలు (Florence-nightingale) తన ప్రఖ్యాత స్వంత వుద్యమము (19 వ శతాబ్దములో) ఆరంభించిన కాలమునకు విక్టోరియారాణి సింహాసనము అధిష్టించిన మధ్యకాలంలో చాలా ముఖ్యమైన సంఘటనలు జరిగినవి. 1838 లో (Chartist Movement) చార్టిస్టు మూవుమెంటు ఆరంభమైంది. అప్పుడు స్త్రీలకు వోటింగ్‌హక్కులివ్వవలయునని ఒక ప్రఖ్యాత రాజకీయ నాయకుడు (Cabinet maker) శ్రీ విలియమ్ లోవట్ (William Lovet) ఒక బిల్లులో ప్రతిపాదించగా చాలామంది M. P. లు (పురుషులు) అది పురుషజాతికి అవమానకరమని తీసివేయించారు – స్త్రీలకు వోటింగుహక్కు యివ్వమని వ్రాసిన ఒకటి రెండుపత్రికలను అందరు బహిష్కరించారు. కొన్నాళ్ళకు అందరూ ఆ విషయము మరచి నద్దుమణిగి నిద్రపోయారు. 1831 లో పేరు లేకుండా West Minister Review అనే పత్రికలో ఒకస్త్రీ రచన దేశములో స్త్రీలను స్వాతంత్రియ సమరమునకు నడిపింది. కాని అప్పుడుకూడా కొంతమంది పార్లమెంటు మెంబర్లు ఆ వుద్యమాన్ని అణచివేశారు. 1836 లో (Anti-corn Law League) ఏంటి కార్న లా లీగు స్త్రీలకు రాజకీయాలతో, వర్తక సంస్థలతో, వ్యాపారరహస్యాలతో, ఆర్థిక సమస్యలతో పరిచయము చేసింది. ఆ పరిచయము వలన కలిగిన జ్ఞానము స్త్రీలలో అసహన జ్వాలను అంటించింది. అప్పుడు స్త్రీలలో గలిగిన నూతన చైతన్యము వారిని ఆవహించి వారిని పరిపరి విధాల నడిపించింది. కొంతమంది స్త్రీలు "హక్కులు, హక్కులు" అని చిందులు త్రొక్కారు. మరికొందరు వారి సౌందర్యాతిశయములు ప్రదర్శించుకొనుటకు పరిస్థితులను అనుకూలము చేసుకున్నారు; దుర్వినియోగము చేసిన స్త్రీలూ లేకపోలేదు, చరిత్రలో అన్ని దేశములలోను ఈ ఘట్టము అనివార్యమైన దని తెలుసుకునే ఈ దినము మన సంఘములోని చిత్ర విచిత్ర పరిణామాన్ని అర్థము చేసుకొనగలుగుతాము.

ఆ రోజుల్లో (Caroline Norton) కెరలైను నార్టన్ అనే ఆవిడ (Diana of the Crossways) దయానా ఆఫ్ ది క్రాసువేస్ అనే రచన ద్వారా యింగ్లండులో దుమారము లేపింది. తరువాత తన 19 వ ఏట Hon. Richard Norton ని వివాహము చేసుకొన్నది – విద్యావతి, గుణవతి, పైపెచ్చు సౌందర్యవతి. తన యింటిలో తరచూ విందు లే. లార్డు మెల్బర్నూ యితర విగ్ (Whig) మంత్రులూ తరచూ వస్తూపోతూ వుండేవారు. ముగ్గురు బిడ్డలకు తల్లి అయినతరువాత ఒకసారి భర్త ఆమెను కొట్టాడు. (ఇంగ్లండులోకూడా ఆ రోజుల్లో భార్యలను కొట్టేభర్తలుండేవారట). వెంటనే ఆమె గందరగోళము చేయగా దెబ్బలుతిన్న భార్యల సానుభూతితో ఒక దుమారాన్ని మళ్ళీ లేపింది. అది కొంచెము అణిగిందో లేదో మరియొకదానికై పోరాడింది. బిడ్డల మీద హక్కులు తల్లికిలేకుండా తండ్రులకు మాత్రమేవుండే దురాచారముమీద తీవ్రమైన ఆందోళన లేవదీసింది. తనబిడ్డలు తన భర్త కట్టుబడిలో వుండిపోయిన కష్టాన్ని సాహసముతో ఎదుర్కొని యితర తల్లులకు ఆకష్టము లేకుండా వుండేటట్లు ఆ దురాచారాన్ని నిర్మూలించింది. ప్రభుత్వాన్ని కన్వించి, కదిలించి స్త్రీలకు అనుకూలమయ్యేటట్లు బిల్లుకూడా చేయించింది.

Miss Murry మిస్ ముర్రె 1847 లో మొట్టమొదట స్త్రీలకళాశాల ఏర్పాటుచేశారు. లెక్కలు, గ్రీకు, కుట్టుపనులు వగైరాలు ఈ కళాశాలలో నేర్పేవారు – మగవారు 'ఆడజ్ఞానము' సంపాదిస్తున్నారని చదువుకునేవారిని చదువు చెప్పేవారిని ఎగతాళి చేసేవారు. తరువాత చాలా కళాశాలలు దేశమంతా ఏర్పడ్డవి.

మహిళోద్యమము బాగుగా సాగిపోతూ వుంటే ప్రఖ్యాత నాయకులు, అధికారములో వున్న పురుషులు, పత్రికలు నానాగొడవ చేశారు. స్త్రీలు సహజ కోమలత్వాన్ని పోగొట్టుకుంటున్నారని, గృహములో దాంపత్య సుఖాలకు తిలోదకాలు వదులుకున్నారని వాపోయారు. అయినా 1866 లో (J. S. Mill) శ్రీ మిల్ సహాయముతో స్త్రీల వోటింగుహక్కు పిటిషన్ పార్లమెంటులో ప్రవేశపెట్టబడ్డది. మొదటి రీడింగు అయినది. 4 మే 1870 లో డాక్టరు పాంక్హర్టు (Dr. Pankhurt) బిల్లు చాలా జాగ్రత్తగా వ్రాశాడు. శ్రీ జాకబు బ్రయిట్ (Jacob Bright) ఎంతో విజయవంతముగా ఆబిల్లును ప్రవేశపెట్టారు. అది యింకా కమిటీదశలో వుండగనే శ్రీ గ్లాడ్‌స్టన్ (Mr. Glodstone) చాలా కష్టపడి, పెద్ద గంభీరోపన్యాస మిచ్చి 'ఆ బిల్లుని 106

మెజారిటీతో ఓడించాడు. దానిలో స్త్రీలు వ్యతిరేకంగా ఎంత బలమున్నదో గ్రహించి ఎట్లాగైనా అదిఎదుర్కొనటానికి బ్రహ్మాండమైన ఏర్పాట్లుచేశారు. కాని తిరిగి 1885 లో పార్లమెంటులో ప్రవేశపెట్టిన బిల్లు మళ్ళీ ఓడిపోయింది. చిట్టచివరకు 1897 లోనే వారు స్త్రీలకు ఓటింగుహక్కు కలుగచేయగలిగారు. కావుననే బ్రిటీష్ స్త్రీలకు వారిఓటు బహువిలువైనది. పవిత్రమైనది.

1870 లో (Josephine Butler) జోసఫైను బట్లరు వ్యభిచార నిర్మూలనకు విచిత్రంగా ఎన్నో సంవత్సరములు పాటుబడి, పార్లమెంటును ముట్టడించింది. 1 జనవరి 1870 రోజున కొన్నివందలమంది స్త్రీలు పార్లమెంటు భవనాన్ని ముట్టడించి అప్పుడున్న వ్యభిచార చట్టములోని కొన్ని క్లాజులు వుంచటానికి వీలులేదని అభ్యంతరపెట్టారు. భార్యలను తమ వ్యభిచార "రక్షకుల"గా వుపయోగించుకుంటున్నారని గోలచేశారు. తరువాత పార్లమెంటు వ్యభిచార గృహాలకు లైసెన్సు, సుఖరోగాల చట్టములను ఏర్పాటు చేయించారు.

ఇంతలో స్త్రీలు 1870 నుండి 1900 వరకూ మున్సిపాలిటీలలో ప్రవేశించటము ఆరంభించారు. కళాశాలలనుండి డాక్టర్లు గ్రాడ్యుయేట్లు తయారయి సాంఘిక జీవనములో నూతన చైతన్యము కలిగించటము ఆరంభించారు 1884, 86 లో స్త్రీలకు సంబంధించిన బిల్లులు ప్రభుత్వము అంగీకరించేటట్లు చేశారు. 1891 లో నిజంగా ఆంగ్ల వివాహ స్త్రీకి సంపూర్ణ స్వాతంత్రియము లభించింది. భార్యమీద భర్తకున్న సర్వహక్కులు పటాపంచలైనవి. స్త్రీలకు సమాన జీతములు, (Trade Union) లో స్త్రీల హక్కులు ప్రభుత్వము గుర్తించటము మొదలుపెట్టింది. లేబరు విషయములో స్త్రీల హక్కులు కాపాడటానికి శ్రీమతి పాటర్సన్ (Mrs. Patterson) శ్రీమతి మాక్డనాల్డ్ (Mrs. Mac Donald) తమ జీవితాలను ధారపోసి ఎంతో కష్టపడ్డారు.

స్త్రీల వోటింగు హక్కులకై బహుప్రయాసపడ్డ శ్రీమతి క్రిస్టబెల్ ప్యాంక్హర్టు (Mrs. Christabel Pankhurt), శ్రీమతి ఏన్నీ కెన్నీ (Mrs. Annie Kenny) లను ప్రభుత్వము శిక్షించి జైలులో వేసింది. దానితో స్త్రీల వుద్యమము ప్రచండమై మీటింగులను చదరగొట్టి, పెద్దపెద్ద స్త్రీల వూరేగింపులుచేసి సబలులైన అబలలుప్రభుత్వము, ప్రజలు తమ మొర ఆలకించేటట్లుచేశారు, బ్యాండు మేళముతో వేలకువేల స్త్రీలు గుఱ్ఱాలు ఎక్కి, నడచి, గ్రామగ్రామాలు, వీధివీధులు తిరిగి స్త్రీలలో రాజకీయ విజ్ఞానాలుకూడా కలిగించారు. వీరిని అరెస్టుచేయటానికిగాని, బంధించటానికిగాని ప్రయత్నముచేస్తే ఈ స్త్రీలు ఒక్కొక్కరు ఒక కాళికాదేవివలే విజృంభించి పోలీసులను, ప్రభుత్వోద్యోగులను రాళ్ళతో, కర్రలతో చెల్లాచెదురుచేశారు. ఆస్తులను, యిళ్ళను నిర్మూలించటము ఆరంభించారు. నిరాహారదీక్ష పట్టారు. (Loyld George), లాయడు జార్జి, శ్రీ చర్చిలు (Mr. Wineston Churchill) కూడా Concilation Bill) ను 1910 లో ఎదిరించారు. కాని 1911 లో 167 మెజారిటీతో బిల్లు గెలిచింది. తరువాత మూడు సంవత్సరాలలో స్త్రీలు యింకా విజృంభించారు. ఎన్నో బిల్లులు తమకు అనుకూలముగా చేయించుకున్నారు. (Militant) సైకులవలె తయారైనారు. యింతలో ప్రపంచయుద్ధము వచ్చింది. స్వదేశము కొరకు దేశరక్షణకై ప్రాణములు సమర్పించ బోవుచున్న భర్తలు, పుత్రులకొరకు ఈ స్త్రీవుద్యమము బృహత్తర సేవ చేసింది. మొదటి ప్రపంచ యుద్ధానంతరము బ్రిటనులో లేబరుపార్టీ ప్రభుత్వ కాలములో స్త్రీలకు విడాకులు, పిల్లల గార్డియనుషిప్పు, వితంతు పెన్షన్లు లభించినవి.

ఇంగ్లండులోని మహిళోద్యమాలు 1920 వచ్చేటప్పటికి తమ ఆశయాలన్నీ సాదించాయి. పార్లమెంటులో ఆడవాళ్ళు ప్రవేశించారు — పురుషులతోపాటు అన్ని విద్యలు అభ్యసించారు. అన్ని వుద్యోగాలులో సరిసమానముగా పనిచేయటము మొదలు బెట్టారు. సైకిళ్ళు, కార్లు, విమానాలు నడపటము మొదలుబెట్టారు—అదీయిదీ అని చెప్పనేల బ్రిటిష్ స్త్రీకి నిజమైన స్వాతంత్రియము యింటిలోనూ యింటిబైటా లభించింది. ★

---

(97 వ పేజీ తరువాయి)

బడిన భాష విషయంలో కొంత జాగ్రత్త వహించి ఉంటే బాగుండేది. మన ఆచారాలకు సంప్రదాయాలకు నవలా రూపంలో వైజ్ఞానికంగా ఒక చక్కని రూపమివ్వదలచి యింత మంచి గ్రంథాన్ని వ్రాసిన శ్రీ వరదాచార్యులు గారు భాషావిషయమైన యెబ్బెట్టును మలిముద్రణలోనైనా తొలగించుతారని ఆశిస్తున్నాను. మన ఆచారాల పుట్టుపూర్వోత్తరాల గురించిన చారిత్రకమైన పరిశీలన యిందులో లేదు. అయితే వాటివల్ల కలిగే లాభాలు ఆహార విహార వ్యవహారాలు—వస్తు గుణతత్వం—నీతులు—నియమాలు – దైవభక్తి – వైద్యం – పరిశుభ్రత – సఖ్యత—పుణ్య పాప పరిశీలనం – దానం – ధర్మం – దయ – మొదలైన పెక్కు విషయాలమీద సముచితాలనదగిన సమన్వయాలతో విజ్ఞానిక భావాలకు నిలయంగా సంప్రదాయ వైజ్ఞానికజ్యోతిగా వెలసిన ఈ "మాతృజ్యోతి" అందరూ చదువతగ్గది.

— వ. గో. కృ.

# ఉత్తమ విద్యార్థి

ఆదిరాజు

రామయ్య ఒక పల్లెటూరి రైతు. కూలీనాలీ చేసుకొని తన కుటుంబాన్ని పోషించు కొంటూ కాలం గడుపుతున్నాడు. అతనిది చాలా చిన్నకుటుంబం. కొడుకు కోటయ్య ఒక ఆసామీదగ్గర నౌకరీ చేస్తున్నాడు. కూతురుకు తనబావమరిదితోనే మూడుముళ్లూ వేయించి, అతనిని ఒక భూస్వామివద్ద పాలేరుగా చేర్పించాడు. హైదరాబాదుకు వారి గ్రామం దగ్గరగానే ఉన్నా, రామయ్య ఎప్పుడూ బస్తీకి పోవలసినపని పడలేదు. ఇలా గడుస్తూఉండగా ఒక రోజు తనదగ్గర బంధువు కెవరికో పెద్దజబ్బుచేసి పట్టణంలోని పెద్ద ఆస్పత్రికి తీసుకరావటాన అతనివెంట రామయ్యకూడ రావలసి వచ్చింది. హైదరాబాదులో పెద్దపెద్ద ఆస్పత్రులు ఉంటవనీ, అనుభవం సమర్థతగల వైద్యులు అనేకమంది అక్కడ పనిచేస్తూ ఉంటారనీ, వారి జీతం మందులఖర్చు ప్రభుత్వమే భరించటంవలన ప్రజలకు ఉచితంగానే వైద్యం దొరుకుతుం దనీ రామయ్య తన జీవితంలో మొదటి పర్యాయం అప్పుడే తెలుసుకున్నాడు.

హైదరాబాదు మహానగరంలో ఎటువెళ్ళా లన్నా ప్రతిపనికీ రామయ్యకు ఎదటివారి సహాయం కోరటం తప్పలేదు. ప్రతిచోటా బోర్డువ్రాసి ఉంటాన చదువుకున్న వారిపని కొంత మెరుగ్గానే ఉన్నట్టు అతను గ్రహించాడు. తనకు చదువురాకపోవటం వల్లనే ఇన్ని ఇబ్బందులు పడుతున్నట్టు భావించాడు. జీతంచేస్తున్న తన కుమారుని భవిష్యత్తుని గురించి ఆలోచించేసరికి అతని మనసులో ఆందోళన రేకెత్తింది. బడికివెళ్తున్న అనేకమంది చిన్నచిన్న పిల్లలను బస్సులలో, అక్కడా - ఇక్కడా చూచి తనకు చదువు రాకున్నా తన కుమారునికైనా, కొద్దోగొప్పో చదువు చెప్పిస్తే మంచిదనే నిర్ణయానికి వచ్చాడు. అతనికి ఆలోచన రావటమే తడవుగా ఎదురుగా ఉన్న దుకాణానికి వెళ్ళి, కొడుకు కోటయ్యకు ఒక పలకా బలపంకొని ఆ మాత్రానికే ఎంతో ఆనందించాడు. తిరిగి ఇంటికి పోగానే కుమారుడిని జీతంమాన్పించి బడికి తీసుక వెళ్ళాడు. జీతం చెల్లించ నవసరం లేదని పంతులు చెప్పినమాటలు అతని కెంతో ఆనందాన్ని కలిగించాయి. హరిజన విద్యార్థులకు పుస్తకాలకుకూడా ప్రభుత్వమే కొంతడబ్బు ఇస్తుందనీ, ఇతర ఖర్చులకని కూడ ప్రతి హరిజనవిద్యార్థికి ప్రభుత్వం ప్రతిసంవత్సరం మరికొంత డబ్బు ఇస్తాం దని ఉపాధ్యాయుడు తెలుపటంతో రామయ్య ఆనందానికి హద్దులేకపోయింది. తన పిల్లవాడు చదువుకోవాలనే పట్టుదల అతనిలో మరీ గట్టిపడింది. ప్రతి సంవత్సరం పరీక్ష తప్పకుండా కోటయ్య శ్రద్ధగా చదువుతున్నాడు.

కోటయ్య బడిలో ప్రవేశించి అప్పటికి ఐదు ఉగాదిపండుగలు గడిచాయి. రేపటి నుండి బడికి సెలవులు ఇస్తున్నారనగా కోటయ్య అందరికన్నా ఎక్కువమార్కులతో పరీక్ష పాసయినాడనీ, అతను ఆఊళ్లో చదువంతా పూర్తిచేశాడని రామయ్యకు తెల్పింది. మర్నాడు ఉదయం లేవగానే నాలుగు మామిడికాయలు చేతపుచ్చుకొని రామయ్యపంతులుగారి దర్శనానికి వెళ్ళి, జీతం తీసుకొనకుండానే యిన్నాళ్ళూ తనపిల్లవానికి చదువు నేర్పినందుకు పంతులుగారికి దండం పెట్టాడు. చదువు చెప్పటంలో తన ఔదార్య మేమీ లేదనీ, కేవలం ఆ పని చేయటానికే ప్రభుత్వం తనకు ప్రతినెల వేతనం ఇస్తూన్న దనీ, ఆలాంటి ప్రాథమిక పాఠశాలసంఖ్య దేశానికి స్వాతంత్ర్యం లభించినతరువాత తొలి 12 సంవత్సరాలలో మన ఆంధ్ర ప్రదేశ్‌లోనే 35 వేలకు పెరిగిందనీ; ఈ పాఠశాలలో 18 లక్షలమంది బాలురు, 11 లక్షలమంది బాలికలు చదువుకుంటున్నా రనీ; 7 సంవత్సరాలనుండి 11 సంవత్సరాల వయస్సుగల పిల్లలందరికీ నిర్బంధంగా విద్య నేర్పాలని ప్రభుత్వం సంకల్పించిన దని ఉపాధ్యాయుడు తెలియజేశాడు. ఈ వివరాలు రామయ్యకు చాలా ఆశ్చర్యాన్ని కల్గించాయి.

కోటయ్య చాలాతెలివికలవాడవటంవలన, బస్తీకి పంపి పైచదువు చదివిస్తే, ఐదు సంవత్సరాలలో ఏ ఆస్థిపాస్థి లేకుండానే కుటుంబాన్నంతా అతనే ఈదగలడనికూడ పంతులుగారు రామయ్యకు నచ్చచెప్పారు.

బస్తీలో చదివించడం తలకు మించిన భారమని రామయ్య సందేహాన్ని వెలిబుచ్చగా అక్కడ హరిజన విద్యార్థులకు ఉచితంగా భోజనం వసతి సౌకర్యాన్ని కల్పించడానికి ప్రభుత్వం హాస్టల్సును నిర్వహిస్తున్నదనీ, రాష్ట్రం మొత్తంమీద ప్రాథమికవిద్య పూర్తిచేసి మెట్రిక్‌లోపల పై విద్యను అభ్యసించే విద్యార్థులసంఖ్య 7 లక్షల 66 వేలకుపైగా ఉన్నదనీ, వీరందరికీ 2,200 పాఠశాలలలో 35 వేల 5 వందలమంది అధ్యాపకులు విద్యాబోధన చేస్తున్నారని ఎన్నో వివరాలు చెప్పి పంతులుగారు రామయ్యను ఆశ్చర్యపరచి అతనిని చివరకు ఒప్పించారు.

శలవులు కాగానే ఒక శుభముహూర్తాన బస్తీబడిలో ప్రవేశించిన కోటయ్యకు హాస్టలులో కూడ సునాయాసంగా సీటు లభిం

చింది. తన కుమారుని విద్యాభ్యాసాన్ని తెలుసుకొని రామయ్య ఎంతో సంతృప్తిగా కాలం గడుపుతున్నాడు.

శ్రద్ధగా చదివే బుద్ధిమంతుడనీ, అంతే కాక ఆటపాటలలోకూడ అతనికి ఎంతో ప్రతిభ ఉన్నదని కొద్దిరోజులలోనే కోటయ్యను పలువురు ఉపాధ్యాయులు ప్రశంసించారు. ఉదయమే లేచి పనులన్నీ ముగించుకొని భోజనంచేసి సకాలంలో బస్ ఆగే చోటికి వెళ్ళి, అక్కడనుండి సరాసరి వెళ్ళే బస్‌లో అతను సమయానికి బడికి అందుకునేవాడు.

'స్వాతంత్ర్యం రిపబ్లిక్ దినోత్సవ పోటీలలోనేకాక ఆ సంవత్సరం పాఠశాల వార్షికోత్సవ సందర్భంలోకూడ అనేక బహుమతులు కోటయ్యే గెలుచుకున్నాడు. పరీక్షలు సమీపిస్తున్నాయ్. కోటయ్య అందరికన్నా ఎక్కువమార్కులు సంపాదిస్తాడని అంతా అనుకుంటున్నారు. ఎదురుచూస్తున్న ఏప్రిల్ నెల రానేవచ్చింది. పరీక్షలుప్రారంభం రేపటినుంచే.

సంవత్సరం మొదటినుంచీ అతను ఏరోజు పాఠాలు ఆనాడు వల్లెవేయటం వలన పరీక్ష అంటే భయం, ఆందోళన లేకుండా ఎప్పటివలెనే మామూలుగా ఉన్నాడు.

రాత్రి పెందలకడనే పుస్తకాలు మొదటినుంచి చివరవరకు ఒక పరియాయం చూచి పరీక్ష చక్కగా రాయగలననే ధీమాతో ప్రశాంతంగా పడుకున్నాడు. కోటయ్య తరగతిలో చదవటమేకాక అతని గదిలోనే ఉంటున్న రంగయ్య, సంవత్సరం ఆరంభమైనప్పటినుండికూడా ఎప్పుడూ పుస్తకంపట్టటమనే పాపం చేసేవాడుకాదు. ఒక్కొక్కపరియాయం బడికూడా మాని, స్కాలర్‌షిప్‌గా వచ్చినడబ్బు తలితండ్రులకు పంపక, తనూ సక్రమంగా ఖర్చుపెట్టక సినిమాలకు డ్రామాలకూ తిరుగుతూ కాలక్షేపం చేసేవాడు. అప్పుడప్పుడూ అతను తన రూమ్‌కుకూడా రాక ఎక్కడో ఎవరింట్లోనో పడుకునేవాడు. అందువలన పరీక్షలు పదిరోజులు ఉన్నవనగా రాత్రింబవళ్ళు చదివినా, పరీక్షమాట గుర్తుకువస్తేనే ఆందోళన పడేవాడు. పరీక్ష రేపున్నదనగా అతను ఆరాత్రి అంతా చదివాడు. నిద్రరాకుండా ఉండేందుకు సాయిబు హోటల్‌కు అరడజను పరియాయాలు వెళ్ళాడు. తెల్లవారేముందు నిద్రపోయాడు. ఉదయమే మరొకమారు పుస్తకాలన్నీ తిరగేసిన కోటయ్య నిశ్చింతగా తన పనులన్నీ ముగించుకొని పరీక్షకు తయారైనాడు. గంటసేపు మేలుకొలుపు పాడితే మెల్లగా లేచిన రంగయ్య ముస్తాబయ్యేసరికి ఇద్దరికీ ఆలస్యం ఐంది. సరాసరి తీసుకవెళ్ళే స్కూలుముందు దింపేబస్ అందదని అనుమానించి, ఆలస్యం అవుతున్నదని భయపడి సకాలంలో బడికి చేరాలనే ఆదుర్దాతో ఒక సైకిల్ కిరాయికి తీసుకుని ఇద్దరూ బయల్దేరారు. సైకిళ్ల రిక్షాలుకాక హైదరాబాదులో 20 వేలకుపైగా వాహనాలు సంచారం చేస్తుంటవి. వీటికి జతగా సైకిళ్ళు, రిక్షాలు. ఏ అవరోధం ప్రమాదం జరుగకుండా ఇవన్నీ క్రమంగా పయనించేందుకు వీలుగా ప్రతివారు రోడ్డుకు ఎడంప్రక్కగానే వెళ్ళాలనే నియమం ఆచరించబడుతుంది. ఈ విషయం అందరికీ తెలుసు. ఐనా, నియమాన్ని ఉల్లంఘించే వారిని శిక్షించేందుకు వేయికళ్ళతో కనిపెడుతూ కొన్నివేలమంది ట్రాపిక్ పోలీసులు, కొందరు అధికారులు నిరంతరం ప్రజలకు సహకరిస్తూ ప్రతిచోట తిష్ఠవేసుకొని కనిపిస్తారు. ప్రమాదాల నివారణకుగాను కొన్ని ఇరుకుమార్గాలలో ఒక వైపు మాత్రమే వెళ్ళవలసి యుంటుంది. (దీనినే వన్‌వేట్రాపిక్ అంటారు).

కోటయ్య, రంగయ్య ఆలస్యం అయినదనే ఆదుర్దాతో తమ తొందరలో ఈ నియమాన్ని నిర్లక్ష్యంచేసి దగ్గర అవుతుందనే

(మిగతా 94 వ పేజీలో)

## భావిపౌరులం

డి. చిన్నికృష్ణ

బడికి పోవు పిల్లలం - బాగ చదువుకుంటాం
బడిపంతులు మాపాలిటి దేవు డనుకుంటాం ॥బడి॥
తెల్లవారకుండానే నిదుర మేలుకొంటాం
చల్లనీట స్నానమాడి తలను దువ్వుకుంటాం ॥బడి॥
అల్లరిచేసే పిల్లలదరికి చేరబోవం
కల్లమాటలాడువారి చెంత జేరనీయం ॥బడి॥
గుడిలోను ఒకగంట బడిలో ఒకగంట
కడుపుమంట వేసెనంటె కొట్టెను ఒకగంట ॥బడి॥
ఈనాటిపిల్లలము రేపటి పౌరులము
నానాటికి వృద్ధిచెంది ఔదుము వీరులము ॥బడి॥
మాలోనూ వున్నారు వీరశివాజీలు
మాలోనూ వున్నారు చాచా నెహ్రూలు ॥బడి॥
శరీరాలు చిన్నవని చులకన చేసేరుగాని
శాసించే పెద్దలంత మొదట పసివారేగా ॥బడి॥
చావంటే భయంలేదు కష్టమంటే వెనుకాడం
శత్రువులను ఓడించే చేవమాకు బోలెడుంది ॥బడి॥
గిల్లికజ్జా లాడువారి మాలో వెలివేస్తాం
స్కూలు డుమ్మా కొట్టేవారి దోస్తీకటిఫ్ అంటాం ॥బడి॥

# ఇద్దరు విదూషకులు

సి. హెచ్. ఆచార్య

ఆంధ్రప్రదేశ్ మే నెల సంచిక ముఖచిత్రంగా ఉన్న యిద్దరు విదూషకులను చూడగానే చారిత్రకమైన చక్కని పాత కథ ఒకటి గుర్తుకువచ్చింది ఉత్తరదేశంలో కొంతకాలం క్రిందట బస్తర్ ప్రాంతానికి దగ్గరగా చిన్నరాజ్యం ఉండేది. దాన్ని "తేజ్‌రాజ్" అని ఒక రాజు పరిపాలిస్తూ



ఉండేవాడు. ఆయనకు స్వార్థమంటూ యేదీ లేదు. ఉన్న సంతానానికి కూడా దారితెన్నూ యేర్పరచకుండా ప్రజాక్షేమం కోసం శర్వస్వం త్యాగంచేసి ధారపోశాడు. కుయుక్తిపరుడు, అవినీతిపరుడు అయిన "జీవరాజ్" అనే పేరుగలవ్యక్తి నక్కవినయాలతో ఆయన్ని ఆశ్రయించి ఉండేవాడు. ఆయన మంచితనాన్ని ఆసరాగా తీసుకుని పరిస్థితులన్నీ అవగాహన చేసుకొని టక్కరితనంతో



నలుగుర్నీ అవుననిపించి 'తేజ్‌రాజ్' తర్వాత 'జీవరాజ్' రాజ్యానికి వచ్చాడు. సింహాసనం అధిరోహించాడు. టక్కరి, కుయుక్తిపరుడు అయిన "జీవరాజ్" అంటే అందరికీ భయమే. పిల్లిమీద ఎలకను ఎలకమీద పిల్లినిపెట్టి యెవరికేం ముప్పుతెస్తాడో అని అందరూ బిక్కు బిక్కుమంటూనే యెదురుగా చిత్తమంటూ చాటుగా శాపనార్థాలు పెడుతూ ఉండేవారు. ఆటకొటకీ "జీవరాజ్"కు అహంకారం, స్వార్థం పెరిగి కళ్ళునెత్తికి వచ్చాయి. పక్షపాతంగా ప్రజల్ని నానాయాతనలూ పెట్టాడు. దానితో "జీవరాజ్" మీద ప్రజల్లో, పెద్దల్లో అసంతృప్తి పెరిగింది. వారు తిరుగుబాటు చేదామని ఆలోచించి సమయంకోసం వేచి ఉన్నారు — ఈ విషయం మెల్లిగా చారులద్వారా తెలుసుకుని తన పరిస్థితి తారుమారయ్యేట్లున్నదని గ్రహించాడు. జీవరాజ్ తనపరువూ, రాజ్యమూ నిలుపుకోడానికి మరో యెత్తు వేశాడు. తాను చెప్పినట్లల్లా విని తన కనుసన్నల్లో ఉండి కూర్చోమంటే కూర్చుని నిల్చోమంటే నిల్చునే "నందరాజ్" అనేవాణ్ణి పట్టాభిషిక్తుణ్ణిచేసి తతంగం నడుపుదామనుకున్నాడు. అనుకున్నప్లాను ప్రకారం పెద్దలందర్నీ పిలిచి నాకు పరిపాలన పట్ల విసుగెత్తింది. దక్షుడూ, అనుభవవంతుడూ, పెద్దవాడూ అయిన "నందరాజ్"ను పట్టాభిషిక్తుణ్ణి చేయదల్చా నన్నాడు. లోలోపల కొందరు "మళ్ళీ పీడేమిటి ?" అనుకున్నా "అసలుపీడ విరగడయ్యిందేచాలు, తర్వాత సంగతి తర్వాత చూడాలి" అనుకుని సరే నన్నారు. రెండురోజులు కానిచ్చి "నందరాజ్" పూర్తిగా రాజైపోతే తనపరువేం నిల్చినట్లు ? ప్రజలుగాని చివరికి ఈ "నందరాజ్" గాని తన మొహం చూస్తారా : చిప్పట్టుకుని అడుక్కుంటూ పోవలసిందే. అని ఆలోచించి మరోప్లాను వేశాడు 'జీవరాజ్,' 'నందరాజ్'ని పిల్చి బుజ్జగించి నవ్వచెప్పి అసలురాజు 'జీవరాజే' ననీ తనకు పట్టం కట్టినంతమాత్రాన ఆయన బాధ్యత తీరిపోయినట్లు భావించరాదనీ తన పరిపాలనా బాధ్యతలో ఆయనకూడా పాలు పంచుకోవాలనీ ఆయన సలహా, సహకారాలు తప్పక కావాలనీ అతనిచేత చెప్పించాడు. యిష్టంలేకపోయినా పెద్దలెవరూ యేమీ అనలేకపోయారు. ఇది అవకాశంగా తీసుకుని పూర్తి సింహాసనం "నందరాజ్"కి దక్కరాదనీ తనకు దక్కినంత సమానస్థాయి అతనికి లభించరాదనీ 'జీవరాజ్' ఆలోచించాడు.





సింహాసనం వెనుక అనుకునే భాగాన్ని, చేతులనూ తొలగించి కూర్చునే ఆసనభాగాన్ని వేరుచేయించాడు. పట్టాభిషేకానికి చిహ్నంగా ఆ సింహాసనం వెనుక భాగాన్ని, చేతులు పెట్టుకునే భాగాన్ని, 'నందరాజ్' వశంచేసి తివాసీమీద వేసుకుని దాంట్లోకూర్చునిపరిపాలనసాగించమన్నాడు. తన పెద్దరికాన్ని నిలుపుకుని అసలు కూర్చునే సింహాసనం క్రిందిభాగాన్ని తనే ఉపయోగించుకునేవాడు. పూర్తిసింహాసనంలో ఉన్న నాకీగతి పట్టిందేమిరా దేవుడా అని జీవరాజ్ లోపల్లోపల ఏడ్చేవాడు. దక్కిందేదో దక్కింది సంపూర్ణంగా దక్కలేదుగదా అని విచారపడేవాడు నందరాజ్. మొత్తంమీద దేశం యిద్దరు భర్తల భార్యలా అయినా నందరాజ్ జీవరాజులిద్దరూ పరిపాలన అక్రమంగానే సాగించారు. తుదకు వాళ్ళిద్దరూ సుందోపసుందులలాగా యెవరికివారే రాజ్యమును పూర్ణంగా వశం చేసుకోవాలనే ప్రయత్నంతో ఒకరికొకరు రహస్యశత్రువులై తడిగుడ్డతో ఒకరిగొంతు ఒకరు కోసుకుని యిద్దరూ హతులయ్యారు. వారిద్దరి త్యాగభోగాలను గురించి రకరకాల కథల రూపంగా ''యిద్దరు విదూషకులు'' అని పేరుపెట్టి ప్రజలు ఇప్పటికీ చెప్పుకుంటూ నవ్వుకుంటారు.

---

(92 వ పేజీ తరువాయి)

అభిప్రాయంతో పోకూడని మార్గాన పోవడానికి సాహసించారు. కొంతదూరమైనా వెళ్ళకముందే అక్కడ కాపలాఉన్న పోలీసువారిద్దరినీ పట్టుకొని సైకిల్ పోలీస్ స్టేషనులో పెట్టించి, మర్నాడు కోర్టులో జరిమానా చెల్లించి విడిపించుక వెళ్ళాలని ఆదేశించి మరొకపరియాయం అలాంటి తప్పు చేయవద్దని హెచ్చరించి వదిలిపెట్టాడు. పరీక్ష మొదలయిన తరువాత ఒక పిరియడు పూర్తి అయ్యేవరకు పరీక్షహాలులో ప్రవేశానికి విద్యార్థులకు అవకాశం ఉంటుంది. గడియారం చూస్తే మరొక ఐదునిమిషాలు మిగిలింది.

సమీప బస్‌స్టాప్‌కుచేరి ఆదుర్దాగా ఎదురు చూస్తుంటే అప్పుడే బస్‌వచ్చింది. జనం క్రిక్కిరిసి ఉన్నారు. ఒక ప్రయాణీకుడు మాత్రమే అక్కడ దిగాడు. ఒక్కమనిషి మాత్రమే లోపలికి రావచ్చునని కండక్టర్ మొత్తకు అడ్డంగా నిల్చొన్నాడు. రామయ్య అలవాటు ప్రకారం ముందే జాగ్రత్తబడ్డాడు. గంటమ్రోగింది. బస్‌కదిలింది. పరీక్షకు పోతున్నామని గద్గదకంఠంతో కండక్టర్‌ను ప్రాధేయపడుతూనే ''ఎక్కు - ఎక్కు''మని కోటయ్యను రంగయ్య ఆదేశించాడు. బస్ స్పీడ్ హెచ్చింది. కోటయ్యకేమి పాలుపోలేదు. నిస్సహాయస్థితికి తల తిరిగింది. ఏడుపువచ్చింది. ఏమి చేయాలో తోచక అనుకోకుండానే వెళ్ళే బస్‌ను ఎక్కడానికి సాహసించి జారి క్రిందపడ్డాడు. తలసిమెంటు రోడ్డుకు గుద్దుకోవడంతో బలమైనగాయాలు తగిలి అస్పత్రిలో చేర్చబడ్డాడు. పైగా, నడుస్తున్న బస్ ఎక్కటానికి ప్రయత్నించినందుకు అతనిపైననే నేరం ఆరోపించపడింది. ఎప్పుడూ ఏమీ చదవని శుద్ధమొద్దు రంగయ్యతోపాటు కోటయ్యకూడ పరీక్ష ఫేలయ్యాడు.

బడికి సమయానికి బయల్దేరక తను ఆదుర్దాలో చట్టాన్ని ఉల్లంఘించి తప్పుమార్గాన సైకిల్ నడిపినందుకు ఆస్పత్రినుండి విడుదలవగానే కోర్టుకువెళ్ళిన కోటయ్య అపరాధిగా జరిమానా చెల్లించాడు. నలుగురు స్నేహితులమధ్యనామర్దాపొంది అకారణంగా ఇంత శిక్ష అనుభవించవలసివచ్చినా అంతకు పూర్వం పరీక్షలన్నింటిలోను మంచిమార్కులు వచ్చినందున, హెడ్మాస్టర్‌గారు కనికరించి కోటయ్యకు తిరిగి పరీక్షపెట్టి ప్రమోట్‌చేసినందుకు సంతోషించాడు. అతను ఇకముందు చాలా జాగ్రత్తగా ఉండాలనుకున్నాడు. ఎంత తెలివికలవాడైనా, ఫస్టుక్లాసులో పాసవవలసినవాడే ఐనప్పటికీ, సాధారణ నియమాలు పాటించక పొరపాటు చేసినందుకు కోటయ్యకు చాలా నష్టం జరిగింది. ఫస్టు రాకుండా కేవలం ప్రమోట్ ఐనందుకు పైతరగతిలో అతనికి దొరకవలసిన స్కాలర్‌షిప్‌కూడా దొరకలేదు. ఐతే ఈ సంఘటనను దృష్టిలో ఉంచుకొని ఆ పాఠశాల విద్యార్థులంతా ఇప్పుడెంతో జాగ్రత్తగా ఉంటున్నారు. ఉత్తమవిద్యార్థి జీవితంలో నియమబద్ధంగా ఉండాలని వారు పూర్తిగా విశ్వసించారు. ★

# ముఖ్యవార్తలు

## భారతదేశంలో

మార్చి 26 : భారతదేశంలో ఆరు రోజుల పర్యటనకై ఇరాక్ అధ్యక్షుడు ఫీల్డ్ మార్షల్ అబ్దుల్ సలాం మహమ్మద్ ఆరిఫ్ కొత్తఢిల్లీ చేరుకున్నారు.

మార్చి 27 : 1964–65 సం. కు దిగుమతి విధానాన్ని భారతప్రభుత్వం ప్రకటించింది.

ఏప్రెలు 2 : కొత్తఢిల్లీలో అఖిల భారత ద్వితీయ క్రీడా కాంగ్రెసుకు కేంద్రవిద్యామంత్రి ప్రారంభోత్సవం చేశారు.

1964–65 సం.కు న్యూస్‌ప్రింట్ దిగుమతి విధానం లోకసభలో ప్రవేశ పెట్టబడింది.

ఏప్రిల్ 3 : ఎనిమిదిమంది సభ్యులుగల ఫ్రెంచిసెనేటు ప్రతినిధి బృందం కొత్త ఢిల్లీ చేరుకుంది. 10 రోజుల పర్యటన నిమిత్తం పదిమంది సభ్యులుగల కీన్యా జాతీయ సమాఖ్య ప్రతినిధి బృందం కొత్తఢిల్లీ చేరుకుంది.

ఏప్రిలు 7 : భారత, పాకిస్థాను దేశాల హోం మంత్రుల సమావేశం కొత్త ఢిల్లీలో ప్రారంభమయ్యింది.

ఏప్రిలు 8 : జమ్మూలో షేక్ మహమ్మద్ అబ్దుల్లా జైలునుండి విడుదల చేయబడ్డారు.

ఏప్రిలు 11: కువాయత్ విదేశాంగ మంత్రి షేక్ సభా అల్ అహమద్ అల్–జబీర్ మూడురోజుల పర్యటన నిమిత్తం కొత్త ఢిల్లీ చేరుకున్నారు.

ఏప్రిలు 14: పునరావాస మంత్రిగా శ్రీమహావీర్ త్యాగి నియమింప బడ్డారు.

ఏప్రిలు 15: ఐక్యరాజ్యసమితి రాజకీయ వ్యవహారాల ఉపకార్యదర్శి రాల్ఫ్‌బంచ్ కొత్తఢిల్లీ చేరుకున్నారు.

ఏప్రిలు 16: సుప్రీంకోర్టు జడ్జి శ్రీ కె. సి. దాస్ గుప్తా ఆరుగురు సభ్యులుగల మోనాపలీ కమీషన్‌కు నాయకత్వం వహిస్తారని ప్రకటించ బడింది.

ఏప్రిలు 18: 1963 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంతం) షెడ్యూలు జాతుల ఋణ విముక్తి (సవరణ) చట్టానికి రాష్ట్రపతి ఆమోదం లభించింది.

## రాష్ట్రంలో

మార్చి 21: కేంద్ర వ్యవసాయ మంత్రి హైదరాబాదులో లాలపేటకు దగ్గర్లో సమీకృత పాలప్రాజెక్టుకు సంబంధించిన పాడిభవనానికి శంకుస్థాపన చేశారు.

మార్చి 23 : కరీంనగర్‌లో కోర్టు భవనాలకు ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి శంకుస్థాపన చేశారు.

మార్చి 28 : ఆంధ్రప్రదేశ్ విధానసభ నిరవధికంగా వాయిదా పడింది.

మార్చి 29 : ఇరాక్ అధ్యక్షుడు ఫీల్డ్‌మార్షల్ అబ్దుల్ సలాం మహమ్మద్ ఆరిఫ్ హైదరాబాదు చేరుకున్నారు. సనత్‌నగర్‌లోని 150 పడకలుగల కార్మికుల ప్రభుత్వ భీమావైద్యశాలకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

ఏప్రిల్ 4 : హైద్రాబాదులో కేంద్రవిద్యామంత్రి భారతదేశంలో అమెరికన్ స్టడీస్ పరిశోధనల కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

విజయవాడ పురపాలక సంఘం వజ్రోత్సవాలకు శ్రీ కె. కామరాజు ప్రారంభోత్సవం చేశారు.

ఏప్రిల్ 8 : అమలాపురంలో కోనసీమ బెస్తల మాస్టర్ ప్లానును ముఖ్యమంత్రి ప్రారంభించారు.

ఏప్రిల్ 12 : హైదరాబాదులో ద్రాక్షపండ్ల పెంపకం సదస్సుకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

హైదరాబాదులోని హైకోర్టు ఆవరణలో బార్‌కౌన్సిలు భవనానికి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

ఏప్రిలు 13 : హైదరాబాదులో పదిరోజుల పాటు జరిగిన ఎన్. సి. సి. సీనియర్ అధికారుల పునశ్చరణకోర్సుకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

ఏప్రిలు 16 : విశాఖపట్నం హిందుస్థాన్ షిప్ బిల్డింగ్‌యార్డ్‌లో నిర్మింపబడిన 12,000 డి. డబ్ల్యు. టన్నుల వర్తకఓడ ఎమ్. వి. 'జలకేంద్ర'కు శ్రీమతి ఇందిరా గాంధి జలప్రవేశం చేశారు.

ఏప్రిలు 18 : హైదరాబాదు జంతుప్రదర్శనశాలలో రాష్ట్ర అటవీశాఖామంత్రి పిల్లల విభాగాన్ని ప్రారంభించారు.

## విదేశాలలో

మార్చి 23 : జెనీవాలో ఐక్యరాజ్య సమితి వర్తక సమావేశం ప్రారంభమైంది.

కొలంబోలో 25 అలీన రాజ్యాల రాయబారుల ప్రాథమిక సమావేశం ప్రారంభమైంది.

మార్చి 28 : బర్మా తిరుగుబాటు ప్రభుత్వం అన్నికలపదుకాణాలనుజాతీయంచేసింది.

మార్చి 28 : అమెరికాలోని అలాస్కాలో పెద్ద భూకంపం సంభవించింది.

ప్రభుత్వం ప్రారంభించిన సోషలిస్టు ప్రోగ్రామ్‌పార్టీ మినహా మిగిలిన రాజకీయ పార్టీలన్నిటినీ బర్మా తిరుగుబాటు ప్రభుత్వం నిషేధించింది.

ఏప్రిలు 2 : బ్రెజిల్ అధ్యక్షుడుగా రనేరిమజ్జిల్లి పదవీస్వీకారం చేశారు.

ఏప్రిలు 5 : పుంట్షోలింగ్‌లో భూటాన్ ప్రధానమంత్రి జిగ్మీదోర్జి హత్యకావింపబడ్డారు.

వాషింగటన్‌లో జనరల్ డగ్లస్ మేకార్థర్ పరమపదించారు. ★

# అమృత పదార్థతుందిలం భక్తిజ్ఞాన రసకందరం

# నాయని వారి "వేదనా వాసుదేవం"

అధునాతనాంధ్రకవి లోకంలో "సౌభద్రుని ప్రణయ యాత్ర" రూపంగా భద్ర కవితాయాత్ర చేసి సుస్థిరమైన సమున్నత స్థానం పొందిన శ్రీ నాయని సుబ్బారావు గారిని గురించి ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. మాతృ గీతాలు మమతా స్వరూపాలు కాగా - సౌందర్యలహరి అందచందాల విహారవనం కాగా - కలకండ ఖండాలను పురపించగల ఖండ కృతులు అఖండంగా వెలయగా - శ్రీ సుబ్బారావుగారి కవితామృత హృదయాన్ని, నిరిచ్ఛా భక్తితత్వాన్ని చూరగొనని ఆంధ్రులు తక్కువ. శ్రీ సుబ్బారావుగారి కలంనుంచి యిటీవల వెల్వడిన అప్పుడప్పుడు అవతరించిన అమృతగుటికల పద్య రూపకృతి వేదనా వాసుదేవం.

[ వేదనా వాసుదేవము (పద్యకృతి) కర్త: శ్రీ నాయని సుబ్బారావు. ప్రతులకు - భారత సాహిత్య కళా పరిషత్తు-ఖమ్మం. వెల:అమూల్యమైనా-ఒకరూపాయి. పేజీలు40 ]

కృతిశీర్షిక చూడగానే సుబ్బారావు గారి జీవిత వేదన అంతా ఇందులో ప్రతిఫలించింది కాబోలు అన్న భావం కలగడం సహజం. కాని ఈ చిరుపొత్తం చివరంటా చదివితే ఈ కవితలో ఐహిక వాంఛా సంసిద్ధికి సంబంధించిన వేదన గోచరించదు. సరికదా దానిని మూదలించగల సంతుష్టాంతరంగానందడోలల సంవాదం కనిపిస్తుంది. మానవుడు ఆర్థికంగా అమృతాయమానంగా యావజ్జీవితం కోరవలసిందీ అనుసరించవలసిందీ అనుష్ఠించవలసిందీ నీతి ధర్మబద్ధంగా లభ్యమయ్యేదీ, ధర్మపత్ని రమణీ సుధా ప్రణయితానంద ప్రాప్తి-'ఆత్మా వై పుత్ర నామాసి' అన్నట్లు తానే తన సంతతిగా అవతరించిన సంతతి యశోవైదుష్యాలను కళ్లారా చూచుకొనడం - ఇవి రెండూ లభించి—

నా పత్ని రమణీ సుధా ప్రణయితా
నందమ్ములం దేలితిన్
నా పుత్రీ విదుషీ యశోవిసర వి
న్యాసమ్ములం బొంగితిన్
నా పుత్రులను పండె నీదు చలువన్
మానాథ! సంసారసా
ఖ్యాపూర్ణమ్ముగ నేమి కావలయున
య్యా! యింక నాకిచ్చటన్.

—అని అమందానంద కందళితాంతరంగంతో ఉప్పొంగిపోయే శ్రీ సుబ్బారావుగారిలో పవిత్ర అంతరంగాన్ని వికావికలుచేసే రకరకాల ఐహిక తుచ్ఛ

సమీక్ష

## వాఙ్మయ మహోద్యక్ష

వాంఛా సముచ్చయ వేదన గూడు కట్టుకొన్నదని అనగల ధైర్యం ఎవరికుంటుంది? ఆయన ఎంత అదృష్టవంతుడు! ఇంతటి ఆనందాన్ని యీ విధంగా తన మూలంగా అనుభవిస్తున్న సంతుష్ట సంతోషాంతరంగుడైన తండ్రిని చూడగల కూరిమి కుమార్తె యెంతటి ధన్యాత్మురాలు! సుబ్బారావుగారు అసంతుష్ట వేదనా జీవి కాడు. సంతుష్టవేదనా జీవి. అని ఐహిక వాంఛా వేదనాజీవి కాడు. పారలౌకిక పరమపద ప్రాప్తి ప్రగాఢ వాంఛా వేదనాపరుడు. "తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః దివీవ చక్షురాతతం" అన్నట్లు తన జ్ఞాన నేత్రంతో తత్సచ్చిదానంద గగన నయన ప్రాప్తికై వేదనామయుడవుతున్న భక్తి జ్ఞాన యోగతత్పరుడు. ఆ అగమ్య పథము నందుకోజాలని నన్ను తప్పుపట్టుట న్యాయము కాదన్న విన్నపంతో ప్రారంభమైన ఈ చిరుకృతి "నిత్యతృష్ణాభ్రమాతోన్మదితేంద్రియాళి కుపసంహారమ్ము శాసించినన్ శీఘ్ర ప్రక్రియ నిన్నుఁ జేర్చుకొనుమంతే మోక్షలక్ష్మీశ్వరా!" అన్న ఆత్మత్యాగపూర్వకమైన ఏకైక పరమాత్మపదవీ సంలబ్ధానంద ప్రగాఢేచ్ఛా పూర్ణప్రార్థనతో ముగిసింది. సీతారామాంజనేయ యుద్ధంలో వెలుపల నున్న రాముడు, ఆంజనేయుని అంతరంగమందున్న రాముడు ఆంజనేయుని పేరు మీదుగా పోరాటం సాగించుతున్నప్పుడు అది గుర్తించలేని రామునికి ఆంజనేయుడు తన గుండెలను చీల్చి రాముని చూపించిన దృశ్యాన్ని వద్దన్నా జ్ఞప్తికి తెప్పించగల—

"అన్నా! ఎన్నడునైన నీదరికి గ
ర్వావిష్టతన్నేను రా
నన్నానా, మదిఁ గంపగించుకొని న
న్నజ్ఞాత వాసమ్ము పో
మ్మన్నా వెందుకు, విచ్చి చూచుకొన
వయ్యా నాదు డెందమ్ము శ్రీ
మన్నారాయణమూర్తి దివ్యపద ప
ద్మశ్రీ గుబాళింపదా!

....అన్న పద్యం చదువుతున్నపుడు కలిగే ఆనంద రసానుభూతి సహృదయ హృదయైక వేద్యం. "నీ దగ్గరకు గర్వావిష్టతన్నేను రానన్నానా! నన్నజ్ఞాతవాసమ్ము పొమ్మన్నా వెందుకు? అని ప్రశ్నించడంలోనూ, నా గుండెలు చీల్చి చూచుకో!

గ్రంథ సమీక్ష

# సంప్రదాయ విజ్ఞానజ్యోతి | "మాతృజ్యోతి"

ప్రాణం ఒక్కటి – ప్రాణు లొక్కటి – ఆరోగ్యా నారోగ్యాలు – సుఖదుఃఖాలు – మంచిచెడులు – నిద్రా జాగృతులు అజ్ఞాన విజ్ఞానాలు – రాత్రింబవళ్లు – అన్నీ అందరికీ సమానమే – కాని ఏకత్వంలో భిన్నత్వ మన్నట్లు విభిన్న మతాలు – జాతులు –

---

ఏముం దనుకున్నావు నీ మొహం! నీ పద పద్మశ్రీ గుబాళింపే ఉంది అన్నట్లు సమాధానం చెప్పడంలోనూ ఎంత అందముంది! ఎంత వైచిత్ర్యముంది! ఎంత భావ వైశిష్ట్యముంది! ఎంతటి శక్తి భావముంది. అందులోవున్న లాలన, అందులోవున్న ప్రార్థన, అందులోవున్న గర్వం–ఆగ్రహం –ధీమా–ఎదురులేరిగి ప్రశ్నిస్తున్న ధోరణి, బెదిరింపు – ఇత్యాదిగాగల భావాలను గ్రహించి అనుభవించడంలో ఉన్న ఆనందానికి అంతెక్కడ? ఇంతటి ఆనందాన్ని ప్రసాదిస్తున్న ఆ అమృత పదార్థమయ పద్య నిర్మాతలో ఆ ఆనందస్వరూపం యే రూపంలో వుంటుందో – యే తూకంలో ఉంటుందో! ద్వాదశ స్కంధాలతో ఆంధ్రమహాభాగవత బృహత్కృతిని వెలయించిన మధురకవి పోతన్నను మరపిస్తున్న యీ చిరుకృతిని ఎన్నెన్నో పద్యాలు వ్రాయగా అన్నీ ఇలమైపోగా మిలిగిన "అరయన్ శంతను పుత్రుపై విదురుపై నక్రూరుపై" ఇత్యాదిగాగల ఒకే ఒక పద్యంతో ఆంధ్రుల హృదయ పీఠాలలో చిరస్థాయిగా స్థానం యేర్పరచుకొన్న ఒకానొక ప్రాచీన అజ్ఞాత కవిని తలపిస్తున్న యీ చిరుకృతిని అందరూ చదివి ఆనందించండి, అగాధమైన యీ భక్తిజ్ఞాన రసకందరంలో ఓలలాడండి–అంతులేని యీ అమృత పదార్థ తుందిలం అంతు కొంతైనా తెలుసుకోండి.



ప్రాతిపదికగా యేర్పడిన ఆచారాలు సంప్రదాయాలు అనేకమున్నా వాటి ధ్యేయం వైజ్ఞానికత్వం ఒక్కటే – ఏ ఆచారం యిక్కడ యెప్పుడు యేర్పడినా సామాన్యంగా యేదో ఒక శ్రేయస్సును కోరి యేర్పడిందే – మానవాళి ఆరోగ్యాన్నో అందచందాలనో తీర్చిదిద్దేదిగా నెలకొన్నదే. యిక్కడ సామాన్యంగా అన్నమాట వాడిం దెందుకంటే కొన్ని కేవలం మూర్ఖంగా యేర్పడి వుండవచ్చుననీ ఆ వైజ్ఞానికాలు కావచ్చుననీ తెలియ జెయ్యడానికే–జ్యోతిర్వైద్య వాస్తు మంత్రాది శాస్త్రాలు భారతీయ సంస్కృతికి చరిత్రకు విజ్ఞానానికి జీవనాడులు. దాదాపు యీ శాస్త్రాలలో యే ఒక్క దానికో ప్రమేయం లేకుండా మన ఆచారాలు ఏవీ రూపొందలేదు. అతి ప్రాచీన కాలంనుంచీ మన తాత ముత్తాతల కాలం వరకు ఆచరణలో ఉండి నేడు పాశ్చాత్య సంప్రదాయ ప్రభావంతో యివి కనుమరుగై పోతున్నాయి. వాస్తవానికి నిద్రలేచిన దగ్గర్నుంచీ – కాదు కాదు – నిద్రలేవడం దగ్గర్నుంచి – మొహం కడుక్కోవడం – స్నానం చెయ్యడం – సంధ్యవార్చడం – బట్టకట్టడం–బొట్టుపెట్టడం–తలదువ్వడం– భోజన భోజ్యములు సాగించడం – మాట మాట్లాడ్డం – కార్యాలు చక్కపెట్టుకోవడం – అతిథి అభ్యాగతుల్ని ఆదరించడం – తిరిగి రాత్రి భోంచేసి నిద్రించడం వరకేకాదు, నిద్రించడానికి శయనించే విధం – పద్ధతుల్లో కూడా తుదకు అడుగు తీసి అడుగు వెయ్యడం వరకూ కూడా అన్నీ మన సత్సంప్రదాయాలకు అనుగుణంగా వెలసినవే. అమూల్య వైజ్ఞానికాలైన మన శాస్త్రాలలో నిగూఢమై ఉన్న యేదో ఒక సూత్రాన్నో, తచ్ఛాయనో ఆధారం చేసుకుని అవతరించినవే. అవును మరి, కాళ్ళతో తపతపా నేలను కొడుతూ నడవడం మన సంప్రదాయం కానేకాదు. మన చానలు అంచయానలూ వయ్యారభామలూ ఊరికే కాగలిగారా? బహుముఖమైన మన సంస్కృతిని ఆచారాల స్వరూపాన్ని వాటి మూల శాస్త్రతత్వాన్ని సూక్ష్మాతిసూక్ష్మమైన విషయాలను గ్రహించడానికి యెంతో లోకానుభవం, శాస్త్రానుభవం రెండూ సమ్మేళనమై ఉండాలి. అటువంటి అనుభవంతో మన ఆచార వ్యవహారాల మూలతత్వాన్ని నవలా రూపంలో వివరిస్తూ శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల వెంకట వరదాచార్యులు వారు వ్రాసిన గ్రంథం "మాతృజ్యోతి"

[మాతృజ్యోతి – (నవల) పుటలు 628 వెల రు. 5-00. రచయిత– శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల వెంకట వరదా చార్యులు. ప్రతులకు – మాతృజ్యోతి – శ్రీ రాఘవేంద్ర జ్యోతిషాలయం– బొందల దిన్నె – పి. ఒ. తాడిపత్రి తాలూకా. అనంతపురం జిల్లా.]

కేవల కథానవలా సాహిత్యం పట్ల వ్యామోహిత మవుతున్న నేటి పాఠక లోకం దీన్ని మామూలు సంస్కృతీ చరిత్ర పరిశీలన గ్రంథంగా వెలయిస్తే అట్టయినా తిప్పిచూడని ప్రమాదం సంభవిస్తుందేమోనన్న భయం యీ రచయితలో ఉండడంవల్లనే యిది నవలా రూపం దాల్చింది, ఈ పద్ధతి ఒకందుకు మంచిదే గాని దీనిలో ఉపయోగింప

(మిగతా 90 వ పేజీలో)




అభిసారికలు